శ్రీ కర్పాటి లక్ష్మీనరసయ్య



# జీవితం - నాటకరంగం

రు 12



మానవతావాది, సంఘ సంస్కరణాభిలాషి,

సాహిత్యోపాసకులు, సౌజన్యమూర్తి

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి

**శ్రీ ఆవుల సాంబశివరావు గారు**



ప్రజానటుడు శ్రీ కర్నాటి, శ్రీ కర్నాటిని సత్కరించిన కళా పోషకులు,
మానవతావాది శ్రీ చుక్కపల్లి పిచ్చయ్యగారు.

ఆంధ్ర నాటక కళాసమితి అధ్యక్షులు - కళాపోషకులు



శ్రీ కర్నాటి అభినందన సభాధ్యక్షులు

**శ్రీ కనిగిచర్ల శేషయ్యగారు**



సంచికావిష్కరణానంతరం శ్రీ కర్నాటిని అభినందిస్తున్న శ్రీ ఆవుల సాంబశివరావుగారు

# విషయసూచిక




ప్రతులకు :

**నవజీవన్ బుక్ లింక్స్**

ఏలూరు రోడ్డు - విజయవాడ - 2.

## సంపాదకీయం:

ప్రపంచమే ఒక నాటక రంగం. ఈ నాటక రంగంలో జీవించటమే ఒక కళ. విభిన్న దేశ కాల పరిస్థితులు, వివిధ రాజకీయాలు, విభిన్న వ్యక్తిత్వాలు, వివిధ సమస్యలు – వీటి వలయంలో జీవిస్తూనే సతమతం కాకుండా సామరస్యంతో చాకచక్యంగా జీవించటమే ఒక కళ. ఇది అందరికీ సుసాధ్యమైనదికాదు. అధికాధికమైన జనాళికి జీవనగతి అలల కడలివంటిదైతే బహు కొద్దిమందికి మాత్ర మది నిదాఘ నదీపూరం వంటిది. సామాన్యుడ్ని, సంపన్నుడినికూడ సదవగాహనతో పరిశీలించి నేర్పుతో ఓర్పుతో తన గమ్యానికి అనుకూల పరిస్థితులు సృష్టించుకొని జీవించగల్గటమే ఒక కళ.

ఈ విధమైన కాలగమనంలోనే వికసించిన మానవ మస్తిష్కంలో, నిత్యజీవన వ్యాపారానికి అభిన్నంగా ఆనందానుభూతుల ప్రేరణతో చైతన్య సంస్కారాల ఒరవడితో విజ్ఞాన, సాహిత్యాల వికాసం ఆరంభమైంది. క్రమంగా మానవుని ఊహాపథం నుంచి సంగీత నృత్య నాటకాది కళలు వెలువడ్డాయి. ఈ కళలు జానపద కళారూపాలు, బుర్రకథలు, నాటకాలు మొదలైన వివిధ రూపాల్లో అనేక అలంకారాలు సంతరించుకొని పామరశ్రేణి నుంచి పండిత స్థాయి వరకు ప్రజాబాహుళ్యాన్ని అలరిస్తున్నాయి. ఈ కళా రంగంలో ముఖ్యంగా నాటక రంగం అన్ని తరగతుల ప్రజలను తరతమ బేధం లేకుండా ఆబాలగోపాలాన్ని ఆకర్షిస్తోంది. అంటే అఖండ ప్రజానీకానికి వినోదం, విజ్ఞానం, చైతన్యం – రస సమ్మిశ్రంచేసి సమకూర్చగల అమోఘమైన శక్తి నాటక రంగానికి వున్నదనటం అతిశయోక్తికాదు. అందుకనే కళాత్మకంగానూ, సాహితీ పరంగానూ "కావ్యేషు నాటకం రమ్యమ్" అన్నాడు మహాకవి.

నాటకమనేది గొప్ప ప్రయోగం. ఈ ప్రయోగ సాఫల్యం రచయితపైనా, దర్శకుని పైనా, సాంకేతిక నిపుణులపైనా, నటీనటులపైనా ఆధారపడివుంది. రచయిత సందేశాన్ని దర్శకుని సంకేతాన్ని ప్రేక్షకుల మనస్సుతో అనుసంధానం చేయవలసినవాడు నటుడు. అందు వల్ల నటీనటుల సామర్థ్యం గణనీయమైనది. రసస్ఫూర్తి, భావస్ఫూర్తి స్ఫురింపచేయగల నటుడే ప్రజాదరణ పొందగలడు.

నటన బహు క్లిష్టమైనది. విభిన్నతత్వాలు, రూపాలుగల పాత్రలను ధరించినపుడు తన పాత్రలో లీనమై ఏకత్వంలోని విభిన్నత్వాన్ని ప్రదర్శించి, ప్రేక్షకులకు 'నటన' అనిపించకుండా ఊహాజగత్తులో వాస్తవికతను దర్శింపజేయ గలిగినపుడు, నవరసాలు ప్రదర్శించి, ప్రేక్షకుణ్ణి రసానుభూతితో ద్రవీభవింపజేయ గల్గినపుడు నటన తారస్థాయిని అందుకుంటుంది. ఇలా తాను ధరించిన ప్రతి పాత్రను రాణింప జేయగల నేర్పుగలవారే మహా

నటుల కోవకు చెందుతారు. ఇలాంటి మహానటు లెవరని మనంఅంచనా వేయటం ఆరంభించగానే మన స్మృతిపథంలో మెదిలేవారిలో బహుముఖ ప్రజ్ఞాశాలి శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు.

శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారిని గూర్చి వ్రాయాలంటే నా చేయి అలుస్తుందేమో కాని, ఆయన నటజీవిత విశేషాలు తరిగేవికావు. ఆ సాహసానికి పూనుకోకుండా వారి ప్రతిభా వ్యుత్పత్తులనుగూర్చిన కొన్ని ఉదాహరణలు మాత్రమే వుటంకిస్తాను.

ఈయన ఆంధ్రనాటక రంగంలో అడుగుపెడ్తూనే 'ముందడుగు' లో ముందడుగువేసి, 'మా భూమి' లో మంచి భూమిక నిర్వహించి, 'మా వూరు' నుంచి ఈ వూర, అన్నివూళ్ళ 'ప్రగతి' పిచ్చివాడుగా, దర్శనమిచ్చి, 'ప్రెసిడెంట్ పట్టయ్యగా' బహు భేష్ అనిపించుకొని, 'చైర్మన్' ఆదిగాగల నాటికలు, నాటకాలెన్నింటిలోనో వివిధ భూమికలు ధరించి, ప్రతిభావంతంగా తన పాత్ర నిర్వహించి ఆంధ్రావనిలో ఒక 'కారెక్టర్ యాక్టర్', 'అనర్ఘ నటరత్నం' అనిపించుకొన్నారు. ఆ సీమ – రాయలసీమలోను, ఈ తీరం – సర్కారులోను, ఆ మాగాణము – తెలంగాణములోను పర్యటించి ముక్కోటి (ఇప్పుడు సంఖ్య తప్పనిసరిగా పెరిగి వుంటుంది) ఆంధ్రులను తమ నటనా వైదుష్యంచేత మంత్రముగ్ధులను చేశారు. డాక్టరు రాజారావుగారు స్థాపించిన ప్రజానాట్యమండలిలో ప్రవేశించి, ఆ సంస్థ యొక్క మరో సాంస్కృతిక శాఖగా ఏర్పడి నైజాం వ్యతిరేక పోరాటానికి ప్రజావాహిని నాయత్తం చేయడంలో ప్రముఖ పాత్ర వహించి వాడ వాడలా తిరిగి కథలు చెప్పారు. కొంతకాలం ప్రజానాట్య మండలి కృష్ణాజిల్లా శాఖలో ప్రదర్శన నిర్దుష్టంగా నుండేటట్లు, నటుడు నిజాయితీతో నటించ గలిగేటట్లు నిరంతర కృషిసల్పిన కోడూరి అచ్చయ్యగారి శిక్షణలో నిగ్గుతేలారు. వీరు ప్రచారం చేసిన కథల్లో 'కష్టజీవి' కథ యువకుల నుద్రేకపరిచేది. సామాన్య ప్రజను కరుణా వాహినిలో ముంచెత్తేది. వీరి సహ కళాకారులు నేటికీ కొంతమంది సినీనటులుగా కళోపాసన చేస్తున్నారు. 'మాభూమి'లో మంగలి రాముడు పాత్ర ధరించి నటనా కౌశలానికి భూమిక విలువ నిమిత్తం కాదని నిరూపించి, నార్ల, గోపీచంద్‌వంటి సుప్రసిద్ధ సాహిత్యకారులచే ప్రశంసలు పొందారు. ప్రజానాట్యమండలి నిషేధింపబడినతరువాత ఆవిర్భవించిన 'ఆంధ్ర ఆర్టు థియేటర్'లో ప్రవేశించి తిరిగి తోటి కళాకారులతో బుర్రకథలు ప్రచారం చేశారు. కొంతకాలం ప్రఖ్యాతి నందిన నాజరు 'బుర్రకథ' దళంలో ప్రవేశించి, ఆంధ్ర జానపద కళారూపాల్లో ప్రసిద్ధి చెందిన ఈ కళారూపంలో పాత్రధారియై 'భళిరాభళి' అని వంత పాడుతూ హాస్యం, రాజకీయం, చతురోక్తులు విరజిమ్ముతూ వాడ వాడలా ప్రచారంచేస్తూ రస సమ్మోహనాస్త్రంతో ఆంధ్రదేశం లోని ఆబాలగోపాలాన్ని చైతన్యవంతము, రసప్లావితముచేసి వారిచేత తిరిగి 'మేల్‌భళీ'యని యనిపించుకొన్న దిట్ట. ఆంధ్రదేశ జానపద కళారూపాలైన జముకులకథ, గొల్లసుద్దులు

మొదలైనవాటి నెన్నింటినో బహుళ ప్రచారం చేశారు. ఏ కళారూపాన వీరు దర్శన మిచ్చినా అది ప్రజా హృదయాలలో నిల్చివుంటుంది. తరువాత డాక్టరు రాజారావుగారి 'పుట్టిల్లు' సినిమాలో నటించారు.

1967 లో పునరుజ్జీవింపబడిన 'ప్రజానాట్యమండలి'లో చెదరిపోయిన కళాకారు లందరితోపాటు తిరిగి ప్రవేశించారు. ఆ తర్వాత 'ఎవరు ద్రోహి', 'మానవుడు చిరంజీవి', 'ఏవో ఘోషలు వినబడుతున్నాయ్', 'అంతా పెద్దలే' మొదలైన కళారూపా లెన్నింటిలోనో ప్రముఖ పాత్ర వహించి ప్రజా కళారాధకుడుగా, నటుడుగా విలక్షణమైన, చిత్ర విచిత్ర ప్రవృత్తులుగల పాత్రలను సమర్థవంతంగా నిర్వహించి, 3 దశాబ్దాలపాటు నట జీవితం సాగించి ఆంధ్ర నాటక రంగంలో చిరకీర్తి నార్జిస్తూ అజేయులై నిలిచారు. రేడియో ఆర్టిస్టుగా వీరి ప్రతిభ నిత్యం మన వీనుల్లో మార్మోగుతూనే వుంది. ఎన్నో నాటకాలకు ప్రయోక్తగా, దర్శకులుగా వ్యవహరించి జయధ్వజ మెత్తారు. స్ఫురద్రూపి, వాక్చాతురి, నిండుమానసి, స్నేహపాత్రుడు, అభ్యుదయ పథగామిగా, సజ్జనాళి హృదయాల్లో కళాంజలి ఘటిస్తూ నిరంతర కళాతపస్విగా కళ ప్రజల కొరకని మనందరి మధ్య భాసిస్తున్న కీర్తిలతాకాంతుడు శ్రీ కర్నాటి గారిని గూర్చి నేను అల్పమైన నా సొంత మాటల్లో వ్రాసేకంటే పలు పెద్దల, పత్రికల అభిప్రాయ వాణిని, అభినందన పరంపరను మీ ముందుంచుతున్నాను.

'శిక్ష' అనే నాటకంలో మానవుడు పాత్రలో వీరిని చూచిన కీ. శే. శ్రీనివాస చక్రవర్తిగారు – "ఆంధ్ర నాటక రంగంమీద ఒక అగ్నికణం, ఒక మహానటుడు వెలిశా" డని అన్నారు.

'ప్రగతి' నాటికలో పిచ్చివాడుగా వీరి నటనచూచి – "పగటి వేషగాడు, ప్రేక్షక ప్రజల కళ్ళనిట్టే మోసం చెయ్యగల"దని వీరి నటనా చాతుర్యాన్ని శ్లాఘించారు.

"K. L. N. as director & the chief Villain discharges two heavy responsibilities Commendably"— అంటూ Sunday Standard పత్రిక కొని యాడింది.

మద్రాసు త్యాగరాయ నగర్‌లో కృష్ణ గానసభకు విచ్చేసిన ముఖ్య అతిథి కరుణానిధిగారు "The Play was notable for K. L. N.'s superb protrayal of charity -superb acting in Telugu" — అని ప్రశంసించారు.

దైవదత్తం అయిన శక్తిని దైవస్వరూపులు అయిన ప్రజలను ఆరాధించుటకై మీరు వినియోగపరుస్తున్నారు. అందుకే మీ నడవడికలో నమ్రత, మాటలలో సూనృతం, చేతలలో ఆరాధన గోచరిస్తయ్.

''బహుముఖమూ, వైవిధ్యమూగల ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకొని బహుత్వంలోని ఏకత్వమైన మైత్రిని మీరు చూస్తారు, చూపుతారు" అని నిండు హృదయంతో చెప్పారు కీ. శే. బలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు..

''భాష సాంకేతికమైనది, ఆ భాష వెనుకగల అమూల్యమైన భావాన్ని అందుకొని, దానికి రూపకల్పనచేసి, తన పాత్రకు ప్రాణప్రతిష్ఠచేసి, ప్రాణంతో సజీవంగా నడిపినవాడే నటుడు. అట్టి నటునకు రేడియోలో వున్న అవకాశం తక్కువే అని చెప్పాలి. ఈ అన్నివిధాలా కృషిచేసి తాను సాధించే విజయాన్ని శ్రవ్యనాటికలో నటుడు కేవలం ఉచ్చారణ ద్వారానే సాధించవలసివుంది. దీనిని సాధించడంలో శ్రీ లక్ష్మీనరసయ్య తాను నిర్వహించిన 80-90 రేడియోనాటికల్లో కృత కృత్యుడయ్యా"డన్నారు.- A. I. R. నాటక ప్రయోక్త కీ॥ శే॥ బందా కనకలింగేశ్వరరావుగారు.

ఆంధ్ర ఫిలించేంబరు అధ్యక్షులు పి. జి. బెనర్జీగారు ''తనను ఎక్కువగా ఆకర్షించిన తక్కువ కళాకారులలో శ్రీ లక్ష్మీనరసయ్య ఒకరని, ఆయన నటన ఒక నూతన పంథాతో కూడుకొన్న'' దని అన్నారు.

శ్రీ లక్ష్మీనరసయ్యగారు తమ క్రియాత్మక శక్తికి, స్నేహపాత్రతకు, కళారాధనకు, నేర్పును ఓర్పును జోడించి, కళోద్ధరణకు, ప్రజాహితంగా నాటకరంగవికాసానికి స్థిరపునాదులు వేయాలని సంకల్పించి కళాభిమానులను సూదంటురాయిలా ఆకర్షించి సూత్రబంధంచేసి 'ఆంధ్ర నాటక కళాసమితి' ని స్థాపించి అల్లారుముద్దుగా, అపురూపంగా పోషిస్తూ పదేళ్ళ ప్రాయానికి పెంచారు.

ప్రజా నటుడు, ప్రజాభిమాని, కార్యశూరుడు, అభ్యుదయవాది, వక్త, చతుర వచోనిధి, నటరత్న శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారి ''జీవితం - నాటకరంగం'' సంచిక యీనాటికైనా వెలువడడం ఆంధ్ర నాటక రంగానికి, కళామతల్లికి గర్వకారణంగా భావిస్తున్నాము. ఈ సంచికను వెలువరించటానికి ప్రేమతో ఆర్థిక సహాయము చేసిన కళాభిమానులకు, రచనలు పంపిన వ్యాసకర్తలకు, అభినందన సందేశాలు పంపిన కళాకారులకూ సహృదయులకూ మా సంపాదకవర్గం తరఫున మనస్సుమాంజలి అర్పిస్తున్నాము. ఈ సంచికను సాహిత్యోపాసకులు, బహు వ్యాసకర్త, సౌజన్యమూర్తి, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి - శ్రీ ఆవుల సాంబశివరావుగారు ఆవిష్కరించటం మహద్భాగ్యంగా భావిస్తూ వారి కళాభిమానానికి మా కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాం. ఈ సంచిక అందచందాలకు రూపు రేఖలు దిద్దిన చిత్రకారులు శ్రీ గీతా సుబ్బారావుగారికి, ఉడుతాభక్తితో సహాయపడినవారికి, అండగా నిల్చిన మేరునగసములకు మా కళాంజలి.

శ్రీ లక్ష్మీనరసయ్యగారి సేవాభాగ్యం ఆంధ్ర నాటక రంగానికి అజరామరమై నిలవాలని, కళాభిమానులు, ఆంధ్ర నాటకరంగం వారి కృషిని సదా గుర్తించగలరని విశ్వసిస్తున్నాము.

— సంపాదకుడు

# ఆకాంక్ష - అభినందన : రెండూ ఒకటే

డా॥ సి. నా రా య ణ రె డ్డి

లక్ష్మీనరసయ్యగారి వయస్సు యాభై ఏళ్ళు. ఆయన నటనానుభవం ముప్పదియైదేళ్ళు. ముప్పది యైదేళ్ళ కృషిని మూటకట్టి చూపుతున్నది ఈ అభినందన సంచిక.

లక్ష్మీనరసయ్యగారిని నాకు పరిచయంచేసింది 'అల్లీముతా'
ప్రపంచ తెలుగు మహాసభల వేదిక అది.
ఆనాటి సాంస్కృతిక కార్యక్రమాలకు వ్యాఖ్యాన నిర్వహణ బాధ్యత నాది.
గేయరూపకం సాగిపోతున్నది.
తెల్లని దుస్తుల్లో ఒకవేషం. చిన్నపరెడ్డి పాత్ర ప్రవేశం.
నిండుగా ఉంది వ్యక్తిత్వం. తొణకనికుండలాఉంది మనస్తత్వం. చిన్నపరెడ్డి పాత్రలో లక్ష్మీనరసయ్యగారిది విలక్షణ మూర్తిత్వం.
లక్ష్మీనరసయ్యగారు చేపట్టని జానపద కళారూపంలేదు.
బుర్రకథ, జముకులకథ, గొల్ల సుద్దులు, జంగంకథ, వీధి భాగోతం.
ఇవిగాక అనేక సాంఘిక నాటకాల్లో పాత్ర ధారణం. అసంఖ్యాక వేదికలపై గాత్ర ధారణం.
అప్పటి కప్పుడే ఒక ఇతివృత్తాన్ని అనుకొని అక్కడికక్కడే డైలాగులు చెబుతూ నటించడం.
లక్ష్మీనరసయ్యగారు చేసిన ఎన్నదగిన ప్రయోగం. ఆశుకవిత్వంలాంటిదే ఇది— ఆశు నాటిక.
ప్రజానాట్యమండలితో ఎన్నో ఏళ్ళ అనుబంధం లక్ష్మీనరసయ్య గారిది.
ఆంధ్ర నాటకకళా సమితి వీరి నిరంతర కళాతృష్ణకు తీర్చిన చలివేంద్ర.
నటుడుగా, జానపద కళారూప ప్రయోక్తగా, కళా సమితి నిర్వాహకుడుగా లక్ష్మీనరసయ్యగారు సాగిస్తున్న అక్రాంత యాత్రలో ఈ అభినందన సంచిక ఒక మజిలీ.
ఇక్కడఆగి, ఒక్కమాటు గతాన్ని తలచుకొని, రెండు ఆనందాశ్రువుల్ని రాల్చి, పురోదృక్కుతో తిరిగి చూడకుండా సాగిపోవాలి లక్ష్మీనరసయ్యగారు.

ఇదే నా ఆకాంక్ష
ఇదే నా అభినందన.
నిజానికి ఈ రెండూ ఒకటే

# ఉత్తమ కళాకారుడు - కర్నాటి

కళావాచస్పతి
—కె. జగ్గయ్య

మిత్రులు శ్రీ లక్ష్మీనరసయ్య గారితో నాపరిచయం ఈనాటిదికాదు, దాదాపు రెండున్నర దశాబ్దాలస్నేహం మాది. కళ కోసమే కళ అన్న ఛాందస వాదాన్ని పట్టుకొని వ్రేలాడే నటుడుకాదు శ్రీ లక్ష్మీనరసయ్య. కళ మానవ శ్రేయస్సుకు, మానవసేవకు వినియోగపడాలని మనసారా ఆశించే ఉత్తమ కళాకారుడు. అందుకే శ్రీ లక్ష్మీనరసయ్యనుగురించి ఒక్కమాట చెబుతేచాలు. అక్షరాలా ఆయన ప్రజానటుడు. కర్నాటి పేరు వినగానే నాకెన్నో మధుర స్మృతులు గుర్తుకువస్తాయి. కళారంగానికి వారిసేవ నిరుపమానం వాస్తవానికి శ్రీ లక్ష్మీనరసయ్యగారి వలె మన జానపద కళారూపాలను రీతులను సమగ్రంగా సేకరించి అధ్యయనంచేసి ప్రదర్శనల రూపంలో ప్రజలకు అందించిన వారు బహుశా వ్రేళ్ళమీద లెక్కించదగినంత మందికూడా లేరంటే అతిశయోక్తికాదు. అలాగే మన తెలుగు జానపద కళా రూపాలనుగురించి అధికార పూర్వకంగా చెప్పగలిగిన ఆ నలుగురైదుగురు నిష్ణాతులలో శ్రీ లక్ష్మీనరసయ్య ఒకరు.

మిత్రుడు శ్రీ లక్ష్మీనరసయ్యను యీనాడు సన్మానించే సదవకాశం నాకు లభించినందులకు చాలా ఆనందిస్తున్నాను. వారిని సన్మానించడమంటే కళను గౌరవించడమే. కళా కారులందరిని సన్మానించడమే.

ఇది ప్రజాయుగం కనుక ప్రజలే యిలాంటి ప్రజానటుల్ని గుర్తించి సముచితంగా గౌరవించడం జాతి ఉజ్వలతకు గీటురాయి కాగలదు.

ఈ మిత్రునకు నా అభినందనలు.

కళావాచస్పతి

**కొంగర జగ్గయ్య**

(23-1-1975 వతేదీన విజయవాడ సోషల్ క్లబ్ అండ్ లిటరరీ సొసైటీ వజ్రోత్సవాల సందర్భంగా శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య గారిని సన్మానిస్తూ కళావాచస్పతి శ్రీ జగ్గయ్యగారు చేసిన ప్రసంగ సారాంశం)

**

# నటరత్న
# కర్నాటి లక్ష్మీనరసయ్య

'నటచక్రవర్తి'

**మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి**

కళ ఒక సాధన. ఇది ఒకరిద్వారా అభివ్యక్త మౌతుంది. మరొకరి అనుభూతిని కలిగిస్తుంది. అభివ్యక్తమైన కళా పరిణామమే కళాకారుని గమ్యం. ఈ గమ్యంవైపు పురోగమించి, తమ జీవితాలనే పునీతం చేసుకున్న కళారాధకులు బహుకొద్దిమంది. అలాంటివారిలో ప్రసిద్ధ నాటకరంగ నటులు కర్నాటి లక్ష్మీనరసయ్య గారొకరు.

తెలుగు నాటకరంగంలో దాదాపు మూడు దశాబ్దాలుగా అమోఘమైన కృషి సలిపి ఆంధ్రజాతీయతను ప్రతిబింబించే జానపద కళారూపాలైన "బుర్రకథ" "జముకులకథ" రూపకం, వీధినాటకం, రేడియో మొదలైన వివిధ కళారూపాలలో లక్ష్మీనరసయ్య రస స్వరూపాన్ని దర్శించాడు, ప్రదర్శించాడు. ఆయన నిర్వాహణ నిర్దుష్టమైనది, నిరుపమానమైనది. ఏ కళారూపం చేపట్టినా దానిని ప్రజాహృదయాలలో హత్తుకు పోయేటట్లు చేసే ప్రతిభ ఆయనకువుంది.

కొన్ని విలక్షణమైన చిత్ర విచిత్ర ప్రవృత్తులు గల పాత్రలను ధరించి ఒప్పించడంలో తనకు తానే సాటి అనిపించుకున్న కారెక్టర్ యాక్టర్ లక్ష్మీనరసయ్య.

లక్ష్మీనరసయ్యలో చైతన్యంవుంది. అంతేగాదు, జనంలో చైతన్యాన్ని కలిగించే శక్తివుంది. ఉత్తమ నటనకది లక్షణం. స్వభావసిద్ధమైన కళను స్వయం కృషితో వికసింప జేసుకున్న ప్రతిభావంతుడు లక్ష్మీనరసయ్య.

లక్ష్మీనరసయ్య నటుడిగా, నిజాయితీతో, నిగ్రహంతో, ప్రతి చిన్నవిషయాన్ని పరిశీలించి తెలుసుకుంటూ తన నట జీవితానికి న్యాయం కలిగించుకుంటూ వచ్చాడు. తెలుగు నాట వర్తమాన కాలంలో ఇలా నిరంతర సాధనచేసే నటులు కొద్దిమందే వున్నారు. ప్రజానాట్యమండలి, ఆర్ట్ థియేటరుల నాటినుండి నేటి ఆంధ్ర నాటక కళాసమితి వరకూ ఆయన ఈ రంగానికి చేసినసేవ అపారమైనది.

లక్ష్మీనరసయ్య పరువుగల రైతు కుటుంబములో కృష్ణాజిల్లా, తిరువూరు తాలూకాలోని తునికిపాడులో జన్మించాడు. తల్లి రాజమ్మ; తండ్రి వెంకయ్య; పెరిగింది, చదివింది మధిర తాలూకా దెందులూరులో, ఖమ్మం హైస్కూలులో విద్యాభ్యాసం చేసి వురుదూభాషలో పరిచయం సంపాదించాడు; కాని ఆయన 16 వ యేట చదువుకు అంతరాయం కలిగింది. ఒక యేడాది బడిపంతులు వుద్యోగం చేశాడు.

అక్కడే ఒక నాటక సంస్థ తలఎత్తింది, అదే ప్రజానాట్యమండలి.

నూతనాశయాలతో, నవీన భావాలుగల నవ్య నాటకాలను ప్రదర్శించడమే ప్రజానాట్యమండలి సంకల్పం.

ఈనాట్యమండలి ప్రదర్శించే "ముందడుగు" నాటకంలో కథానాయక పాత్ర ధరించాడు. ఆ నాటకం ప్రజానీకాన్ని ఎంతగానో ఆకర్షించింది. ఆ నాటకాన్ని చూచిన రాజారావు లక్ష్మీనరసయ్యను మెచ్చుకొని ఉత్సాహాన్నిచ్చారు.

ఆసమయంలో ప్రజానాట్యమండలి కళారూపం నాజరు బుర్రకథవిని, ఉత్తేజితుడై మాచనేని వెంకటేశ్వరరావు వద్ద బుర్రకథలో శిక్షణ పొందాడు. ఒక ప్రక్క రంగస్థలం మీదా, మరోపక్క రాజకీయాలతో విరామం లేకుండా పనిచేశాడు. తెలంగాణాలో కొద్దికాలం కారాగారవాసంలో వున్నాడు.

ఆతర్వాత లక్ష్మీనరసయ్య విజయవాడ చేరుకొని, కృష్ణా జిల్లా ప్రజానాట్యమండలిలో ప్రవేశించి, "మాభూమి" నాటకంలో మంగలి రాముడు పాత్రను ధరించి, సమర్థవంతంగా నిర్వహించి మంచి పేరు తెచ్చుకోవడమేగాక, మద్రాసులో ప్రదర్శించినప్పుడు గోపీచంద్, నార్లగార్ల ప్రశంస లందుకున్నారు. జిల్లా ప్రజానాట్యమండలిలో కోడూరు అచ్చయ్య చెరుమాళ్ళగారు లక్ష్మీనరసయ్యకు మంచి శిక్షణ యిచ్చారు.

ఇంతలో ప్రభుత్వ నిర్బంధం ఎక్కువై "మాభూమి" నాటకం నిషేధించబడటంతో మిక్కిలినేని ఉమామహేశ్వరరావుగారితో కలిసి బుర్రకథలు, జముకులకథలుచెప్పడం ప్రారంభించి రాష్ట్రవ్యాపితంగా ప్రదర్శనలనిచ్చారు. నాజరుతో కలసి పదిసంవత్సరాలు బుర్రకథలు చెప్పారు. కథల్లో రాజకీయాలూ, హాస్యం చెప్పడం లక్ష్మీనరసయ్య ప్రత్యేకత. విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో కేంద్ర మంత్రి దివాకర్ సమక్షంలో "ప్రహ్లాద వీధినాటకం" వినిపించారు. ఢిల్లీవెళ్ళి రిపబ్లిక్ ఉత్సవాల్లో పాల్గొని జానపద గేయాలు ఆలపించారు.

జానపద కళారూపాల్లో పాల్గొంటూనే విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయ వైజ్ఞానికశాఖ ఆంధ్ర ఆర్ట్ థియేటర్ లో ప్రవేశించి ఆర్ట్ థియేటర్ ప్రదర్శించే అన్ని నాటకాల్లోనూ ప్రముఖ పాత్రలు ధరించడమేగాక క్రమశిక్షణ, గ్రంథపఠనం, నిర్ణయించుకున్న కార్యక్రమాన్ని నిర్ణీతవేళకు పూర్తి చేయడం మొదలైన పద్ధతుల్ని, ఉదాత్త విషయాలను మిక్కిలినేనివారి తోడ్పాటుతో నేర్చుకున్నారు. అనిసెట్టి "గాలిమేడలు" నాటకంలో హాస్యంతో కూడిన దుష్టపాత్రను ధరించారు. "మావూరు" నాటకంలో మహంకాళి పాత్రను అభిమాన పాత్రగా తీర్చిదిద్దుకున్నారు. ఆయన నటజీవితంలో ఆ పాత్ర ఒక మైలురాయిగా నిలబడింది. అలాగే ఆత్రేయ రచించిన "ప్రగతి" నాటకంలో పిచ్చివాని పాత్రను అసమాన్యంగా నటించారు. రెంటాల వ్రాసిన "అంతా పెద్దలే" నాటకంలో వైసుల పాత్రను కొత్త పద్ధతిలో నటించి మంచి పేరు తెచ్చుకున్నారు ఒక్క "మావూరు" నాటకమే 80 ప్రదర్శనలు ఇచ్చారు.

కొత్త నాటకాలలో కొత్త పాత్రలను తీసుకొని సరికొత్త భావాలతో కొత్త పద్ధతిని ప్రదర్శించడం లక్ష్మీనరసయ్య ప్రత్యేకత. శివం వ్రాసిన "నేరము - శిక్ష" నాటకంలో శ్రీరంగం విలన్ పాత్ర ధరించి కొప్పరపు, రాజారావుగార్ల ప్రశంసలందుకున్నారు. "ఛైర్మన్" నాటకంలో స్వామీజీ పాత్రలో ఆయన నటన మరువరానిది. "ప్రెసిడెంట్ - పట్టయ్య"లో పట్టయ్య పాత్ర అద్భుతం. ""ఎవరు ద్రోహి ?" నాటికకు దర్శకుడుగాను, నటుడుగాను వుండి ప్రజానాట్యమండలి కార్యకర్తగా మంచి పేరు తెచ్చుకున్నారు. "మానవుడు చిరంజీవి" అనే వాక్చిత్రాన్ని ఆయన పర్యవేక్షణలో కొన్ని వందల ప్రదర్శన లిచ్చారు. "వాసవీ కన్యకాపరమేశ్వరి" నృత్యనాటికకు వ్యాఖ్యాతగా ప్రఖ్యాతి పొందారు.

లక్ష్మీనరసయ్య కంఠం గంభీరమైనది. మంచి ఒడుపుగలది, చక్కని మాడ్యులేషన్‌తో సంభాషణలు చెప్పగల సమర్థుడు. అందుకే ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో మంచి నాటకాలలో కొన్ని వందలసార్లు

పాల్గొని బందావారి ప్రత్యేక ప్రశంసల నందు కున్నారు.

"ఈనాడు", "గాలిమేడలు", "మావూరు", "ఆసామి", "ఛెయిర్మన్", "సీతారామరాజు", "ఎవరుద్రోహి ?", "ప్రెసిడెంట్ పట్టియ్య", "అంతా పెద్దలే", "నేరము - శిక్ష", "స్పూత్నిక్ యాత్ర" వీధినాటకం, "మానవుడు చిరంజీవి" వాక్చిత్రం, "జీవితపథం", "తుఫాన్", "జీతగాడు"; "ప్రగతి", "శిక్ష" మొదలైన నాటకాలలోనూ నాటికలలోనూ భిన్న విభిన్న పాత్రల్ని వైవిధ్యంతో ప్రదర్శించడమేగాక, రేడియో శ్రవ్య నాటకాలలో "ప్రతిమ"లోరావణుడుగా "ప్రభావతీప్రద్యుమ్నం"లో దానవాధీశుడు "ప్రతిజ్ఞా యౌగంధరాయణం"లో మహాసేనుడు "కర్ణ"లో కర్ణుడు, "పాంచరాత్రం"లో ద్రోణుడు, అశోకుడు, చిన్నపరెడ్డి మొదలైన పాత్రలను అతి సమర్థవంతంగా పోషించారు.

ఒక్క మాటలో చెప్పాలంటే ప్రసిద్ధ నటుడు కె. వెంకటేశ్వరరావుకు ప్రారంభ దశలో "తుఫాను" "టీ కప్పులో తుఫాను" మరో నాటకంలోనూ శిక్షణ ఇచ్చాడంటే లక్ష్మీనరసయ్య ప్రతిభా విశేషాలు ఎటువంటివో చెప్పవలసిన అవసరంలేదు.

ఆయన కళాసేవలను ప్రస్తుతిస్తూ, ఆంధ్ర దేశంలో అనేక నాటక సంస్థలు ఘనంగా సన్మానించాయి. ఉన్నత విద్యాభ్యాసం లేకపోయినా, ఉత్తమ సంస్కారంపొంది, కళాసంస్థలను నిర్మిస్తూ, కళారాధకులను సన్మానిస్తూ, కళాసరస్వతిని ఆరాధిస్తూ, జీవితమే కళగా తీర్చిదిద్దుకుంటూ పదిసంవత్సరాలుగా ఆంధ్రనాటక కళాసమితిని స్థాపించి ఆ సంస్థ అభివృద్ధికి నిరంతరం పాటుపడుతున్న కళాజీవి కర్నాటి లక్ష్మీనరసయ్య.

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక సౌజన్యంతో)

★★



ఎరుకను కలుగజేసేది విద్య. అందం గొలిపేది కళ. చదివి నేర్చినది విద్య. నేర్పుతో చేసినది కళ.

విద్య విజ్ఞాన సముపార్జనకు తోడ్పడుతుంది. కళ జీవితాన్ని సౌందర్యమయం చేస్తుంది. విద్యకూ, కళకూ ఉన్న తేడా ఇదే :

— ఒక సాహిత్య విమర్శకుడు

# "ప్రజల కళాకారుడు"

— నేరెళ్ళ వేణుమాధవ్,

(ధ్వన్యనుకరణ సమ్రాట్)

ప్రియ మిత్రులు శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారి గురించి పది పదిహేను వాక్యాల్లో చెప్పడమంటే సముద్రాన్ని సీసాలో బంధించినట్లవుతుంది.

సముద్రంలోవున్న సిరిసంపదల్ని అవగాహన చేసుకోవడం, అంచనా వెయ్యడం ఎంత కష్టమో లక్ష్మీనరసయ్యగారిలోని ప్రజ్ఞా పాటవాల్ని. కళాతృష్ణని కొలవడంకూడ అంతే కష్టం. కళారంగంలో ఆయన చేపట్టని ప్రక్రియలేదు. ఒక్క నా ధ్వన్యనుకరణ తప్ప అనుకుంటే అదికూడా ఆయనకు కష్టం కాదు. లక్ష్మీనరసయ్యగారు చేపట్టిన కళారూపాల్లో ఒక ప్రత్యేకతవుంది. వారి కళారూపాలన్ని ప్రజలకు అతి సన్నిహితంగా వుండే కళారూపాలు. ఒక్క మాటలో చెప్పాలంటే జానపద కళావాహిని శ్రీ లక్ష్మీనరసయ్య.

కొంతమంది కళాకారులకి కళమీద జీవనోపాధిని సంపాదించుకునే అవకాశం కలుగుతుంది. కొంతమంది కళాకారులకి కళకోసమే జీవితాన్ని అంకితంచేసే అదృష్టం కలుగుతుంది. ఈ రెండవ కోవకు చెందినవారు శ్రీ లక్ష్మీనరసయ్య. అందుకే అతను కళాకారులందరికి ఆత్మీయుడు. అన్నిటికీ మించి అతను జనం కళాకారుడు.



విశిష్టమైన కొన్ని శబ్దాలు విన్నంతనే ఒకానొక ఆహ్లాదం కలుగుతుంది. సహృదయుడికి ఆహ్లాదకరం కలిగించేదే రమణీయకత. అలాంటి రమణీయమైన అర్థాన్ని ప్రతిపాదించే శబ్దమే కావ్యం. రసవంతమైనది. రమణీయం కూడా కాక తప్పదు. కనుక రసాత్మకత్వం రమణీయకతలో అంతర్భూతం.

— జగన్నాథుడు.

# నాకు తెలిసిన లక్ష్మీనరసయ్యగారు

— సి. యస్. రావు, ఎం. ఏ.,

కర్నాటి లక్ష్మీనరసయ్యగారి పేరు దాదాపు పదిపదిహేనేళ్ళక్రితం విన్నాను. ఒక ఏడాదిక్రితం స్వయంగా వారిని కలిశాను. మా యిద్దరి కలయిక కాకతాళీయం. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా విజయవాడలో సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేయబడ్డాయ్. అ సందర్భంలో శ్రీ ఎం. ఎస్. మూర్తిగారు నా "ఊరుమ్మడి బతుకులు" నాటిక ప్రదర్శించవలసిందిగా ఆదేశించారు. మూర్తిగారి ఆదేశం ప్రకారం నేనువచ్చి విజయవాడ మునిసిపల్ స్టేడియంలో నాటిక ప్రదర్శించడం జరిగింది. ఆ నాటక ప్రదర్శనకు ముందు 'నాటిక గురించి క్లుప్తంగా రెండో మూడో వాక్యాలు రాసి యివ్వండి. ముందుగా అనౌన్స్ చెయ్యాలి' అని లక్ష్మీనరసయ్యగారు నన్ను అడిగారు.

సరేనని చెప్పి 'గ్రామీణ జీవితంలో తరతరాలుగా సజావుగా సాగుతున్న వర్గ సంఘర్షణను ఎత్తి చూపడమే యీ నాటికలోని యితివృత్తం' అని ఒక్కవాక్యమే రాసిచ్చానునేను. లక్ష్మీనరసయ్యగారు ఆ వాక్యం ఒకటికి రెండుసార్లు చదువుకొని, నన్ను ఆపాదమస్తకం చూపులతోనే శల్యపరీక్ష చేశారు. చివరికి ఓ చిరునవ్వు విసిరి నాటికగురించి అనౌన్స్ చేశారు. నాటిక ప్రదర్శించాము. ప్రదర్శన పూర్తి అయింది.

ఆ తరువాత 'చింతామణి' నాటకం జరుగుతోంది. స్టేడియం మేడమీద నేను, లక్ష్మీనరసయ్యగారు, ఎం. ఎస్. మూర్తిగారు, కొడాలి ఆదిశేషయ్యగారు కూర్చున్నాం. నా నాటిక 'ఊరుమ్మడిబతుకులు' గురించి చర్చిస్తున్నారు. మాతోబాటు శ్రీ చాట్ల శ్రీరాములుగారుకూడా వున్నారానాడు. లక్ష్మీనరసయ్యగారు తూచితూచి మాట్లాడుతున్నారు. ఆ చర్చలో ప్రజల నాటకం ఎలావుండాలి ? ఏది సిసలైన ప్రజల నాటకం అన్న చర్చ వచ్చింది. నాకు కాస్త ఆవేశం ఎక్కువ. దాంతో నేను 'చింతామణి' నాటకాన్ని కటువుగా విమర్శించాను

రెండు కులాలను దారుణంగా అవహేళనచేయడం తప్ప చింతామణి నాటకంలో ఏముంది ? వ్యభిచారం వేశ్యలు మాత్రమే చేస్తున్నారా ? వాళ్ళు యీ సంఘం వ్యవస్థ సృష్టించిన బొమ్మలు కాదా ? తిరుగుబోతులు వైశ్యులలోనే వున్నారా ? యితర కులాలలో తిరుగుబోతులు లేరా ? తెలుగు మహాసభల సందర్భంగా ఆడాల్సిన కళాఖండమా యీ 'చింతామణి నాటకం' అన్నాను ఆవేశంగా.

ఏవరూ మాట్లాడలేదు. లక్ష్మీనరసయ్యగారు మాత్రం 'మీరన్నది నిజమే. మిమ్మల్ని కలుసుకోవడం నాకు చాలా సంతోషంగా వుంది. యీ మాత్రం ధైర్యంగా విమర్శించేవారు, యీ మాత్రం ధైర్యంగా 'ఊరుమ్మడి బతుకులు' లాంటి నాటికను రాయగలిగే మీ లాంటి రచయితలు యీ నాటికీ వున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. ఏదో కొత్త ఆశ పుడుతోంది నాకు' అన్నారు.

వారిని మొట్టమొదటి సారిగా చూసి వారిద్వేషాన్ని బట్టి, మాట తీరునుబట్టి వారి గురించి నే నేర్పరచు కున్న అభిప్రాయాన్ని వారి మాటలు విన్న తర్వాత మార్చుకోవలసి వచ్చింది. తెల్లని ఖద్దరు బట్టల్లో విర బూసిన మల్లెపూవులా అగుపిస్తూ తూచితూచి మాట్లాడే నరసయ్యగారిని చూసి ఒక రాజకీయ నాయకుడో, నాటకాలు ఆడించే పురప్రముఖుడో అనుకున్నాను, మొదట. కాని యీమాటలు విన్న తరువాత వారిగురించి నా అభిప్రాయాన్ని మార్చుకోవాల్సి వచ్చింది. ఆదే రోజు మేమిద్దరమే మరో రెండు మూడు గంటలు మాట్లాడు కున్నాక లక్ష్మీనరసయ్యగారి గురించి కొంత అవగాహన ఏర్పడింది. మాటలే కదా మనిషి మనసును వెలికితెచ్చి చూపేవి.

ఆ తరువాత మా 'నవోదయా ఆర్ట్స్' తరఫున ఆంధ్ర నాటక కళాసమితి ప్రేక్షక సంఘానికి, పాప్యులర్ గ్రూపు సంస్థల వారి ప్రేక్షకసంఘానికి, సోషల్ క్లబ్ వారికి – 'సమాధి కడుతున్నాం చందా లివ్వండి' "ఊరుమ్మడి బతుకులు", "దారితప్పిన ఆకలి" ప్రదర్శించడం జరిగింది. ఈ ప్రదర్శనలు లక్ష్మీనరసయ్యగారే ఏర్పాటు చేశారు. వారిద్వారానే, వారి మూలంగానే మా సమాజం యీ ప్రదర్శనలు యివ్వడం జరిగింది దీనితో మా యిద్దరిమధ్య రాక పోకలూ, చర్చలు ఎక్కువయ్యాయ్. యిద్దరం కలిసి నప్పుడల్లా గంటలతరబడి సాంఘిక నాటకం గురించి, అభ్యుదయ నాటికల గురించి, నటులగురించి, రంగ స్థలం గురించి, రచన గురించి – ప్రజలకు కావలసిన నాటకం గురించి, నాటకం, నటులు, రంగస్థలం చెందా ల్సిన మార్పుల గురించి–ఒకటేమిటి–అనేక విషయాలు చర్చించుకున్నాం. దాంతో లక్ష్మీనరసయ్యగారు నాకు మిత్రులయ్యారు. పరిచయం స్నేహంగా మారింది. ఒకరినొకరు బాగా అర్థం చేసుకోవడం జరిగింది. వీరిగురించి మిత్రుడు సత్యనారాయణరాజు మరికొన్ని విషయాలు చెప్పాడు. లక్ష్మీనరసయ్యగారితో కలిసి చాలాకాలం నాటకాలాడిన వ్యక్తి సత్యనారాయణరాజు, నాకు అర్థమైన లక్ష్మీనరసయ్యగారిని, సత్యనారా యణరాజు చెప్పిన మాటలతో సరిపోలిస్తే–లక్ష్మీ నరసయ్యగారి గురించి నా అవగాహన సరైనదేనని తేలింది.

అయితే లక్ష్మీనరసయ్యగారు నాకేమి అర్థమ య్యారు ? అన్న ప్రశ్నకి సమాధానం చెప్పాల్సివుంది నేను. యీ ప్రశ్నకి సమాధానమే 'నాకు తెలిసిన లక్ష్మీనరసయ్యగారు.'

లక్ష్మీనరసయ్యగారు సామాన్యమైన నటుడు మాత్రమేకాదు. యీ నాటకాన్ని ఎందు కాడాలి ? ఎవరికోసం ఆడాలి ? యీ నాటకంద్వారా ఏంచెప్ప గలుగుతున్నాం? ఈనాటకం ఎవరికోసంఆడుతున్నాం? అన్న ప్రశ్నలకి సమాధానం వెతుక్కొని ముఖానికి రంగుపూసుకొనే నటుడని గ్రహించాను. అంతేకాని కాలక్షేపానికో, పేరుకోసమో, సినిమా నటుడు కావాలనో నాటకాన్ని చేపట్టే నటుడుకాదని స్పష్టంగా తేలిపోయింది. ఆయన నాటకం ఆడినా, ఆడించినా, మెచ్చుకొన్నా విమర్శించినా ఈ దృష్టితోనే అన్న విషయం అర్థమయింది. యీ నిబద్ధత, యీయనకు ఎక్కడ అలవడింది ?

నాసిక్ దగ్గర పుట్టిన గోదావరి – రాజమహేంద్ర వరందగ్గరకొచ్చేసరికి అఖండ గౌతమిగా సువిశాల మైన నదిగా రూపొందింది. కాని పుట్టుక సన్నని సెల యేరుగానే, ఎన్నో మెలికలు తిరిగి, ఎత్తుపల్లాలు దాటి, పర్వతశ్రేణులమధ్య ప్రవహించి చివరికి అఖండ గౌతమిగా రూపొందింది. అఖండ గౌత మిగా అగుపించే నరసయ్యగారి వెనుక ఈ రూపాన్ని వీరికివ్వడానికి ఎంతో పటిష్టంగా సాగి, క్రమశిక్ష ణనూ, సాంఘిక రాజకీయ అవగాహననూ, చైత న్యాన్ని కళాకారులలో రంగరించిపోసిన ప్రజానాట్య మండలి వుంది.

ప్రజానాట్యమండలిలో తన్నుతాను తీర్చి దిద్దు కున్న నటుడు లక్ష్మీనరసయ్య. క్రమశిక్షణ, సామూ

హిక జీవన విధానం, నిజాయితీ, నిబద్ధత వీరి సొత్తు అంటే అతిశయోక్తికాదు.

నాజర్‌గారి బుర్రకథదళంలో రాజకీయం చాలా కాలం చెప్పారువీరు. ఒక్కమాటలో చెప్పాలంటే వీరు వట్టి రంగస్థల నటులు మాత్రమేకాదు.

లక్ష్మీనరసయ్యగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. గ్రామీణ జానపద కళారూపాలను జీర్ణంచేసుకున్న కళాకారుడు లక్ష్మీనరసయ్య-గొల్లసుద్దులు-జముకుల కథ, వీధి భాగవతం-బుర్రకథలో వంత-అకుపదం-లాంటి అనేక జానపద కళారూపాలలో వీరు ఆరితేరిన వ్యక్తి - రంగస్థలంమీద - 'ప్రెసిడెంటు పట్టయ్య' నాటకంలో 'పట్టయ్యగా' 'చైర్మన్' నాటకంలో 'స్వామీజీగా' లక్ష్మీనరసయ్యగారిని చూసిన వారెవరూ ఆ వేషాలలో మరోవ్యక్తిని చూడటానికి ఇష్టపడరు. అంత చక్కగా ఆ పాత్రలకు జీవం పోసారట లక్ష్మీనరసయ్యగారు. అంతే కాకుండా ప్రయోక్తగా, దర్శకునిగా కూడ లక్ష్మీనరసయ్య గారికి ఖ్యాతివుంది. సాధ్యమైనంత తక్కువ మాట్లాడి, ఎక్కువ పనిచేసే యీ మనిషి, ఒక పరిపూర్ణమైన కళాకారుడుగా తయారయ్యారు.

యీయన నటించగలరు-ఆడగలరు-పాడగలరు-ప్రపంచ తెలుగుమహాసభల సందర్భంలో హైదరాబాద్‌లో వీరు ప్రదర్శించిన 'అల్లీముఠా' నాటకం చూసాను ఆ సందర్భంలో వీరి ఆటాపాటా చూడ్డం జరిగింది. ఆ తరువాత అనేకసార్లు మేమిద్దరం కలసినప్పుడు ఎన్నో రకరకాల పాటలు పాడారు.

ఇన్ని విద్యలు నేర్చిన లక్ష్మీనరసయ్యగారు 'కళ కళకోసం' అని ఎవరేనా అంటే మండిపడతారు. 'కళ ప్రజలకోసం' - 'ప్రయోజనంలేని కళ కళ కాదు' అని గాఢంగా నమ్మిన కొదిమంది కళాకారులలో లక్ష్మీనరసయ్య ఒకరు.

మరో చిత్రం ఏమిటంటే ఇప్పటికీ రంగస్థలం మీదకు నటించడానికి వెళ్ళబోయే ముందు ఆయన ఆత్రం, కంగారూ యింతా అంతాకాదు. పరీక్షకు వెళ్ళే విద్యార్థిలాగానే గాబరాపడతారాయన - దీనికి కారణం పాత్రను mechanical గా నటించకుండా ఎప్పటికప్పుడు కొత్తగా సజీవంగా నటించాలనే ఆరాటమేనంటారాయన. వీరు నమ్మింది చెబుతారు - చెప్పింది చేస్తారు. ఆర్థికంగా లక్ష్మీనరసయ్యగారు సాదామనిషే అయినా మాటకి కట్టుబడటంలోనూ, నిజాయితీకి నిలబడ్డంలోనూ గొప్ప సంపన్నుడు. అందుకే ఎంతోమంది సంపన్నులు పెద్దలూ, దాతలూ ఆయన్నీ ఆయన మాటను నమ్ముతారు. వీరిమీదవున్న యీ నమ్మకమే రంగస్థలానికి ఎంతో మేలుచేసింది విజయవాడ నగరంలో. ఈ నమ్మకాన్ని తన స్వార్థానికీ, సొంతానికీ వినియోగించుకోకుండా ప్రేక్షక సంఘాలు నెలకొల్పడానికి వినియోగించారు లక్ష్మీనరసయ్యగారు 'ఆంధ్ర నాటక కళాసమితి' లాంటి ప్రేక్షక సంఘాలు యింత పటిష్టంగా సాగడానికి, నిర్వహింపబడటానికి కారకులైనవారిలో లక్ష్మీనరసయ్యగారు ఒక ముఖ్యులు అన్న సంగతి అందరికీ తెలిసిన విషయమే. వీరి వెనక శ్రీ పిచ్చయ్యగారు, శేషయ్యగారులాంటి మంచి మనసుగల దాతలూ, ఉదారులూ, వున్నారు. వారు లక్ష్మీనరసయ్యగారిని సాదా మనిషిగా వుంచరు సాటి మనిషిగా చూసుకుంటారు. అందుకే లక్ష్మీనరసయ్యగారు పెద్దల మధ్య పెద్దగానే అగుపిస్తారు - పెద్దగానే చలామణీ అవుతారు.

ఉన్నది ఉన్నట్టు ముఖంమీద నిర్మొహమ్మాటంగా మాట్లాడే నరసయ్యగారంటే కొందరికి నచ్చకపోవచ్చు. నచ్చినవాళ్ళూ మెచ్చేవాళ్ళూ చాలామంది వున్నారు. సహజమేమరి: కొండంత ఎత్తు ఎదిగిన మనిషిని అర్థం చేసుకోవాలంటే మామూలు మనిషి తలఎత్తిచూస్తే చాలదు - అలా చూసినా అర్థంకాడు - అంత ఎత్తుకూ ఎదిగినవారికే అర్థమౌతాడు.

మనుషులలో చాలమందికి ఏదోవ్యసనం వుంటుంది. కొందరు లక్ష్మీనరసయ్యగారికి ఏ వ్యసనాలూ

లేవంటారు. నాకు వారిలో మూడు వ్యసనాలు కని పించాయ్. మంచి పుస్తకాలు చదవడం - మంచి నాటకాలు ఆడటం - ఆడించడం - మంచి మనుషులతో పరిచయాన్ని పెంచుకొని మంచిని పెంచుకోవడం వీరికి తార్కాణం. వీరి స్వంత గ్రంథాలయం, ఆడిన, ఆడించిన నాటకాలు, వారి స్నేహితులే నిదర్శనం.

లక్ష్మీనరసయ్యగారితో పదిపదిహేనేళ్ళ పరిచయమున్న వారికి యీనాటికీ ఆయనకులం తెలీదు. ఆయనకీ తన మిత్రుల కులాలు తెలియవు ఆయనది మనసున్న మంచి మనుషుల కులం.

వ్యసనం అంటే మనిషిబ్రతికినంతకాలం వదలనిదీ మనిషితోబాటే మనిషి బ్రతికినంతకాలం బ్రతికేదీను. అందుకే లక్ష్మీనరసయ్యగారు మంచి పుస్తకం కనబడితే యిప్పటికీ వెంటబడి అప్పుచేసైనా స్వంతం చేసుకుంటారు. మంచిమనిషి కనబడితే ఆకలిమరిచిపోయి వెంట వుండిపోతాడు. మంచి నాటకంకోసం వేటాడతారు యీ నాటికీ వేటాడుతున్నారు.

నాకూ యిలాంటి వ్యసనాలున్నాయ్-మరి మేం స్నేహితులంకాకుండా ఎలా వుండగలం ? ఆయన గురించి యీ వ్యాసం రాయకుండా ఎలా వుండగలను ?

చివరికోమాట, పుట్టిన ప్రతిమనిషికీ చావుతప్పదు చావులేనిది మంచికే. మంచి బ్రతికినంతకాలం లక్ష్మీ నరసయ్య మంచిలో మంచిగా బ్రతుకుతారు అని నా నమ్మకం.

★★

ఎవరి ముఖమైతే ఎల్లప్పుడూ ప్రశాంతంగా ఉంటుందో, ఎవరి హృదయమైతే దయాగుణంతో నిండి ఉంటుందో, ఎవరి మాటలు అమృతంలా ఉంటాయో, ఎవరి పనులు ఇతరులకు మేలుచేసేవిగా ఉంటాయో వారే లోకంలో సత్పురుషులు. అందరూ పూజించి, గౌరవించదగినవారు వారే.

— ప్రాచీన సూక్తి.



శ్రీ కొండేటి సుబ్రహ్మణ్యంగారు రచించిన
'ప్రెసిడెంటు పట్టయ్య' నాటకంలో
పట్టయ్య పాత్రధారిగా శ్రీ కర్నాటి.

# మంచి మనిషి మా నరసయ్యగారు

— చుక్కపల్లి పిచ్చయ్య
(మేనేజింగ్ పార్టనర్ ''పాపులర్ షూ మార్టు''
ఉపాధ్యక్షులు - ఆంధ్ర నాటక కళా సమితి)

ఉత్తరుదూ వుపాధ్యాయునిగా జీవిత విధానాన్ని ప్రారంభించి, నిజాం ఫ్యూడల్ విధానానికి వ్యతిరేకంగా పోరాడిన తెలంగాణా ఆంధ్ర మహాసభ పిలుపునందుకొని దెందుకూరువారు ప్రజానాట్యమండలి శాఖను యేర్పాటుచేసి సాధనచేసిన ''ముందడుగు'' నాటకంలో హీరోగా నట జీవితం ప్రారంభించిన కొద్దికాలానికే డా॥ గరికపాటి రాజారావు మున్నగు ప్రముఖుల ప్రశంసలు పొందారు. అంతేగాకుండా ఆంధ్రమహాసభ నిర్వహించిన వైజ్ఞానిక ప్రదర్శనలలో చిత్ర విచిత్ర వేషాలు, బుర్రకథలు మున్నగు వాటిలో ప్రముఖ పాత్రలను నిర్వహించుట ద్వారా తెలంగాణా గ్రామ సీమలలోని సామాన్య ప్రజానీకాన్ని చైతన్య పరచుటకుకృషిచేస్తూవున్న సందర్భంలోనే ప్రజానాట్యమండలి, ప్రముఖుల మన్ననలతో తగిన అర్హతగల నటుడుగా ప్రజానాట్యమండలిలోనికి ఆహ్వానింపబడ్డారు. కీ॥ శే॥ కోడూరు అచ్చయ్య, సూరపనేని లక్ష్మీ పెరుమాళ్ళు, చదలవాడకుటుంబరావు మున్నగు ప్రముఖులతో కలిసి ఆంధ్ర దేశంలో అన్ని ప్రాంతాలలో "మా భూమి" నాటక ప్రదర్శనలు విరివిగా ప్రదర్శించి తెలంగాణా ఆంధ్ర మహాసభ నిర్వహిస్తున్న నిజాం రజాకార్ల వ్యతిరేక ప్రజా పోరాటానికి సహాయ సానుభూతులు ప్రజలలో పెంపొందించి తోడ్పడటమేగాక ఆంధ్ర ప్రజానీకంలో ప్రజా వైజ్ఞానిక కార్యక్రమాలు మారుమూల ప్రాంతాలకు విస్తరిల్లడానికి దోహదపడ్డారు.

నాటకాలేగాక, జముకుల కథలు, వీధిభాగవతము, బుర్రకథలు, ఇంకా అనేక జానపద కళారూపాలను సాధనచేసి ప్రజా జీవిత ఇతివృత్తాలను వాటికి అన్వయించి భారతదేశమంతటా పర్యటించారు.

సామాజిక అభ్యున్నతికి డా॥ రాజారావుగారు తదితరులు కళారంగంలో అనేక కళారీతుల ద్వారా విశేష కృషిచేసి ఆంధ్రదేశంలో అనేకమంది ప్రజా కళాకారులు వుద్భవించుటకు దోహదం చేశారు.

డా॥ రాజారావుగారి కళా పరమైన ప్రతి కార్యక్రమంలోనూ శ్రీలక్ష్మీనరసయ్య చివరివరకూ కలసివుండి ప్రజా నాటకరంగ ఔన్నత్యానికి గణనీయమైన సేవచేసి ఆంధ్రదేశంలో అగ్రశ్రేణి రంగస్థల నటుడిగా అభివృద్ధిచెందారు.

శ్రీలక్ష్మీనరసయ్య రేడియో కళాకారుడిగా ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారు. వారి కంఠం చాలా గంభీరమైనది. డైలాగు చెప్పడంలో వారిది ఒక ప్రత్యేకశైలి. సందర్భోచితంగా వివిధ ప్రముఖ వ్యక్తుల, స్నేహితుల, తోటి కళాకారుల సంభాషణల

లోని ప్రత్యేక అలవాట్లను, ఛలోక్తిగా వ్యక్తీకరించి అనుకరిస్తూ మాట్లాడటం వీరి విశిష్టత.

శ్రీ నరసయ్యగారు మంచి ఉన్నతమైన స్వభావం కలవారు. తనకున్న స్థితితో తృప్తిపడగలరు. ఇతరులకు ఇబ్బందిని కలిగించడానికి వీరు సుతరామూ సిద్ధ పడరు.

ఎలాంటి వారినైనా గౌరవిస్తూనే వారిని విమర్శనాత్మక దృష్టితో పరిశీలించగలరు. వీరినుండి అనేక వున్నతమైన సల్లక్షణాలను మనం గ్రహించి, నేర్చుకొనుటకు అవకాశం కలదు. అనేక వర్గాలనుండి, వ్యక్తులనుండి శ్రీ నరసయ్యగారికి మంచి గుర్తింపు వుంది. శ్రీ నరసయ్యగారిని అన్నితరగతులవారు తమ ఆత్మబంధువుగా, స్నేహితునిగా అభిమానిస్తారు.

శ్రీ నరసయ్యగారు మంచి వక్త, లోతైన విషయ శక్తిగలవారు. నిరాడంబరులు, సమాజంలోని అవినీతికీ, చెడుకూ దోహద పడకపోవడమేగాక దాన్ని గుర్తించి నిరసిస్తారు. ఉద్రేకంలేని ప్రశాంత స్వభావం గలవారు. నమ్మినవారికి మంచిమిత్రులు. యాభై సంవత్సరాలు నిండినా ఓపికగా తన దగ్గరవున్న వారితో సామాన్య మానవతా సంబంధాలు పెంచుకొని, పెంచుకొని, తోటికళాకారులకు చేదోడు వాదోడుగా వుంటూ ఆంధ్రనాటక కళాసమితిని స్థాపించి, పది సంవత్సరములుగా దానిని అభివృద్ధిపరుస్తూ అనేక మంది ప్రముఖులకు కళాభిమానాన్ని రేకెత్తించి, దానికి అందరూ తమ ఆదరణ ఇచ్చేలా నిర్మాణ పరచి మంచి ఉన్నతమైన కృషి చేస్తున్నందుకు శ్రీ లక్ష్మీనరసయ్యగారిని యీ సందర్భంలో అభినందిస్తూ వారి కృషి యింకా అభివృద్ధిచెంది అనేక కళాకారులకు వారి అనుభవం ఉపయోగపడి, అనేక మంది కళాభిమానులు యేర్పడటానికి కృషి కొనసాగిస్తారని ఆశిస్తున్నాను. వారికి ఈ సందర్భములో నా కళాభివందనములు.

★★

నిజాన్ని ఎవరూ దాచలేరు. ఎవరు ఎంతగా అణచివేయడానికి ప్రయత్నించినా, సత్యం మళ్ళీ బయటికి వస్తుంది. ఎక్కడలేని కాంతితో ప్రకాశిస్తుంది.

— విలియం బ్రయాంట్.

# 'కళానిధి' శ్రీ లక్ష్మీనరసయ్యగారు

— కొండేటి సుబ్రహ్మణ్యం,

నాటక రచయిత.

అది రెండవ ప్రపంచ మహా సంగ్రామం సాగుతున్న రోజులు. రాజకీయచైతన్యం ఒకప్రక్క, స్వాతంత్ర్య పోరాటం మరోప్రక్క, ఎవరు నాయకులో? ఎవరు వినాయకులో? తెలియని అమాయక ప్రజలు పెద్దపెద్ద భూస్వాముల, జమీందార్ల దౌర్జన్యాలకు బలియై, దిక్కుతోచని స్థితిలో దేశం అల్లకల్లోలమై, బానిసత్వంలో మ్రగ్గుతున్న రోజులవి.

ఆంధ్రదేశంలో రాజకీయ చైతన్యంతోపాటు, కళారూపాల ప్రదర్శనలద్వారా, ప్రజలను ఉత్తేజపరచి కనువిప్పు కలిగించి, విజ్ఞాన వినోదాలు అందించి, ఇతోధికంగా దేశానికి సేవ చేయాలన్న తలంపుతో కీ॥శే॥ డాక్టర్ రాజారావుగారి దూరదృష్టితోను, అవిరళకృషితోను, ప్రజాసహకార బలంతోను ఆంధ్ర ప్రజా నాట్యమండలి ఆవిర్భవింపచేశారు.

నాడు ఆంధ్ర ప్రజానాట్యమండలి వెలిగించిన కళా-సాహిత్యజ్యోతి, పట్టణాల్లోను, పల్లెల్లోను, వాడవాడల్లోను, వ్యాపించి, దేశంలో ఆవరించియున్న కారు చీకట్లను చీల్చుకుని, తన ఉజ్వల కాంతితో ప్రగతిపథంవైపు పురోగమిస్తూ, ఆంధ్రదేశంలోని కళాకారులకు నూతనోత్సాహాన్ని, నూతన సందేశాన్ని అందించినది.

నాటి సంస్థాపక ప్రముఖుల్లో శ్రీ లక్ష్మీనరసయ్యగారు ముఖ్యులుకావడం ఎంతయూ ముదావహం.

శ్రీ లక్ష్మీనరసయ్యగారు గత 30-35 సంవత్సరాలుగా కళారాధన చేస్తూ, ఆంధ్రదేశమందేకాక పరరాష్ట్రములలో సైతం తన అసమాన కళాప్రతిభను ప్రదర్శించి ప్రశంసలు అందుకొన్న శ్రీ అకళంక కళామూర్తి.

కళలయొక్క ప్రభావం ప్రాధాన్యం అర్థం చేసుకున్న శ్రీ లక్ష్మీనరసయ్యగారు, సమాజంలో అట్టడుగున వున్న ప్రజలకు కళారూపాలద్వారా ప్రదర్శనలిచ్చుచూ, సంఘంలో జరుగుచున్న అన్యాయాలను — అక్రమాలను దౌర్జన్యాలను ఎత్తి చూపించుచూ, ప్రభావితులను చేయడమే తన కర్తవ్యంగా భావించి, ఆచరించిన కళాకారుడు.

శ్రీ లక్ష్మీనరసయ్య గారికి తెలియని కళారూపాలు లేవు. కళా రహస్యాలు లేవు. నిత్య కళోత్సాహి; కళా-సాహిత్యాలను అధ్యయనం చేయుటలోను, తనకు తెలియని విషయాలు తెలుసుకొనుటలోను, నేటికీ అన్వేషిస్తున్న విద్యార్థి.

నాటకాల్లో పాత్రధారణ చేశారు, యక్షగానాలు ప్రదర్శించారు, గొల్లసుద్దులు పాడారు, బుర్రకథలు చెప్పారు, నాటకాలకు దర్శకత్వం వహించారు, ఏం

చేసినా ప్రజలకోసం చేశారు, ప్రదర్శించిన ప్రతి కళారూపంలోను ఒక నూతన సందేశాన్ని అందించారు.

ఆనాటి మేటి కళాకారులు ఎందరో ఈనాడు అనేక ఇతర వృత్తులలో నిమగ్నులై కొందరు తమ ఆదర్శాన్నే విస్మరించారు.

మరికొంతమంది కళనే వృత్తిగా స్వీకరించి కీర్తి శిఖరాల నందుకున్నారు. మరికొందరు బ్రతుకు స్థిర పరచుకోలేక, మరో వృత్తిలో ప్రవేశంలేక - ప్రవేశించలేక, దీనత్వంతో కృంగిపోతూ ఎలాగో ఇలాగు బ్రతుకుబాటలో పయనించుచున్నారు.

ఇలాటి ఒడుదుడుకులన్నీ తట్టుకుని, తన ఆశయసిద్ధికోసం ఆత్మసంతృప్తితో రంగస్థలాన్నే నమ్ముకుని ఆత్మ విశ్వాసంతో ముందడుగు వేయుచున్నారు శ్రీ లక్ష్మీనరసయ్యగారు.

శ్రీ లక్ష్మీనరసయ్యగారు కీ॥ శే॥ డాక్టర్ రాజారావుగారు, చదలవాడ కుటుంబరావుగారు, రామకోటిగారు, కోడూరి అచ్చయ్యచౌదరిగారు, నేటి సినీ దర్శకులు శ్రీయుతులు వి. మధుసూధనరావుగారు, సి. నాగభూషణంగారు, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు రామన్నపంతులుగారు మొదలగు ఎందరో నటుల సరసన నటించియున్నారు. వారి అభిమాన జంట ప్రజా కవులు, శ్రీ సుంకరసత్యనారాయణగారు, వాసిరెడ్డిగారలు వీరు రచించిన ముందడుగు, అపనింద, మా భూమి మొదలగు అన్ని నాటకాల్లోనూ ప్రధాన పాత్రలుధరించి పండిత-పామర-విమర్శకుల ప్రశంసలందుకొని శహబాష్ అనిపించుకున్నారు.

శ్రీ లక్ష్మీనరసయ్యగారు ఏ ఆదర్శాలతో, సిద్ధాంతాలతో కళారంగంలో ప్రవేశించారో ? నేటివరకు మనసా - వాచా తను నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి, ఆదర్శవంతంగా జీవిత బాటలో పయనించుచున్నారు. ఉన్నదాంతో తృప్తినొంది, లేనిదానికోసం ప్రాకులాడక, కళాకారులకు మార్గదర్శియై అందరి అభిమానం చూరగొంటున్నారంటే అతిశయోక్తి కానేరదు.

శ్రీ లక్ష్మీనరసయ్యగారు నిండుకుండ. పొగడ్తలకు పొంగిపోరు, తెగడ్తలకు కృంగిపోరు, అదే ఆయనలోని విశిష్ట వ్యక్తిత్వం, నిండైన విగ్రహం, వాక్పటిమ, భావసంపద, కళాభిరుచి. విమర్శనా శక్తితోపాటు మిత్రులను చిరునవ్వుతో పలకరించి ఆదరించు స్వభావం కలవారు. వారి కళా ప్రతిభకు తార్కాణంగా పొందిన సన్మానాలు అభినందన పరంపరలే ప్రత్యక్ష నిదర్శనం.

శ్రీ లక్ష్మీనరసయ్యగారు మంచి వక్తలు. వారు లేని నాటకోత్సవాలులేవు, కళా సాంస్కృతిక సభలు లేవు, కళాసదస్సులులేవు. వారికి కులమతాల్లో విశ్వాసంలేదు. మానవ మతాలన్నీ ఒక్కటేనన్న సిద్ధాంతం వారిది. వారి ఆశయం ఒక్కటే ఆంధ్ర దేశపు కళలు విశ్వవ్యాప్తం కావాలని, అందుకు తగిన అవకాశం - ప్రోత్సాహం లభించిననాడు, ఒంటరిగానైనాసరే తన ధ్యేయం నెరవేర్చటానికి వెనుకంజ వేయని సమర్థులు. తమ సరసన రంగస్థలంపై నటించిన మిత్రులు ఎందరో సినిమా రంగంలో ధనార్జనతోపాటు కీర్తి ప్రతిష్టలు ఆర్జించుచున్నా తను మాత్రం నేటి ఆంధ్రనాటక కళాసమితికి అంకితమై తన ఆశయ సిద్ధి నెరవేర్చుకొనుచున్న ఆదర్శ కళాజీవి. లక్ష్మీ-నరసయ్య పేరులోవున్న, లక్ష్మీ కటాక్షించలేదు, నరసింహంలోని ఉగ్ర స్వభావము నరసయ్యకు అలవడలేదు. నిజమైన కళాకారునికి లక్షరూపాయల నిధి వచ్చిన ఆనందంకన్నా, మీరు నటించిన పాత్ర చాలా బాగుందన్న మెప్పుమాత్రమే ఎక్కువ ఆనందాన్ని, ఆత్మసంతృప్తిని కలిగిస్తుందనుటలో సందేహం లేదు.

కొన్ని సమాజాలు స్థాపించిన కొద్ది కాలానికే కాలగర్భంలో కలసిపోతున్న ఈ రోజుల్లో, శ్రీ లక్ష్మీ

నరసయ్యగారు ఆంధ్ర నాటక కళాసమితికి ప్రధాన కార్యదర్శిగా, దాదాపు ఒక దశాబ్దం తన అసమాన ప్రతిభతో మార్గదర్శియై ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలాటి పొరపొచ్చాలు లేకుండా నడిపించుచూ, అందరి అభిమానాలు చూరగొంటున్నారంటే అంత తేలికైన విషయం కాదు. అందుకు శ్రీ లక్ష్మీనరసయ్యగారి దృఢసంకల్పం, కార్యదీక్ష, కళలయందు ఆసక్తి కార్యవర్గ ప్రముఖుల అభిమానం, నిస్వార్థత కారణాలుగా భావించవచ్చు.

ఈనాడు కళాకారులు, మిత్రులు, రసజ్ఞులు, సహృదయులు, విజ్ఞులు, కళాభిమానులు, అందరూ ఏకోన్ముఖులై అభినందన పరంపరలతో అభినందన సంచికను, ముద్రిస్తున్నందుకు ఘనంగా ప్రతి కళాకారుని హృదయం ఆనందంతో స్పందించక మానదు. ప్రతి కళాకారుడు తనకు జరిగిన సన్మానంగా భావించి ఉత్తేజితుడై గర్వపడక మానడు !

ప్రకృతిలో పూచిన ప్రతిపువ్వూ ఎలా పరిమళింప జాలదో ? అలాగే నటులందరూ కీర్తి ప్రతిష్ఠల సోపానాలు అధిరోహింపజాలరు కదా ?

శ్రీ లక్ష్మీనరసయ్యగారు యింకా మరిన్ని సన్మానాలందుకుని, కళాభారతికి ద్విగుణీకృతోత్సాహముతో తన శక్తిపంచన లేకుండా ఇతోధికంగా కళాభివృద్ధికి తోడ్పడుతారని, కళాకారులకు ఆదర్శప్రాయులై చిరకాలం వర్ధిల్లాలని మనసారా కోరుకుంటున్నాను.

నేను వ్రాసిన ప్రెసిడెంటు పట్టయ్య నాటకం వారు ఎన్ని ప్రదర్శన లిచ్చారో నాకైతే తెలియదు. కాని ఒక్కటిమాత్రం చెప్పగలను. నేను వ్రాసిన పట్టయ్య నాటకం, కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాల్లో నాటకరచయితగా నాకు ఒక గుర్తింపు కలిగించారు. అందుకు వారికి నా ధన్యవాదాలు తెలుపుకొనుచున్నాను.

నాకు వ్యాసాలు వ్రాయుట అలవాటులేదు. కానీ ... శ్రీ లక్ష్మీనరసయ్యగారితో నాకున్న కొద్దిపాటి పరిచయాన్ని పురస్కరించుకుని, కళలయందున్న అభిమానంతో యీ వ్యాసం వ్రాసి పంపుతున్నందుకు ఎంతో ఆనందించుచున్నాను.

★★

కోపం యమధర్మరాజులాంటిది - ఆశ వైతరిణీ నదితో సమానమైనది. విద్య ఉన్నదే అది కామధేనువు వంటిది. మరి, సంతోషం నందనవనంతో తుల్యమైనది.

— ప్రాచీన సూక్తి.

# నిర్వాహకుడుగా కర్నాటి

— యండమూరి వీరేంద్రనాథ్
నాటక రచయిత

"ఇక నాలుగు నిముషాలుంది"

"అయిపోవచ్చింది గురువుగారూ"

"అదిగో ఆ కుర్చీలు అలావెయ్యి. మైక్స్ అరేంజి అయిపోయేయా ? ఇదిగో అబ్బాయి – నువ్విలా స్టేజీ మీదకు వచ్చెయ్యకు ... ఇక మూడు నిముషాలుంది"

"అయిపోవచ్చింది గురువుగారూ"

.............

"తొందరగా! ఇదిగో టీ కూడా వచ్చేసింది–ఆర్టిస్టు లేరీ? ఇంకా మేకప్ కాలేదా –

"అయిపోయింది గురువుగారూ మేం రెడీ ..."

.............

"మరి ప్రదర్శన మొదలు పెట్టండి– ఇంకో నిముషమేవుంది. కర్టెన్ తీయడానికి ఎవర్నన్నా పెట్టమంటారా ?... అరె ... ఆరున్నర అయిపోయింది. తీసేయండి ... తీసేయండి ... ఆడిటోరియం లైట్స్ ఆఫ్ ... ఆఫ్ ......"

ఇదీ ఇక్కడతంతు. సవ్యసాచిలా అన్ని విషయాలూ ఒక్కడే చూసుకొంటూ, అనుకొన్న టైమ్‌కి ప్రోగ్రాం ప్రారంభించటం ఒక కర్నాటి లక్ష్మీనరసయ్యగారికే చెల్లింది.

ఒకసారి – రెండుసార్లు కాదు.

నెలకొకసారి చొప్పున– పదకొండు సంవత్సరాలు ప్రదర్శనలు నిర్వహించటం ఎంత కష్టమో నాకు తెలుసు. అందులోనూ అనుకొన్న టైమ్‌కి ! ఆడపిల్ల పెళ్ళి చేసినంత కష్టపడాలి. కానీ అక్కడేమన్నా ఆలస్యం జరుగుతే పురోహితుడుంటాడు ఎక్కడో ఒకచోట ఎడ్జస్ట్‌చేసి, ముహూర్తం అనుకొన్న టైమ్‌కి జరిగేలా చూడటానికి : కానీ ఇక్కడలాకాదు. కర్టెన్ తీసేవాడు లేకపోయినా నిముషం ఆలస్యం అవుతుంది.

ఇన్ని విషయాలు పకడ్బందీగా చూసుకుని – అనుకొన్న టైంకి మొదలు పెట్టటం —

హేట్సాఫ్.

నటుడిగా శ్రీ లక్ష్మీనరసయ్య నాకు తెలీదు. ఆయన రంగ ప్రవేశం చేసే సమయానికి, నా క్రితం జన్మలో ఇంకా పదేళ్ళ జీవితం మిగిలిపోయింది. నాకిప్పుడు యిరవై ఎనిమిది. మొట్ట మొదటిసారి కర్నాటితో నా పరిచయం గమ్మత్తుగా జరిగింది. గ్రీన్ రూంలో చాపమీద, తల క్రింద చేతులు పెట్టుకుని వెల్లకితలా పడుకొని వున్నాను. ట్రైన్ ప్రయాణంతో చాలా అలసటగావుంది. ఖద్దరు చొక్కా, పంచా కట్టుకొన్న ఒకాయన వచ్చి నా ప్రక్కనే కూర్చొన్నాడు. "టైర్ అయిపోయారా "? అన్నాడు. అబ్బే అటువంటి దేమీ

లేదన్నాను. "మళ్ళీ రాత్రికి హైద్రాబాద్ వెళ్ళిపోతున్నారా"? అన్నారు. తలూపేను.

"గంట క్రితంవచ్చి, నాటకం ఆడి శ్రమ మూట గట్టుకొని వెళ్ళిపోతున్నారు - ఎందుకు?" అన్నాడు.

ఇంతలో ఎవరోవచ్చి "ఈయనే కర్నాటి లక్ష్మీనరసయ్యగారు. మనకి ప్రోగ్రాం ఏర్పాటు చేసింది'' అని పరిచయం చేసారు. మామూలు సంభాషణ జరిగేక - తరువాత ఒంటరిగా వున్నప్పుడు అడిగేను - "గురువుగారూ - మేం కొత్తగా ఫీల్డులోకి వచ్చేం-ఆ హుషారు మాకు వుంటుంది. కానీ, మీరు, మీరు ఇన్నేళ్ళు యింత శ్రమని మూటగట్టు కొన్నారు. ఏం మిగిలింది ? ఇదంతా దేనికోసం ?"

ఆయన నవ్వేడు. ఆ నవ్వు కర్థం —

కళాకారులు - మీకు నేను చెప్పటం ఏమిటి ?

అందరికీ వీడ్కోలు చెప్పేసి, డబ్బు యివ్వవల్సిన వాళ్ళకి యిచ్చేసి, అందరూ షేక్ హేండ్లిచ్చి వెళ్ళిపోయాక - రాత్రి పన్నెండు అవుతూ వుంటే - అరచేయి నుదుటి మీద వేసుకుని ఒంటరిగా ఓమూల అలసటగా కూర్చున్న శ్రీ లక్ష్మీ నరసయ్యని చూస్తే.... సకల మర్యాదలూ చేసి, మగ పెళ్ళివాళ్ళని పంపిన ఆడపిల్ల తండ్రి గుర్తుకొస్తాడు.

ఆంధ్ర దేశంలో నిజమైన కళా కారులకి ఆలస్యంగా అయినా గుర్తింపు లభిస్తుంది.

సర్వం కోల్పోయేక !

★★

స్వంత లాభము కొంతమానుక
పొరుగువారికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్

— గురజాడ,



"బ లే బా వ" చి త్రం లో
బుర్రకథ కళాకారుడుగా శ్రీ కర్నాటి.

# 'అజాత శత్రువు' శ్రీ కర్నాటి

— కె. యస్. టి శాయి, బి. ఏ.

రచయిత, నటులు, దర్శకులు



కొందర్ని చూస్తే వెంటనే పరిచయం చేసుకొని మాట్లాడాలనిపిస్తుంది - మరి కొందర్ని చూస్తే చెయ్యెత్తిదణ్ణం పెట్టాలనిపిస్తుంది- దానికి వారి తేజస్సు ప్రవర్తన, సంభాషణా చతురత కారణం కావచ్చు! పైచెప్పిన కోవలోనివారే మన శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్యగారు.



'ఆతడనేక యుద్ధముల ఆరితేరిన వృద్ధమూర్తి' అన్నట్టుగా కళకుసంబంధించిన అన్ని శాఖల్లో వారికి ప్రవేశంవుంది-ప్రావీణ్యంవుంది. నటులు, దర్శకులు, ఉత్తమ ప్రయోక్త. సమర్థతగల కార్యనిర్వాహక దక్షులు - వక్త - అంతేగాదు యక్షగానం, జానపద సాహిత్యాన్ని, సంగీతాన్నికూరా మధించిన మేధావి- సాహితీ పరులు. ఇన్ని శాఖల్లో ఆరితేరటం ఎందరికి సాధ్యం? సాధించ గల్గినవారు ఉత్తమోత్తమ పరిశోధకులుగాక మరేమౌతారు?

దాదాపు ఓ పుష్కరకాలం క్రితం అనుకుంటాను మేం విజయవాడలో కన్యాశుల్కం నాటకం ప్రదర్శించాం - నాటకానంతరం, శ్రీ కర్నాటి లోపలికివచ్చి 'మీరు గిరీశంగా అద్భుతంగా నటించారని' చెప్పి మళ్ళీ కలుస్తానని వెళ్ళిపోయారు. శ్రీ కర్నాటిని నే నెరుగుదును. కాని నేనువారికి తెలియటం అదే ప్రథమం- మేం ముఖాముఖి మాట్లాడుకున్నది ఆ నాడే! వెంటనే చెయ్యెత్తి నమస్కరించాను - ఆ తర్వాత చాలాసార్లు కాదు, ఎన్నోసార్లు వారితోకల్సి మాట్లాడే అవకాశాన్ని కల్పించుకున్నాను. ఈ కాలంలో, వార్ని నిశితంగా పరిశీలించాను-వారి మన స్తత్వాన్ని అధ్యయనంచేశాను. ఎప్పుడైనా అవకాశం పడ్తే నా రచనల్లో ఓ పాత్రగా చేసుకుందామనే స్వార్థంతో !! అనేక విషయాలు తెల్సుకున్నాను- చాలా విషయాలు వారినుండి నేర్చుకున్నాను - అందుకే ఉన్నవి వున్నట్టుగా రాస్తున్నాను-ఇందులో ఉత్ప్రేక్షలూ లేవు. అతిశయోక్తు లంతకన్నా లేవు.

ఈనాడు తెలుగునాట రాణకెక్కిన నటకావతంస లెందరో వున్నారు - నటరాజులున్నారు, నటచక్ర వర్తులూ వున్నారు. కానీ యిందర్లో ప్రధానంగా తగగైన గుణం వ్యక్తిత్వం-ఆత్మ విశ్వాసం. నిజానికి నటుడన్నవాడికి వ్యక్తిత్వం, ఆత్మవిశ్వాసం, ఆత్మాభిమానం - పాత్ర అధ్యయనం - సరియైన అవగాహన అవసరం. ఇవి లేనప్పుడు, ఆ వ్యక్తి తాత్కాలికంగా రంగస్థలంపై నటుడుగారాణించినా, బిరుద, సత్కారాలందినా, వ్యక్తిగా మాత్రం జీవితంలో ఓడిపోవటం తథ్యం - జీవితంలోని ఓటమి అతన్ని కొన్నాళ్ళకు నటుడుగా కూడా నిలువనీయదు-మిగలనీయదు-ఇది సర్వసామాన్యానుభవం - మహామహుల గత చరిత్రలు మనకు నేర్పుతున్న పాఠాలు - కనుక జీవితపు ప్రవాహంలో ఏ కొమ్మ పట్టుకుని యీదాలన్నా, లేక సంఘంలో సుస్థిరంగా సముచితమైనస్థానం

సంపాదించాలన్నా, ప్రతి మనిషికి వ్యక్తిత్వం, ఆత్మ విశ్వాసం - ఆత్మాభిమానం అవసరం ! పైచెప్పిన అన్ని అంశాలు శ్రీ కర్నాటివారు పుణికి పుచ్చుకో వటంచేతనే - వారు ఉభయత్రా - జీవితంలోను - రంగస్థలంలోనూ రాణించ గల్గుతున్నారు -

శ్రీ కర్నాటి వ్యక్తిత్వం బహుధా ప్రశంసా పాత్ర మైంది - ఒకర్ని నొప్పించక, తాను నొచ్చుకోక నవ్వుతూ నడిచిపోయే శ్రీ కర్నాటి వారికి శత్రువు లెవరూ లేరు - తనెవ్వర్నీ శత్రుభావంతో చూడరు. కనుక వీరు అజాత శత్రువులు అంటున్నాను. తనని చాలామంది అపార్థం చేసుకోవచ్చు - మరికొందరు పరోక్షంలో విమర్శించవచ్చు - ఇంకెందరో ఆయన్ని చూసి అసూయ పడవచ్చు - లెక్కకు మిక్కిలిగా జనం ఆయన్ని ప్రేమించవచ్చు, అభిమానించవచ్చు. అందరికీ అన్ని వేళలా ఒకేరకమైన ఆదరణ, సమాన స్థాయిలో సంభాషణ ఆయన్నుండి లభిస్తాయి. అప వాదులకు, అపార్థాలకు భయపడి పారిపోయే మన స్తత్వం వారిదికాదు. తాను నమ్మిందే చేయటం - చేయ దల్చుకున్నదానినే చెప్పటం వారి అలవాటు, నైజం కూడా !! కుల మత భేదాలకు, భావాలకు అతీతంగా మనసును పెంచుకొని, అనేకమందిని ఆత్మీయులుగా, ఆప్తులుగా చేసుకుని ముందుకు సాగిపోతున్నారు. 'దేశమును ప్రేమించుమన్నా మంచి అన్నది పెంచు మన్నా' అన్న గురజాడ గీతికకు ప్రత్యక్ష సాక్ష్యం శ్రీ లక్ష్మీనరసయ్యగారే !!

కీ. శే. కోడూరి అచ్చయ్య, డా॥ రాజారావుగార్ల నుండి సుశిక్షణ, క్రమశిక్షణ అలవర్చుకొని, తన సంస్కారానికి వన్నె తెచ్చుకున్నారు. ఆయన వ్యక్తి త్వం, ఆయన్ని గొప్ప కళాకారుడిగా తీర్చి దిద్దింది. నటుడుగా, ఆంధ్రదేశంలో దాదాపు అన్ని రంగస్థలా లపై నటించారు-ఎన్నో పాత్రలు వారి సొంతం అయి నాయి-పాత్రలో లీనం కావటంకాక, పాత్రలోజీవిం చటం - వీరి ప్రతిభకు తార్కాణం ! ఏ పాత్రనైనా గౌరవ ప్రపత్తులతో అధ్యయనం చేయటం, అభ్యాసం చేయటం వీరు అలవాటుగా చేసుకున్నారు వీరు ధరించిన పాత్రలు ఒక దానికొకటి సంబంధంలేదు. ఒక పాత్రకు మరొక పాత్రకు పోలికలూ లేవు: ఆయాపాత్ర మనస్తత్వాలకు, నిజ జీవితపు తన నడవడికి ఎక్కడా పొత్తూలేదు, పొంతనాలేదు, అందుకే శ్రీ కర్నాటి యిటు జీవితంలోను ఆటు రంగస్థలంలోను రాటుతేలగల్గారు-రాణించగల్గారు.

ఎక్కడ దెందుకూరు ప్రజానాట్యమండలి-ఎక్కడ విజయవాడ ? తిరువూరు తాలూకా తునికిపాడులో జన్మించి, దెందుకూరులో పెరిగి, విజయవాడలో స్థిర పడి పోవటం చూస్తే ఎంతో ఆశ్చర్యం వేస్తుంది- 'ముందడుగు' నాటకంలో హీరో నారాయణరావుగా దాదాపు ముప్పయి సంవత్సరాల క్రితం రంగ ప్రవేశం చేసిన శ్రీ కర్నాటి, నేటికి రంగస్థలంపై హిమా లయోత్తుంగ శిఖరాన్ని అధిరోహించ గల్గిన నటశేఖ రుడౌతాడనిఆనాడు ఎవరూహించగలిగారు? శ్రీకర్నాటి వారుకూడా నాడు వూహించి వుండరేమో !!

ఆత్రేయగారి, 'ప్రగతి'లో పిచ్చివాడుగా, 'ఈనాడు' నాటకంలో 'రాము'గా, పులిగుండ్లవారి 'తుఫాన్' నాటికలో నెల్లూరు రాఘవరెడ్డిగా - అని సెట్టివారి'మావూరు'లో'మహంకాళి'గా, 'గాలి మేడల్లో' 'హెడ్‌క్లర్కు-ఆంజనేయులు'గా- కొడాలి వారిచైర్మెన్లో 'స్వామీజీగా, రెంటాలవారి, 'అంతా పెద్దలే'నాటకంలో 'చైర్మన్లు'గా కొండేటివారి, 'ప్రెసిడెంటు పట్టయ్య'లో పట్టయ్యగా, శ్రీహరిగారి,'ఎవరుద్రోహి'లో M. L. A. సదాచార సన్యాసిరావుగా - వేలసంఖ్యలో ప్రదర్శన లిచ్చి శెహభాష్ అనిపించుకున్న అదృష్టం అవ కాశం, అర్హత వీరికి కలిగివుండటం ముదావహం - అన్ని పాత్రలు సమాన స్థాయిలో అధ్యయనంచేసి నటించినా - వీరికి చైర్మన్లు, మహంకాళి, పిచ్చివాడు, పట్టయ్య పాత్రలంటే అమిత అభిమానం !

'అంతా పెద్దలే' - ప్రెసిడెంటు పట్టయ్య 'ఎవరు ద్రోహి' మొదలగునాటకాలువీరిదర్శకప్రతిభకు మచ్చు

తునకలు - రంగస్థలంపై నూతన ప్రయోగాలు చేయటం - కొత్తపుంతలు సంతరించటం - వీరికి అభిమానం - అందుచేతనే గిడుతూరివారి 'మానవుడు చిరంజీవి' అను మూకీ నాటికను, మాచినేనివ్రాసిన అర్ధమూకీ నాటికను రంగానికి పరిచయం చేశారు - ఏ విశ్వవిద్యాలయంనుండి, పట్టా పొందకపోయి నప్పటికీ, విశ్వసాహిత్యాన్ని మధించారు - ప్రాచీన సాహిత్యం నుండి-ఆధునిక సాహిత్యంవరకు - ఎన్నో గ్రంధాలు చదివి ఆకళింపు చేసుకున్నారు. అభిజ్ఞాన శాకుంతలం, 'ప్రతాప రుద్రీయం' 'చిత్ర నళీయం' 'బొబ్బిలియుద్ధం' వంటి నాటకాలను శిల్పసౌందర్య దృష్ట్యా గౌరవిస్తారు. సబ్జక్టురీత్యా ఆధునిక నాటకాల్లో ప్రప్రథమంగా 'కన్యాశుల్కం' సంఘం చెక్కిన శిల్పం, ఆత్మసాక్షి, మండువా లోగిలి, జగన్నాధ రధ చక్రాలు ఊరుమ్మడి బ్రతుకులు వారి అభిమాన పాత్రమైన నాటకాలు. ఎంతటి సాహితీపరుడు కానిదే ఏ విషయం పైనైనా అనర్గళంగా ఉపన్యసించ గల మేటి వక్తగా వన్నెకు రాగలుగుతారు ?

ఆంధ్రదేశంలో బుర్రకథ-కథకులైన శ్రీ నాజర్, ఉమామహేశ్వరరావులేగాక - యక్షగాన నిపుణులందరితో పరిచయం మాత్రమే వీరికి వుండటంకాదు - పాల్గొనే ప్రవేశం, పాండిత్యం కూడా కల్గివుండటం - వీరి మేధస్సుకు చక్కని గీటురాయి - నటరత్నాలైన శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, శ్రీ మాచినేని, శ్రీ వల్లం నరసింహారావు, కీ.శే. చదలవాడ కుటుంబరావు, పెరుమాళ్ళు, డా॥ రాజారావు, కోడూరు అచ్చయ్యగార్లతో కల్సి పన్చేసిన పవిత్రకాలం వీరికి మధురానుభూతులు మిగిల్చింది - తనను తెలుగురంగస్థలానికి పరిపూర్ణయశస్విగా అందించిన ప్రజానాట్య మండలి వారిని తన గుండె కుహరములో ప్రోది చేసుకున్నారు.

దాదాపు 50 వసంతాలను నేటికి పూర్తిచేసినవీరు ఔత్సాహిక నాటకరంగాన్ని ప్రోత్సహించే నిమిత్తం దాదాపు పది సంవత్సరాలక్రితం ఆంధ్రనాటక కళా సమితి స్థాపకులై నేటికీ దాని ప్రధాన కార్యదర్శిగా కొనసాగుతున్నారు.

ఇన్ని సుగుణాలు, ఇన్ని గొప్పదనాలు సాధారణంగా ఒక మనిషికి అబ్బటం అరుదు - ఇన్ని గొప్పదనాలున్నా నిరాడంబరత్వాన్ని కొనసాగిస్తూ - నిగర్విగా కీర్తినందుతూన్న శ్రీ కర్నాటి వ్యక్తిత్వానికి నా నమోవాకాలు.

ఆంధ్రజాతి సగర్వంగా చెప్పుకోతగ్గ మహనీయుల్లో శ్రీ కర్నాటివారొకరు. వీరిని పూరూరా సన్మానించి, ఆంధ్రజాతి తన సంస్కారాన్ని, సంప్రదాయాన్ని సర్వమానవాళికి మంచి కానుకగా సమర్పిస్తుందని ఆశిస్తూ...

**

కళ ప్రజల ఆయుధం — స్టాలిన్



శ్రీ కొడాలి గోపాలరావు రచించిన "చైర్మన్" నాటక ప్రదర్శనలో పాల్గొన్న కళాకారులు.
కూర్చున్నవారిలో ఎడమనుండి రెండవవారు 'స్వామీజీ' పాత్రధారిగా శ్రీ కర్నాటి.

# నాటకం

— సంజీవదేవ్

దృశ్య కళలు, శ్రవ్యకళలు, మిశ్రమకళలు అని కళలు ప్రధానంగా మూడు విధాలు. శిల్పం, చిత్రం, వాస్తు మొదలైన కళలు దృశ్యకళలు; కవిత, సంగీతం మొదలైనవి శ్రవ్యకళలు; ఇక నృత్యం, నాటకం మొదలైనవి మిశ్రమకళలు. నాటకంలో కంటితో చూచేదీ వుంటుంది, చెవితో వినేదీ వుంటుంది. అంతేకాదు, నాటక ప్రదర్శనలో లేని కళ లేదు. రంగస్థల నిర్మాణం వాస్తుకళకు సంబంధించింది; నాటకరచన సాహిత్యానికి సంబంధించింది; పాటలు సంగీతానికి సంబంధించినవి; దృశ్యాలు, తెరలు మొదలైనవి చిత్రకళకు సంబంధించినవి; కదలికలు నృత్యకళకు సంబంధించినవి. ఈ విధంగా నాటక కళ సకల కళల సమన్వయం.

జగత్తే ఒక నాటకం అంటారు. ఇది నిజంకాదు. జగత్తు అనేది నాటకానికి ముడిపదార్థమేకాని. జగత్తు నాటకంకాదు. జగత్తు వాస్తవమైంది, నాటకం సగం వాస్తవం, సగం కల్పనా కలది. జగత్తును కేవలం అనుకరించటం ఉత్తమ నాటకం కాదు. జగత్తులోని విషయాలను ప్రదర్శిస్తూనే వాటిని కొంత మార్పుతో ప్రదర్శించటం ఉత్తమ నాటకం. అసలు రంగస్థలంమీది నటకునిలోనే వాస్తవం కొంత, కల్పన కొంత కనిపిస్తుంది. రంగస్థలం మీద మనకు కనుపించేది ఎవరు? దుష్యంతుని పాత్రను ధరించిన ఫలాని వ్యక్తియా లేక దుష్యంతుడేనా? దుష్యంతుడని నమ్మితే ఆ పాత్రధారి కనుపించడు, పాత్రధారి అని నమ్మితే దుష్యంతుడు కనుపించడు. రంగస్థలం మీద కనుపిస్తున్నది, మాట్లాడుతున్నది దుష్యంతుడే అని నమ్మితే అదీ నిజం కాజాలదు. దుష్యంతుని పాత్రధారి మాత్రమే అని నమ్మితే అదీ నిజం కాదు. ఎన్నో వందల సంవత్సరాలనాడు మరణించిన దుష్యంతుడు నేడు ఏ విధంగా కనుపిస్తాడు? దుష్యంతుడు తెలుగు మాట్లాడగలడా? అందుకని రంగస్థలం మీద కనుపించేది దుష్యంతుడు కావటానికి ఎంత మాత్రం వీలులేదు. అందుకని రంగస్థలం మీద కనుపించేది ప్రాత్రధారి అయిన వ్యక్తియా అంటే ఆ వ్యక్తికీ, కనుపిస్తున్న రూపానికీ ఎక్కడా పోలిక లేదు. అందువల్ల ఎవరు కనుపిస్తున్నట్లు? కంటికి కనుపిస్తున్నది దుష్యంతుడేకాని మన మనసుకు తెలుస్తుంది పాత్రధారి మాత్రమే అని. కనుక నాటక ప్రదర్శనం సమగ్రంగా వాస్తవం కాదు, సమగ్రంగా కల్పనాకాదు; రెంటి సంయోగం మాత్రమే. పాత్రా, పాత్రధారీ, రెంటి సమ్మేళనమే నటన.

క్రీ. శ. మొదటి శతాబ్దం (అయిదవ శతాబ్దంఅని కూడా) లో నాట్య శాస్త్రాన్ని రచించిన భరతుడు 'లోకధర్మి', 'నాట్యధర్మి' అని రెండుపదాలు వాడేడు. లోకదర్మి వాస్తవ జీవితంలో జరిగే కష్టసుఖాలను కష్టసుఖాలుగానే అనుభూతి చెందుతాడు. కాని నాట్యదర్మి మాత్రం రంగస్థలంమీది కష్టాలనుకూడ రసాత్మకంగానే అనుభూతి చెందుతాడు. వాస్తవ జీవితంలోని ఘటనలు కష్టాలు కష్టాలుగానే, సుఖాలు సుఖాలుగానే అనుభూతి కలిగిస్తాయి వ్యక్తికి. కాని నాటకరంగంమీది కష్టాలుకూడ ప్రేక్షకునికి ఒక విధమైన రసానందాన్నే ప్రసాదిస్తాయి. అందుకే

భయంతోను, దుఃఖంతోను కూడుకొనివున్న విషాదాంత నాటకాలను చూడటానికి కూడ ప్రేక్షకులు అభిలషిస్తారు.

నాటక కళ ప్రపంచంలో, ప్రత్యేకించి భారత దేశంలోను, గ్రీసు దేశంలోనుకూడ అతి ప్రాచీన కాలం నుంచీ వస్తూనే వున్నది. గ్రీసులో విషాదాంత నాటకాలు, భారతదేశంలో సుఖాంత నాటకాలు క్రీ. పూ. కొన్ని శతాబ్దాల క్రిందటే వుండి వున్నాయి. భరతుని నాట్యశాస్త్ర రచన క్రీస్తు తరువాతి శకాల్లో జరిగినప్పటికీ భారతదేశంలో నాటక కళ క్రీస్తుకు పూర్వం చాలా శతాబ్దాలకు ముందే అమలులోవుంది. తనకంటే ముందే వున్నది కనుకనే భరతుడు నాట్య శాస్త్రాన్ని రచించాడు. కళ ముందు పుట్టి దాని శాస్త్రం తరువాత పుడుతుంది.

గ్రీసులో విషాదాంత నాటకాలకూ, భారతదేశంలో సుఖాంతనాటకాలకూ ప్రాధాన్యం వుండటానికి ఈ ఉభయదేశాల జీవనవిధానాల్లో, జీవనాదర్శాల్లో వున్న పార్థక్యమే కారణం. విషాదాంత నాటకాల్లో నాటక ప్రదర్శన ఎక్కువగా మరణంతో ముగుస్తుంది. సుఖాంతంలో నాటక ప్రదర్శనాంతంలో మరణం చూపబడదు. భారతీయులు మరణాన్ని జీవితానికి అంతం అని భావించలేదు; జీవితం అనేది మరణంతో అంతరించక తిరిగి జీవిస్తుందని భారతీయుల విశ్వాసం. ఇందుకు విరుద్ధంగా గ్రీకులు జీవితానికి మరణమే అంతమని విశ్వసించారు. వారి నాటకాధి దేవుడైన డయోనిసస్ మాత్రమే మరణించి మళ్లీ జీవిస్తాడు కాని మిగతా మానవులంతా మరణించి మళ్లీ జీవించరని, అందుకే వారి దృష్టిలో జీవితానికి అంతం మరణమే. కనుకనే వారి నాటకాల్లో ప్రదర్శన మరణం చూపబడటంతో ముగుస్తుంది. కనుకనే అవి విషాదాంత నాటకాలు అయినాయి. అందుకని వారిలో సుఖాంత నాటకాలు లేకుండా పోలేదు. ఎక్కువగా వున్నట్టివి విషాదాంత నాటకాలే. భారతీయుల్లో ఎక్కువగా వున్నట్టివి సుఖాంతనాటకాలే. ఈ విధంగా ఉభయులకున్న విభిన్న దృక్పథాలు ఇందుకు కారణాలైనాయి.

క్రీ. పూర్వం మూడవ శతాబ్దంలోవున్న విఖ్యాత దార్శనికుడు ఆరిస్టాటిల్ విషాదాంత నాటకాల తత్వాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ 'కెథారసిస్' అనే పదాన్ని వుపయోగించాడు. కెథారిసిస్ అంటే బయటికి నెట్టటం అని అర్థం. మనిషిలో ఇమిడివున్న ఆవేశాలను తిరిగి అటువంటి ఆవేశాలే బయటికి నెట్టి వేయగలవని. మనిషికి బాధ కలిగించే ఆవేశాలు ప్రధానంగా భయం, జాలి అనేవి రెండు. విషాదాంత నాటకంలోకూడ ప్రత్యక్షమయే ప్రధాన ఆవేశాలు ఈ రెండే. అందువల్ల విషాదాంత నాటకాన్ని చూస్తే ప్రేక్షకులకు కలిగే ఈభయం, జాలి అనేవి వారిలో ప్రవేశించి వారి మానసాల్లో అదివరలో స్థిరపడివున్న భయాన్నీ, జాలినీ తొలగిస్తాయని ఆరిస్టాటిల్ సిద్ధాంతరీకరించాడు. నిజానికి విషాదంతం ప్రేక్షకుల హృదయాలపైన వేసే గాఢమైన ముద్రను సుఖాంత నాటకాలు వేయలేవు.

పూర్వపు రంగస్థల నిర్మాణంలోకూడ గ్రీకులకూ, భారతీయులకూ కొంత తారతమ్యం వున్నది. గ్రీకు రంగస్థలాలు సువిశాలంగా బృహదాకారంలో వుండేవి; బహిరంగ రంగస్థలాలు వారికి ప్రధానం. గ్రీకులవి ప్రజాతంత్ర రాజ్యాలు. రంగస్థలానికి ప్రతివారూ హాజరయేవారు. దూరంనుంచికూడ వినటానికీ, చూడటానికీ వీలుగా వారి రంగస్థలాలు బృహదాకారంలో వుండేవి. గ్రీక్ నాటక స్వభావం కూడా భారతీయ నాటక స్వభావానికంటే భిన్నమైంది. గ్రీక్ నాటకంలో లాలిత్యానికంటే గాంభీర్యానిది ప్రాధాన్యం, ప్రేమ కంటె శక్తిది ప్రాధాన్యం. అందువల్ల వారి రంగస్థలాలుకూడా అందు కుపయుక్తంగా వుండేవి. ఇందుకు వ్యతిరేకంగా భారత దేశంలో రాజుల పరిపాలన వుండటంతో రంగస్థలాలు ఎక్కువగా రాజప్రాసాదాల్లోనే నిర్మించబడి వుండేవి. అక్కడ హాజరు కావటానికి అందరకూ అవకాశం వుండేది కాదు. రాజుచేత ఆహ్వానించబడిన వారికి మాత్రమే అక్కడకు ప్రవేశం వుండేది. ఈ కారణాలవల్ల భారతీయ రంగస్థలాలు పరిమిత ప్రేక్షకులకు సరిపోయేట్లుగా చిన్నవిగా వుండేవి. అదీకాక, భారతీయ నాటకప్రదర్శనలో వాచికం కంటే ఆంగిక సాత్వికాభినయాలకు ప్రాధాన్యం ఎక్కువ. వీటి

సూక్ష్మ వివరాలను దగ్గరలోవుండి చూస్తేనేకాని బోధ పడవు. ఈ విధమైన రసాస్వాదన చేయటానికి అను కూలంగా నిర్మితమయేయి భారతీయ రంగస్థలాలు. భారతీయ నాటకంలోని ప్రధాన స్వభావం లాలిత్యం, ప్రేమ మొదలైనవి. రంగస్థలాలుకూడ వీటిని ప్రద ర్శించటానికి యోగ్యంగా వుండేయి.

కొందరు చరిత్రకారుల సిద్ధాంతాల ప్రకారం భార తీయ రంగస్థలం మీద గ్రీకు రంగస్థల ప్రభావం పడిందని, దానికి వారు చెప్పే కారణం ఏమంటే భార తీయ రంగస్థలంలోని తెరను 'యవనిక' అంటారని, ప్రాచీన భారతీయులు గ్రీకులను యవనులు అని పిలచే వారు. ఆ అర్థంలోనే రంగస్థలంమీది తెరకు యవనిక అనే నామకరణం జరిగిందని, ఈ సిద్ధాంతం ఎంత వరకు సముచితమో నిర్ణయించడం కష్టం. ఒక దేశపు సాంస్కృతిక ప్రభావం మరొకదేశపు సం స్కృతిమీద పడటం చరిత్రలో జరుగుతూనే వస్తూంది. కొన్ని కాలాల్లో, కొన్ని విషయాల్లో ప్రాచ్య సాంస్కృ తిక ప్రభావం పాశ్చాత్య సంస్కృతిమీదా, మరికొన్ని కాలాల్లో మరికొన్ని విషయాల్లో పాశ్చాత్య సాంస్కృ తిక ప్రభావం ప్రాచ్య సంస్కృతిమీదా పడుతూ వచ్చింది. దేశాలమధ్య ఇటువంటి సాంస్కృతిక విని మయం అనివార్యం.

ఇకపోతే, నాటక ప్రదర్శనలో సంగీతం ఎంతవర కవసరం అనే ఒక సమస్య వున్నది. నాటక ప్రద ర్శనం ఎక్కువగా దృశ్య ప్రధానం. అభినయం అందు లోని ముఖ్యభాగం; నటన ప్రధానం, ఇవి ప్రేక్షకులు కంటితో చూచే విషయాలు, నాటకంలోని సంభాషణలు అప్రధానాలు కావు. నృత్యనాటకాలు, సంగీత నాట కాలు ప్రత్యేకంగా వుంటాయి; వాటి విషయం వేరు. తెలుగు నాటక రంగంలో పాటలకంటే పద్యానిది ప్రదాన స్థానం అయింది, ప్రత్యేకించి పౌరాణిక నాటక ప్రదర్శనాల్లో. రంగస్థలం మీద నటుడుసటనసుఒకప్రక్కవుంచిచీటికీమాటికీపద్యాలతో ప్రేక్షకులను రంజింపచేయబూనటం, పద్యం ముగిసిన కొంతసేపటివరకూ గుక్కపట్టి రాగాన్ని విసరటం మొదలైన గానపు గారడీలు నాటకప్రదర్శనలోని కళాత్మకు చాలా భంగం కలిగిస్తూ వచ్చినాయి.

బళ్లారి రాఘవాచారిగారు ఈ విధానాన్ని వ్యతిరేకించి సంభాషణకూ అభినయానికి మాత్రమే విలువ ఇస్తూ ఒక మార్గాన్ని చూపెట్టేరు. సంగీతానికి విలువ లేదని కాదు, రంగస్థలాన్ని నటనా స్థలంగానే వుంచాలి కాని పాటకచేరీగా మార్చరాదని, చూచే ప్రేక్షకులను వినే శ్రోతలుగా చేయవద్దని, నాటకం చూస్తున్నారు అనటం వున్నది కాని నాటకాన్ని వింటున్నారు అనటం వాడుకలోలేదు. రేడియో నాటికలు ఆవిర్భవించిన తరువాత చూడటం అనే పదానికి బదులు వినటం అనే పదం వాడుకలోకి వచ్చింది; దృశ్యం శ్రవ్యంగా రూపాంతరం చెందింది.

ఆధునిక భారతీయ రంగస్థలంలో రవీంద్రనాథ ఠాకూర్, హరీంద్రనాథ చట్టోపాధ్యాయ మొదలైన వారు ఎన్నెన్నో మార్పులను, నూతన విధానాలను ప్రవేశపెట్టి భారతీయ రంగస్థలాన్ని ఆధునికీకరణ చేయటంలో ఎంతో సేవచేశారు. ఇందుకు అటు పాశ్చాత్య, ఇటు దూరప్రాచ్య ప్రభావాలు చాలా పని చేసినాయి.

నాటక ప్రదర్శనలోకూడ మిగతా కళలలోమాదిరే వ్యంజన (Suggestion) కే ప్రాధాన్యం వుండాలి వుండాలికాని వాస్తవానికి ప్రాధాన్యం వుంచే రసానికి బదులు రసాభాస మాత్రమే లభ్యమవుతుంది. రంగస్థలంమీద అరణ్యాన్ని చూపవలసి వచ్చినపుడు చెట్లను తెచ్చి రంగస్థలంపై నిలబెట్టటం, సౌధాలను చూపాలసొచ్చినపుడు రంగస్థలంమీద అట్టలతో సౌధాలను నిర్మించటం మొదలైన వాస్తవ ప్రదర్శ నాలు నాట్యధర్మానికి విరుద్ధంగా వుంటాయి, మొరటుగా వుంటాయి. అటువంటి వాస్తవ వస్తువులను ప్రత్యక్ష పరచకుండానే ఒక విధమైన వ్యంజన రూపంలో వాటి ఉనికిని ధ్వనింప చేయాలి.

పౌరాణిక, చారిత్రక నాటకాలు తగ్గి సాంఘిక నాటకాల ప్రదర్శనలు ఎక్కువ వ్యాప్తిలోకి వచ్చిన తరువాత బూజుపట్టిన కొన్ని నాటక సాంప్రదాయాలు అంతరించి ఆధునిక విధానాలు కొన్ని ప్రవేశించటం ముదావహం. వీటిలో పాటలూ, పద్యాల ప్రాబల్యాలకు బదులు నటనానైపుణ్యమూ, సంభాషణా చాతుర్యమూ, వ్యంగ్యమూ ప్రధానాలుగా వుండి ప్రేక్షకులను

రంజింప చేస్తున్నాయి. ఈ నాటక ప్రదర్శనాలు ప్రత్యేకంగా సంఘ ప్రయోజనకరంగా వుంటున్నాయి. సంఘ ప్రయోజనకరంగా వున్నంతమాత్రాన వాటి కళాకౌశలంలోని ఔన్నత్యానికేమీ భంగం వాటిల్లదు. సంఘ శ్రేయానికి తోడు ఇటువంటి నాటక ప్రదర్శనలు ప్రేక్షకులకు రసానుభూతిని కలిగించటంలో కూడ ఏమీ లోపం చేయవు.

వాస్తవానుకరణ చూపే నాటకాలు అవసరమే, సందేహంలేదు. కాని ఆదర్శవాదంతో నిండిన నాటక ప్రదర్శనాలు అంతకంటే ఎక్కువ అవసరం. సంఘంలో ఏమి చెడు వున్నదో చూపటంకంటే కూడ అవసరం, సంఘంలో ఏమి మంచివుంటే బాగుంటుందో అని చూపటం, ఏది పనికిరాదో చెపితేమాత్రమే చాలదు, ఏది పనికివచ్చేదో కూడ చెప్పాలి.

నాటక కళ మిగతా కళలన్నిటి సమ్మేళనం కనుక మిగతా కళలకంటేకూడ మానవజీవితాన్ని బాగుపరచడంలో, ఆనందపరచటంలో, వాస్తవానికీ, కల్పనకూ ఒక సమైక్యతను చేకూర్చటంలో ఎంతగానో దోహదం చేస్తుంది.

మనిషి రంగస్థలంమీద ఎంత గొప్ప నటుడుగా ప్రత్యక్షమైతే అంత గొప్ప విషయం; కాని వాస్తవమైన నిత్యజీవితంలో ఎంత తక్కువ నటుడుగా ప్రత్యక్షమైతే అంత గొప్ప విషయం, తనకూ, తన చుట్టూవున్న సంఘానికీ కూడ అంత శ్రేయం, అంత ప్రేయం :

★★

జీవితం విలువైనదే. కాని అంతకన్నా సంయమనం, క్రమశిక్షణ విలువైనవి.

— తిరువళ్ళువార్,

# "పురుషులందు పుణ్యపురుషులు వేరయా!"

— పురాణం సుబ్రహ్మణ్యశర్మ

కళాతపస్వి, కళాస్రష్ట, కళాజీవి అనే మాటలు చాలా చవకైపోయిన ఈ రోజులలో నాటకరంగానికి జానపద, నృత్య, సంగీత, నాటక కళా ప్రక్రియలకు జీవితాన్నంతా ఖర్చుచేసిన శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్యగారివంటి వారి గురించి రెండు మంచిముక్కలు వ్రాయాలంటే, ఎంతో చిత్తశుద్ధి, సంయమనం కావాలి. లక్ష్మీనరసయ్యగారితో పరిచయం నిజంగా ఒక సన్మిత్రునితో చేయి కలపడంలాటిది. ఎంతో తెలుసుకున్నా, ఎందరితోఎన్నో పరిచయాలు, అనుభవాలు కలిగివున్నా వారిలోని 'మాడెస్టీ' చాలా తక్కువ మంది ఆర్టిస్టుల్లో కనపడుతుంది. కళ కళ అంటూ వట్టి కబుర్లతో ఆత్మవంచన చేసుకునేవారెందరో తారసపడతారు. కాని లక్ష్మీ నరసయ్యగారితో పరిచయం తులసి మొక్కతో పరిచయమేకాని గంజాయి వనంతో కాదు అని నాకనిపిస్తుంది.

లక్ష్మీనరసయ్యగారు పండితుడు కాదు. పండితులలో వుండే భేషజం, చాదస్తాలు, మొండితనం ఆయనలో మచ్చుకి కూడా కనపడవు. పెద్ద పెద్ద చదువులు వెలిగించిన వారిలో కనపడని సహృదయం, సంస్కారం వారికి వెన్నతో పెట్టిన విద్యలా అబ్బింది.

లక్ష్మీనరసయ్యగారి జీవితాన్ని పరిశీలిస్తే ఆయన కృష్ణాజిల్లాలో పుట్టి తెలంగాణాలో పెరిగారు. నైజాం ఆంధ్ర ప్రాంతాల సంస్కృతిని జీర్ణంచేసుకుని ఈ ఉభయ ప్రాంతాల మధ్య వారధిలా తాను నిలిచారేమో అనిపిస్తుంది. జానపద కళారూపాల్ని వెలికితెచ్చిన వారూ, నాటక రంగానికి సేవచేసిన ప్రముఖులు చాలామంది అన్నదాతలైన రైతుకుటుంబాలనుంచి వచ్చినవారే. ప్రజానాట్యమండలి సమర్పించిన అనర్ఘ రత్నాల్లో కర్నాటి లక్ష్మీనరసయ్య ఒక అమూల్య రత్నం

డాక్టర్ రాజారావువంటి కళాకారులతో లక్ష్మీనరసయ్యకు ఆత్మీయత వుంది. 'ముందడుగు' నాటకచరిత్రను తరిస్తే లక్ష్మీనరసయ్య గారి చరిత్ర బయటపడుతుంది.

అటు రంగస్థలంమీద, ఇటు రచ్చ సావిళ్ళలోనూ బుర్రకథలుచెప్పి రాజకీయోద్యమంలో ప్రవేశించి కారాగారశిక్ష లనుభవించి రాటుతేలిన సైనికుడు లక్ష్మీనరసయ్య. కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలివారి 'మాభూమి'లో మంగలి రాముడి పాత్రలో నరసయ్యగారిని చూసి శ్రీ గోపీచంద్, శ్రీ నార్లవారే ఎంతో మెచ్చుకొని అభినందించారు.

శ్రీ కోడూరి అచ్చయ్యగారు, శ్రీ పెరుమాళ్ళుగారు ఉభయులూ కర్నాటివారి జీవితాన్ని ప్రభావితంచేసి వారిని తీర్చి దిద్దారు. అనిశెట్టి 'మావూరు' నాటకంతో వీరి మహంకాళిపాత్ర అద్భుతమైనది.

సుమారు ముప్పయి సంవత్సరాలుగ నాటకరంగానికి సేవచేస్తూ జానపద కళారూపాలకు ప్రాణంపోస్తూ తెలుగునాట ప్రతివూరు 'మా వూరు-మా భూమి' అను

కుంటూ తిరిగి ప్రజల నుత్తేజపరిచే కార్యక్రమాల్ని చేపట్టిన శ్రీ లక్ష్మీనరసయ్యగారు సామాన్యునివలె కనిపించే అసామాన్యుడు.

ఆంధ్రనాటక కళాసమితిని స్థాపించి చరిత్రను సృష్టిస్తున్న కర్నాటివారు ఆదిలో కె. వెంకటేశ్వరరావు వంటి వారికి శిక్షణ నిచ్చారు. వారి సేవలను గుర్తిస్తూ అనేక సన్మానాలు జరిగాయి.

కృష్ణునివెంట గోపికలు పరుగెత్తినట్లు ఆయా కళాస్వరూపాలు ఆయనవెంట పరుగెత్తి ఆయన్ను వరించి ధన్యతచెందాయి. నిజాయితీ, నీతి కరువైన ఈ కాలంలో లక్ష్మీనరసయ్య వంటివారు ఇంకా జండా ఎగరవేస్తూ వున్నారంటే - ఒక్క సత్పురుషుడు యావత్ప్రపంచం కంటె అధికుడని చెప్పడానికి నేను సాహసిస్తున్నాను.

★★





విజయవాడ సోషల్‌క్లబ్ అండ్ లిటరరీ సొసైటీ వజ్రోత్సవాల సందర్భంగా శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య గారిని సన్మానిస్తూన్న కళావాచస్పతి శ్రీ జగ్గయ్యగారు

# "మహా మనీషి - శ్రీ కర్నాటి"

— తారకరామారావు

హైదరాబాదు

మల్లెపూలను మరపించే, తెల్లని దుస్తులు, మాయని చిరునవ్వు, నిశితమైన చూపులు, అనుభవాన్ని, ఆప్యాయతను దర్పణంగా చూపే బట్టతల ... వీటి ప్రతిరూపమే, శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య.

ఓ మంచి నాటకాన్ని చూచినా, మంచి మిత్రుణ్ణి కలుసుకున్నా, ఆయనకు పరమానందం. అప్పుడాయన ముఖం విందుభోజనం చేసిన వాడిలా వుంటుంది. అది ఆయన సొత్తు.

ఆంధ్ర నాటకరంగం క్షీణించి పోతున్నదనీ, పోయిందనీ, టముకు బజాయించే విమర్శకులను ఆంధ్ర నాటక కళా సమితి నిర్వహించే, నెలవారీ కార్యక్రమాలకు తీసుకవెళ్ళి, అక్కడ పోగయిన జనాన్ని, వాళ్ళ ఉత్సాహాన్ని వాళ్ళ ముఖాల్లో ప్రతిభవించే రియాక్షన్స్‌ని చూపెడితే, చాలు! ఆంధ్ర నాటకరంగం సజీవమే అని ఒప్పేసుకుంటారు. అలా జనాన్ని సమీకరించేవాళ్ళకు నాటకరంగంపై అభిలాషనూ, ఉత్సాహాన్ని, ఉద్వేగాన్ని కలిగించినవ్యక్తి శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య

ఉపన్యాసాలు, ఊకదంపుడు సంభాషలు, నినాదాలు ఎక్కువై క్రియాశూన్యత కొరవడుతున్న రోజుల్లో, ఉప్పుకూ, కప్పురానికి తేడాలు తెలియక, విలువలు తారుమారవుతున్న సామాజిక వ్యవస్థలో, తల వంచుకు, తను నమ్మిన ఆశయంకోసం, ఆశలకు ఆకారాలు, రూపకల్పనలు చేసుకున్న వ్యక్తి-ఏకైక వ్యక్తి, నరసయ్యగారంటే యుక్తితో అన్నమాట అతిశయోక్తితో అన్నమాట కాదు, ఖచ్చితంగా వెండి రూపాయంత విలువ, సత్యమూ గల నిజం.

ఇంతటి అపురూపమైన వ్యక్తిత్వంగల, నరసయ్యగారి జీవితం, పూలబాట, వడ్డించిన విస్తరి కానేకాదు. ఆర్థిక ఇబ్బందులవల్ల, పై చదువులు చదవలేదు. చదివిన చిన్నపాటి చదువులో, అతి సామాన్యమైన పంతులుగా బ్రతుకుకు శ్రీకారం చుట్టారు అదీ ఉ[illegible] పంతులు. అలా సామాన్యంగా, ప్రారంభమైన జీవితం, ప్రజానాట్యమండలిలో పాత్రధారణతో, "ముందడుగు" వేసి, డాక్టరు రాజారావు, శ్రీ నాజర్‌లాంటి ఆణిముత్యాల సాంగత్యంతో, నిగ్గుతేని, నిఖార్సయిన మేలిమి బంగారుముద్దగా తయారైంది.

జీవితాన్ని కొండతో పోల్చితే, దాని శిఖరాగ్రానికి చేరటానికి, కావల్సింది, కఠోరపరిశ్రమ, లక్ష్యంవేపు ఏకాగ్రత, యివే; అవి సాధించటం అనితరసాధ్యం కాకపోవచ్చు. కానీ కొందరికే సాధ్యమయ్యేది, దాన్ని సాధించిన శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు పూజ్యుడు, ప్రేమపాత్రుడు.

"మంగలి రాముడ" యినా "చైను" లయినా "మహంకాళి" అయినా, శ్రీ కర్నాటి, జన్మతహా కళా తపస్వి. ఏ కళ స్వీకరించినా, దాన్ని ఆసాంతం పరిశీలించి, అవగాహన చేసుకుని, అహోరాత్రాలు పరిశ్రమించి, ప్రయోగం చెయ్యటం, ఆయనపద్ధతి. బుర్రకథలు చెప్పినా, నాటకాలు ఆడినా, ఆడించినా, ఏకాగ్రత, సిన్సియారిటీ, మర్చిపోలేదు. నాటికీ, నేటికీ గూడ జీవితాన్ని కళకు దత్తత యిచ్చి, తాను

నిమిత్త మాత్రుడిగా, సామాన్య మానవుడిగా, బ్రతకటం, కొందరికే సాధ్యం. ఆ కొందరిలో, శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు అగ్రగణ్యుడు.

ధనార్జన కోసమో, పేరు ప్రఖ్యాతులు సంపాయించి, 'పద్మశ్రీ'లు సంపాయించాలన్న యావతోనో, ఆయన కళలకు అంకితమవలేదు. నటరాజు యందు ప్రేమ. కళామతల్లి యందు వాత్సల్యం యివె, ఆయన్ను రంగస్థలానికి తీసుకవెళ్లాయి. జైలుపాలయినా, నీడ, నిద్ర కరువయినా, తోటి వాళ్ళంతా "బ్రతుకుతెరువుకై" విభిన్న మార్గాలనుసరించినా, సాటివాళ్ళు ఇది కులవృత్తిగాదు కూడుబెట్టదని వారించినా, చేపట్టిన మార్గాన్ని వీడలేదు. అందుకు ఆయనను వజ్రసంకల్పుడని అనొచ్చు. గత నాలుగు దశాబ్దాలుగా, నాటక రంగస్థల అభివృద్ధికోసం అనుక్షణం తపన చెందుతూ, తపస్సుచేస్తూవున్న లక్ష్మీనరసయ్యగారి జీవితం నేటితరం నటులకు, నాటక సంస్థల నిర్వాహకులకూ, ఆదర్శప్రాయమేగాదు, అనుసరణీయంగూడ.

ఇన్నేళ్ళుగా, కళారంగానికి అంకితమై పోయిన ఆయన సంపాయించింది, లక్షలూ కోట్లుగాదు. అంతకు మించిన తృప్తి. అదే ఆయన వ్యక్తిత్వానికి కలికి తురాయి.

'స్నేహమేనోయ్, శాశ్వతం' అన్న పదానికి, నరసయ్యగారు ఉదాహరణ. వయోభేదం లేకుండా, తారతమ్యాలు, కులమతాలు, ప్రాంతీయ విభేదాలు లేకుండా, కళాకారుణ్ణి ఆప్యాయంగా పలకరించటం ఆయనకే సొంతం. కళాకారుడు, సమాజ జీవితానికి ప్రతినిధి అన్న సిద్ధాంతం నమ్మిన వ్యక్తి కనుకనే, ఆయన నిత్యనూతనుడు, నిత్య యవ్వనుడు. అంతేగాదు. ఆయనలోని కళాకారుడు చిరంజీవి.

ఎన్ని సన్మానాలు జరిగినా, ఎంతమంది పొగిడినా, విమర్శించినా చెక్కు చెదరని మనస్తత్వం ఆయనది. ఎందుకంటె, ఆయన కళాతపస్వి. కళకే ఆయన జీవితం అంకితం. ఆయన కళామతల్లి ముద్దుబిడ్డ.

"ముందడుగు"తో ప్రారంభమైన శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారి జీవితం కలకాలం "ముందడుగు" వేస్తూనే ఉండాలి! ఇది ఆశీర్వచనంగాదు. ఆకాంక్ష, నాదొక్కడిదేకాదు, నాలాంటి వాళ్ళందరిదీనూ!

★★

కవి ఎవరోకాదు. కటిక చీకట్లో కూర్చుని, తన తీయని పాటలో ఏకాంతాన్ని ప్రతిధ్వనింపజేసే కోయిలే నిజంగా కవి.

— షెల్లీ.

# కార్యదీక్షా పరతంత్రతయయ్య - లక్ష్మీనరసయ్య

— డా. కొట్టిపాటి గంగాధరరావు

సాంఘిక నాటకోద్యమాన్ని ప్రారంభించి చక్కని రిహార్సల్సు చేయించి తరిఫీదు యిచ్చి క్రమశిక్షణతో నటుణ్ణి తయారుచేయించిన వారిలో ప్రథమాగ్రగణ్యులు మన ఆంధ్రదేశంలో శ్రీ కొప్పవరపు సుబ్బారావుగారు, డా॥ గరికపాటి రాజారావుగారు. సుబ్బారావుగారు తన ఉద్యమానికి విజయవాడ నొక్కదాన్నే కేంద్రంగా రూపొందించుకుంటే రాజారావుగారు అఖిలాంధ్రదేశాన్నే తన గురుకులం చేసుకున్నారు. 'మా భూమి' నాటకంతో వారు పాదం మోపిన ప్రతివూరిలోనూ ఒక సమాజం వెలిసింది. ప్రతి వాడలోనూ ఉత్సాహం పొంగి పొరలింది . సాంఘిక నాటకానికి ఆంధ్రలో భవిష్యత్తు వుందని నమ్మకం కలిగింది.

ఆ నమ్మకంమీదనే ఈనాటి సాంఘిక నాటక అభివృద్ధి కొనసాగి ఈ స్థాయికి చేరుకుంది. పల్లె పల్లెలా సాంఘిక నాటకాలకు నేడు రంగస్థలం, ప్రేక్షకవర్గం లభిస్తున్నదంటే అది పై ఉద్యమకారులు తరిఫీదు యిచ్చి దేశానికి సమర్పించిన కళాకారులు. నేటి ప్రముఖ రంగస్థల నటులుగాని సినిమా కళాకారులుగాని వారి శిష్యులు కానివారు లేరనే చెప్పాలి. అందులో ప్రముఖుల్లో ఒకరు శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్యగారు.

శ్రీ డాక్టరు రాజారావుగారి ఉద్యమం బహుముఖమైంది. నాటకాలు వ్రాయించటం, నటవర్గాన్ని తయారు చేయటం, సమాజాలను నిర్వహించటం, పోటీలకు వెళ్ళటం, ఇతర రాష్ట్రాలకు మన సమాజాలను తీసుకొని వెళ్లటం, ఇతర నృత్య గేయ, జానపదాలను వెలుగులోనికి తీసుకురావటం వగైరాలతో ఆయన కృషి ఆగిపోలేదు. నాటక కళాశాలలను ఏర్పరచాలని కృషి చేశారు. సాంఘిక నాటకానికి బహుళ ప్రచారం చేయాలని పౌరాణిక నాటకంలాగ జనాకర్షణీయంగా తయారుచేయాలని, సాంఘిక నాటకం స్వయం పోషకంగా రూపొంది తన కాళ్ల మీద తను నిలబడాలని కూడా కృషిచేశారు. కొంత వరకూ విజయం సంపాదించారు. తక్కిన కార్యక్రమం తన శిష్యవర్గానికి వదిలి కీర్తిశేషులయ్యారు.

సాంఘిక నాటకానికి బహుళ ప్రచారం పోటీలవల్ల కొంత జరిగింది. కాని యిదే ధ్యేయం కాకూడదని ఇవ్వాళ అందరూ తలపోస్తున్నారు. పోటీలు మినహాయిస్తే కంట్రాక్టుపద్ధతి అభిలషణీయంగాదు. ఇక మిగిలిన పద్ధతి నెలవారీ నాటక ప్రదర్శనలు.

అందరూ తలా ఒక పద్ధతిని కళకు సేవచేస్తుంటే శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు ఈ నెలసరి నాటకాలను నిర్వహిస్తూ దేశానికి అమూల్యమైన కృషి చేస్తున్నారు.

ఆ విధంగా డా. రాజారావుగారి ప్రగాఢవాంఛకు సేవచేస్తున్నారు. ఆంధ్రదేశానికి నడిబొడ్డయిన

పలు...ఆటవిక వస్తువులను నగరములకు గొనివచ్చి అమ్ముచున్నప్పుడు తమ గేయ నృత్య విశేషములను నగరములందును, పల్లెలందును ప్రయోగించుటచే నవి నాగరిక దేశములందును వ్యాపించెను."

ద్రవిడదేశపు దృశ్య ప్రబంధమైన 'కొరవంజి' నుండియే యక్షగానముత్పన్నమైనదని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వాదము. 7 కేవలము 'కొరవల అంజె' యే దృశ్య రచనమునకు మూలమనుట సత్య సమ్మతము కాజాలదు. వారు కొరవలో, మరియవ్వరో తెలియదుకాని, ఆ ప్రాక్తన మానవుల అంజె' [ఆట పాట–Ballad Dance) యే నృత్య–సంగీత–సాహిత్య ములకు మూలమైనదనుట ప్రాచ్య – పాశ్చాత్య విజ్ఞ విమర్శకు లంగీకరించినదే. కాని, దానిని కేవలము కొరవలను ఒకజాతికిమాత్రమే పరిమితము చేయనిచో శాస్త్రిగారి వాదము కొంతవరకును సమంజసమే. ఇంక నటీ–నట – విదూషక – ధ్రువలు దేశి రచనలలో నుం డియే రూపొంది యుండుననెడి విషయము సాదర ముగా ఆలోచింపదగిన విషయము. 8

16 వ శతాబ్దిలో కొరవంజి నృత్యము వర్ణిత మైనను 9 ఆ శతాబ్దములోకాని, ఆ వెనువెంటనేకాని సాహిత్య ప్రక్రియగా కొరవంజులు రచింపబడినట్లు కన్పట్టదు. కన్నడ మందలి కురవంజులుకూడ పదిహేడవ శతాబ్దమునకు మించి ప్రాచీనమనిపించు కోవని ముట్నూరి సంగమేశంగారు పేర్కొని యున్నారు. కావున కురవంజులు ప్రాచీనములు కావని స్పష్టమగుచున్నది. వారు కొరవంజులను మూడు రక ములుగా వివరించినారు. 10 ఆ విభజనము సమంజ సముగా నున్నది.

"కొరవంజి యక్షగానాలు ముర్విధాల కనిపిస్తాయి. కొరవంజి, కొరవ నాయకుల ప్రణయ వృత్తాంతాన్నే వర్ణించేవి మొదటి రకము. ఇందులో చెంచులక్ష్మి (కొరవంజి)ని, నృసింహస్వామి (కొరవ నాయకుడు) వలచి, వరించినగాథ వర్ణించబడుతుంది. కొరవంజిని సింగి అని, కొరవ నాయకుని సింగడని యిందులో వ్యవహరిస్తారు. తెలుగులో గరుడాచల మహాత్మ్యం, చోడిగాని కలాపం వగైరా రచనలిట్టివి. విశాఖ మండ లంలో ప్రదర్శింపబడే ఎఱుకల కీర్తన యీ చోడిగాని కలాపమే. ఈ కథలోగల ప్రణయ ఘట్టం, యీ పాత్రలు మిగిలిన కొరవంజి రచన లన్నిటికి మూలాలు. లక్ష్మీ నృశింహులకు బదులుగా పార్వతీ పరమేశ్వరులను ఎఱుక దంపతులుగా మార్చి వ్రాసిన యక్షగానాలు కూడ దీని ననుకరించి వెలసిన రచనలే. శహాజీ మహారాజుగారు తెలుగులో వ్రాసిన కిరాత విలాసమనే యక్షగాన మిట్టి అనుకరణమే... "

"నాయకుడు ఎఱుకత వేషంతో పోయి, నాయి కను కలసి, ఆమె హస్తరేఖలు పరీక్షించి, త్వరలో ఆమెకు అనుకూలుడైన భర్త దొరుకుతాడని చెప్పి, కొంత పూర్వరాగం ప్రదర్శించినట్లు వర్ణించిన రచ నలు కొరవంజి రచనలలో రెండవరకం. తెలుగులో రాములవారి ఎఱుక, సీతాకల్యాణం వగైరాలు, కన్న డంలో అర్జున కొరవంజి, కృష్ణ కొరవంజి వగైరాలు, యీ రకమైన రచనలు."

"ముఖ్య కథతో ఏ విధమైన సంబంధమూ లేక పోయినా ఏదో విధంగా ఎఱుకత పాత్రకు ప్రవేశం కల్పించి, ఆమె చేత నాయికకు సోదె చెప్పించడం, తదుపరి ఎఱుక రాజును ప్రవేశ పెట్టి పరిహాస పూర్ణంగా వర్ణించడం, ఆమీద నా ఎఱుక దంపతుల వాద వివాదాలు ముయకగా ఏకరువుపెట్టి ప్రదర్శించడం అనే ఘట్టాలుకల రచనలు మూడవ రకమైన కొరవంజి రచనలు. ఈ రచనలో ముఖ్య కథలో పూర్వ భాగం ఎఱుకల సంవాదానికి పీఠికగా ఉపకరిస్తుంది. వీరి సంవాదం ముగిసిన పిదప ముఖ్య కథలో మిగతా భాగం ఏదో అయిం దంటే అయిందన్నట్లుగా పూర్తిచేయబడుతుంది."

"కాగా, ప్రాచీన కావ్యములందు కొరవంజి నృత్య వర్ణనలు, కొరవంజి పాత్ర వర్ణనలు మాత్రమే కన్పట్టు చున్నవి. అటు పిమ్మట యక్ష – గాన–వీధినాటకము లందు కొరవంజి పాత్రకు ప్రవేశము కలిగినది. అం తియే గాదు, సింగి, సింగడుల కథయే నాటకమైనది. ఇంక ప్రత్యేకముగా 'కొరవంజి' అనుపేర రచన వెలయుట అనునది తెలుగులో 19వ శతాబ్దిలోనే జరిగి నది." ఇంక కొరవల అంజెయే యక్షగానాదులకు

పూర్వరూప మనుట సమర్థనీయమైన సిద్ధాంతము కాజాలదని పేర్కొనుట చర్విత చర్వణము కాగలదు.

'కొరవంజు' అనెడి ప్రత్యేక రచనలలో ప్రబోధ చంద్రోదయాదులవలె వేదాంత బోధాత్మకములైనవి కూడకలవు.

### కొరవంజి (కుఱవంజి)

1 ఆంధ్ర విశ్వకళా పరిషత్తులోని వ్రాత ప్రతి- 10వ సం. 486

2. "అణునిభమధ్య లా క్రియలు నా పరిభాషలు నొప్పఁజిందు, జ క్కిణి, కొరవంజి మేళములఁ గేళిక సల్పిరి ...
-(బుశ్యశృంగుని యెదుట వేశ్యల నృత్యము - రామాభ్యుదయము-11-131)

3. తూమాటి దోణప్పగారి "యక్షగానములు: ప్రాచీనాంధ్ర నాటక స్వరూపములు" అనెడి వ్యాసములోనివి పై అంశములు ...
- (Andhra University Colleges Magazine and chronicle - P. 12)

4. బెబ్బులి కొదమంజేబిచ్చి పిలిచి కొఱవంజి యొకండదరక......"
— ఇచ్చట పురుషునకు పేరు.

"చలువున్నది ప్రోడ జాడలఁ గొఱవంజియ లతిలోత్తమ నృత్య నిలయసీమ ...
-ఇచ్చట నృత్యమునకు పేరు.

5. "మంచియదోయి మూపులను గోపులకున్నె ఱిచూపజోటిజో
డంచు లలంకరింప గుఱులైన కిరీటము వెట్టి జక్కిణి
సంచున కజ్జ గంధి జలజాత సుగంధి మణిమయ క్రియ
ల్గాంచి నఁచు ట్టఁబు ట్టిఁడి కల్నె ఱ పెం గొరవంజి యాటలన్"
-కకుత్స్థ విజయము-111-86.

"ఎఱుకో యెఱుక యటంచుం గొరవంజి నటించె నొక్క గురుకుచ చంకక చురుకడు బంగరు పట్టియు గొరిదిం గొల్లాపుర మ్ము నుధ్దులు వెలయన్"
"తరకట చురకటగాదే తరుణీ నామాట నీ కు దార్కాణముగనే
చురుకనికి బుద్ధిదేవే యెఱుకతగవె యం చు నొక్క యింతి నటించెన్"
- దశావతార చరిత్రము.
— VII - 287 – 88

సవరని పని వన్నెబవిక పిక్కటిలంగగులు కు పొలుబ్బు గుబ్బలు చెలంగ
ముంజేపులను ముఖాంబుజమున నొకవింత పొలుపు దెల్పెడు పచ్చబొట్టు లెసగఁ
గుఱుమాపు పయ్యెంట చెఱుగులో నిడుకొన్న ముద్దుబల్కుల చిన్ని బుడుత దమరఁ
దర తరంబులనుండి తన యింట వెలయు పుత్త డి పైడి బుట్టి మస్తమున వెలుగ
బొమల సందున నామంబు భూతిపూత నెన్నొసట బుక్కిట విడింబు కన్నుగొనల గాటుకరహింప వచ్చి......"శుక సప్తతి-1-97.

6. సుగ్రీవ విజయ యక్షగాన పీఠిక- పుటలు 4-6.

7. ఈ వాదమును నేలటూరి వేంకట రమణయ్య గారు విమర్శించి యున్నారు.- ఖర ఉగాది— ఆంధ్రపత్రిక. వీరి వాదము బొమ్మలాటలనుండి యక్షగాన ముత్పన్నమైనదని; ఇదియును సత్య సమ్మతము కాజాలదు.

8. 'నటి' అనెడి పాకృత ధాతువునకు 'నృత్' అను నది సంస్కృత రూపమని కొందరు తలంచు చుండుటయు, "దాక్షిణాత్యులు బహునృత్త- గీత ప్రియులు" అని భరతుడు చెప్పియుండుటయు ఇప్పట్ల స్మరణీయము.

See also "Natya, Nritta and Nritya, Their mearing and relation P-13,

by Sri K. M. Varma-Orient Long mans. (1957)

9. మళయాళమునందలి 'కౌఅత్తియాట్టమ్' అరవము నందలి 'కురువై కూత్తు' అనునవి కొరవంజి నృత్యములే. ఈ 'కురవై కూత్తు' శిలప్పదిగార కాలమునందే ఉన్నట్లు తెలియుచున్నది. ఇది నాడును నృత్య విశేషముమాత్రామే. 16వ శతాబ్దికిముందు కురవై కూత్తు దృశ్యరచనగా లేదా సాహిత్య ప్రక్రియగా రూపొందినట్లు చెప్ప దగిన ఆధారములు లేవు.

10. "కన్నడ యక్షగానములు"–
భారతి–ఫిబ్రవరి; 1956
పు. 68:

11. ఈ వివరణమునుబట్టి చూచినచో "ఆ జాతి పాత్రలుకల దృశ్య విశేషము 'కొరవంజి' యను నేలటూరివారి వాదము పరిమిత సత్యపూరితము" అనెడి దోణప్పగారి వాక్యమునకు ("యక్ష గానము : ప్రాచీనాంధ్ర నాటక స్వరూపములు" పు. 12) అవకాశము లేదని స్పష్టమగుచున్నది.

★★



# నా కళాభివందనములు

— ధూళిపాళ



శ్రీ ధూళిపాళ : శ్రీ కర్నాటి

చరిత్రలో ఒక్కొక్కవ్యక్తి ఒక్కొకరంగంలో నిష్ణాతుడవడం సాధారణం. ఒకే వ్యక్తి పలురంగాలలో సిద్ధహస్తుడవడం అసాధారణం. అసామాన్యం. అట్టి అసామాన్య వ్యక్తులలో శ్రీ లక్ష్మీనరసయ్య గారొకరు.

ఆయన చక్కని నటులు. మంచివక్త. ప్రయోక్త సంఘసేవకుడు.

శ్రీ కర్నాటివారు నాకు తెలిసి షుమారు మూడు దశాబ్దములుగా, వివిధరూపాల్లో కళా సేవచేస్తున్న గొప్ప కళాకారుడు.

నాతో పాటు వారు చాలా రేడియో ప్రదర్శనలలో పాల్గొనడం భాగ్యంగా భావిస్తాను.

జముకుల కథలు, బుర్రకథలు, వీధి భాగవత గాథలు వారికి వెన్నతోపెట్టిన విద్య.

చక్కనివాచకం, భావగాంభీర్యం భగవంతు డనుగ్రహించిన వరప్రసాదం.

ఇట్టి నటశ్రేష్ఠులకు, ఎన్నెన్నో సన్మానాలు చేయడం ప్రజాకర్తవ్యం.

మిత్రులు శ్రీ కర్నాటివారికి నా కళాభివంద నములు.

★★

# నాటక చరిత్రలో రచయిత - దర్శకుడు

— డా. సి. నరసింహం

మాట్లాడటం ఒక కళ, పాట పాడటం ఒక కళ, చిత్రలేఖనం, వాయిద్య సమ్మిళితం ఇవన్నీ ప్రతి ఒక్కటి ఒక కళ. కాని ఈ సర్వానుభూతుల సమ్మిళితమైన కళ నాటకం– నాటకం మానవుని బాహ్యాంతరంగాలమీద నాట్యంచేసి వృత్తేజితుణ్ణి చేస్తుంది. నాటక యితివృత్తం హృదయాన్ని తన కోణానికి లాక్కొంటుంది –చక్కని యితివృత్తం– సవ్యమైన పాత్రపోషణ జరిగిననాడు నాటకం కలకాలం జీవిస్తుంది.

నాటకానికి జీవం నటుడు. నటుడికి ప్రాణం నాటకంలోని పాత్ర. కాని ప్రదర్శనకు ఆయువు–వ్రాసిన నాటకం, వేసిన పాత్రలేకాక – రంగాలంకరణ, రూపశిల్పి కూర్చిన ఆహార్యం–సంగీతం–వీటి సమ్మిళితం. ఇన్ని విభిన్న కళలను సమన్వయపరచి ప్రదర్శనను రూపొందించే ringmaster డైరెక్టరు. దీనికి నాటక విభాగను లన్నిటిలో ప్రావీణ్యతకన్న వీటినిసవ్యంగా వినియోగించే శక్తి ఆసక్తి వుండాలి. ముఖ్యంగా–ఒక రచయిత తన భావాన్ని నాటకంగా వ్రాస్తే నాటక ప్రదర్శనద్వారా నటులు ఈభావాన్ని ప్రేక్షకులకిఅందిస్తారు. ఇది సక్రమంగా జరిగింది, అక్రమంగా జరిగింది, డైరెక్టరునిబట్టి వుంటుంది. అజాగ్రత్తవల్ల నాటక యితివృత్త స్వరూపమే మారిపోవచ్చు.

ఇప్పుడు – నాటక లక్షణాలు చూద్దాం. నాటకం – జరుగుతున్న కథ మన కళ్ళముందు జీవిస్తున్నట్టు సూచిస్తుంది. సన్నివేశంలో దానితో ప్రేక్షకుడు లగ్నమైనట్టు కనబడతాడు. కాని నాటకానికి, జీవితానికి వున్న దూరం. దూరంగా నిలబడుతుంది. ఉదా : నాటకంలో పదిమంది హత్యచేయొచ్చు, నలుగురు ఒక ఆడమనిషిని మానభంగం చేయొచ్చు. ప్రేక్షకుడు అయ్యో అంటాడు. – కాని ప్రత్యక్షంగా ప్రదర్శనలోకి తనురాడు. జీవితంలో ఇది విభిన్నంగా వుంటుంది. ఈ Clearage వుంచడం ఎంత ముఖ్యమో నాటకం – ప్రేక్షకుడిని తనతో పూర్తిగా లీనం కానీయకుండా నాటకం చూస్తున్నాడని అనిపించడం అంత ముఖ్యం. Coleridge చెప్పినట్టు "తెలిసి నమ్మిన అబద్ధం నాటకం" – అంటే నాటకంలో జరుగుతున్న కృత్రిమమని తెలిసి తాత్కాలికంగా లీనమై నమ్ముతాం. నిజంలాగ – కృత్రిమంకాదు అనిపించిననాడు అది నాటకంకాదు.

ప్రేక్షకులు నాటకానికి వచ్చేది వినోదంకోసం. రోజంతా పనిచేసి అలసిన మనసుకి విశ్రాంతి వికాసాలకోసం– తేలని, తేల్చలేని సమస్యలు చర్చించడానికి–భరించలేనిబాధలుఅంటకట్టించుకోడానికి–రాటు. అలా చేసిన రచయిత–అలసిన వ్యాపారి తన సరుకు ఏదో ధరకి కట్టబెట్టినట్టుంటుంది–సరియైన ఆ విలువ రాదు. ఈ వినోదంలో ప్రేక్షకులు క్రొత్త ప్రయోగం చక్కని వినోదం ప్రతిక్షణం కోరుకుంటారు.

నిజానికి Aristotle ప్రకారం ప్రతి నాటకానికి ఆది మధ్యాంతరాలుండాలి. అంటె నాటకంలో ఒక సమస్య ప్రారంభమైతే– అది విడమర్చబడి, చివరికి

సమస్య అంతం కావాలి. అంతే కాని రచయిత సమస్యలు చేర్చి మధ్యలో జారిపోకూడదు. రచనలో యితివృత్తానికి ఒక నిర్దిష్టమైన ఉద్దేశ్యముండాలి. పాత్రల స్వభావాలు జాలి, కరుణ, ద్వేషం పుట్టించేవైతే, ఆ పాత్రల రచనా అలాగే సాగాలి ఇన్ని విభిన్న స్వభావాల పాత్రలైనా యితివృత్తాన్ని విడిచి సాము చెయ్యకూడదు. – పాత్రల స్వభావం ప్రేక్షకుడిని ఆకట్టుకుని రంజింప జేసేదిగా వుండాలి. – పాత్రల స్వభావం సమ్మతగినదిగా వుండాలి. ఉదా: సుప్రభాతం పాడే సమయంలో అలసిన యజమాని ఆఫీసు నుంచి వచ్చినట్టుండకూడదు. దీపం వెలిగించమని అడగకూడదు – రచయిత పాత్రపోషణ కోసం సమయం, సందర్భం, పాత్ర ఔచిత్యం పోషించాలి.

నాటకం చూడటం కొత్తవూరు చూడటం లాంటిది. ఊరు రాగానే అనేకస్థలాలు, అనేకమందితో పరిచయం ఆశాజనకంగా ఆనందంగా వుంటుంది. కానీ గడచిన కొద్ది ఆ వూరునిబట్టి ఆ వూరుమీద ఆసక్తిపోయి బోరుకొడుతుంది. అలాగే నాటకం మొదటిసీనులో పాత్రల ప్రవేశం నాటక స్వభావ-విషయ పరిచయం కుతూహలాన్ని కలిగిస్తుంది. కాని రచయిత జాగ్రత్త తీసుకోకపోతే నాటకం మొదట-రక్తికట్టి- రసహీనమై పోతుంది క్రమేపి. కనుక రచయిత తన యితివృత్తం లోని ముఖ్య విషయాలను అవసరమున్నంతవరకే చెబుతూవుండాలి. మధ్యలో కుతూహలం కలిగించే విధంగా కథని వుయ్యాలవూపి ఏమౌతుందో అనిపించగలగాలి. అప్పుడే నాటకం రక్తికడుతుంది.

ఉదా : భార్య-భర్త మామగారు చక్కగా సంసారం చేసుకుంటున్నారు – ఇంటికొచ్చినవాళ్ళు ఆదుకున్నారు.

కుతూహలం లేదుకాని, వారి పొందులో మధ్యగా భార్యకు భర్త జేబులో మరొక స్త్రీ ఫొటో కనబడటమో ? ప్రేమికులు యిరువురూ పెళ్ళి చేసుకోవాలనుకునే సమయంలో ప్రియుడు ప్రేమకంటే కర్తవ్యం ముఖ్యమని వెళ్ళిపోవడమో లాంటి వాటితో గమనంలో మార్పు వస్తుంది. అయితే ఈ వచ్చిన మార్పుకి నాటకం చివరలో అర్థం కలిపి పరిష్కారం చూపాలి. నాటకానికి ముగింపు క్లుప్తంగాను, హృదయానికి హత్తుకునేదిగాను వుండాలి. నాటకంలో సృష్టించిన పాత్రలు సమాజంలో మరోవ్యక్తిని పోలేదిగాను, వెక్కిరించేదిగాను వుండటం నాటకానికే అవమానం. రచనలో రచయిత తాను చెప్పదల్చుకొన్నది సూటిగా స్పష్టంగా చెప్పాలిగాని, కథకోసం పాత్రలకోసం భావాన్ని త్యాగంచెయ్య కూడదు – నాటక రచన ప్రదర్శనలో నత్తనడక వుండకూడదు-మాటలు పొందికగాను సహజంగాను వుండాలి.

యిక దర్శకుడు రచయితభావాన్ని ప్రేక్షకులకు అందించే విధానాన్ని నిర్దేశిస్తాడు. రచన ఏ విధంగా విశదీకరిస్తే భావం ప్రేక్షకుల హృదయానికి అతుక్కుపోతుందో సరియైన అంచనా వేయగలగాలి. దీనికి జంకు, తారతమ్యాలు వుండరాదు. – నటులని ఎన్నిక చేయడం **Set design** చేయించటం-నాటకానికిఅవుసరమైన సంగీతం నిర్ణయించడం మనదేశంలోదర్శకునిదే కనుకనటనలోప్రదర్శనలోఅనుభవమున్నవారే-దర్శకునిగా గణుతికెక్కుతున్నారు. రచయిత ఊహలో నాటకం చక్కనిదైనా ఆ చక్కని భావం ప్రదర్శనా యోగ్యంగా చెయ్యడంలో అవసరమైన మార్పులు రచనలో చెయ్యడానికి రచయిత ఎప్పుడూ సిద్ధంగా వుండాలి. –నిజానికి నాటక చరిత్రలో ఏ దేశంలో చూసినా, నాటకం – ప్రదర్శనలోపల మార్పులు చేసినవే. షా పిగ్మలిన్ మొదలు – గురజాడవారి కన్యాశుల్కం వరకు.

దేశ కాల పరిస్థితులనుబట్టి అన్ని దేశాల్లోను నాటకం మార్పులు చెందింది. ఒకనాడు భావయుక్తంగాను – ప్రయోక్తలు – అసహజ దీర్ఘ వివాదాలతో వున్న నాటకాలు ఈ రోజు సామాన్యమైన ప్రజా భాషలో వున్నాయి. సహజత్వం కొరకు అడవి మొదలు రాజమహల్ వరకు నిర్మించబడిన నాటకశాలల అలంకరణ – సూచనప్రాయంగా అలంకరిస్తే ప్రేక్షకుడు ఆమోదిస్తున్నాడు.

ఈనాటి నాటకం సహజంగానూ, జరిగినది జరిగినట్టుగానూ, వుండవలసిన అవుసరంలేదు.– సహజత్వానికి దగ్గరగాను, నిజానికి చేరువలోను వుండాలి –

ఈనాటి తెలుగు నాటకరంగ పరిస్థితులనుబట్టి నాటకానికి మరికొన్ని లక్షణాలు కావలసివస్తూంది. స్త్రీపాత్రలు పెరిగినకొలది నాటకానికి ప్రాముఖ్యం తగ్గుతుంది. భారీఎత్తు సెట్లు – రంగానికి ఒక సెట్టు చొప్పున మార్పులు – వందలకొలది పాత్రలు రచయితని నాటనానికి దూరంచేస్తున్నాయి.

రాజకీయ యితివృత్తాలు కేవలం తాత్కాలికమైన అనుభూతి కల్గించేవి. నిత్య జీవనానికి సంబంధించిన సమస్యలపై వచ్చిన కథలు మనిషిని ఆకట్టుకుని కలకాలం నిలుస్తున్నాయి. తోటి రాష్ట్రాలతో పోలిస్తే ఒకటనిపిస్తుంది – రచయిత ప్రజలతో కదలి ప్రేక్షకుల అనుభూతి తన అనుభూతిగా రచించిననాడు నాటకం అభివృద్ధి చెందుతుంది. డ్రాయింగురూమ్ నాటకాలు మాత్రమే వచ్చినంతకాలం నాటకానికి ముందడుగులేదు.

కనుక ప్రదర్శన–కలకాలం నిలవాలంటే దర్శకుడు రచయిత – ప్రేక్షకులతోపాటు తాము కాలానుగుణంగా మారడానికి అంగీకరించి ఆచరించాలి.

★★





(కీ॥ శే॥ డా – రాజారావు నిర్మించిన 'పుట్టిల్లు' చలన చిత్రంలో నాజర్ బుర్రకథ దళం)

శ్రీ కర్నాటి, శ్రీ నాజర్, కీ॥ శే॥ ఏపూరిరామకోటి

# కళామూర్తి
# కర్నాటి లక్ష్మీనరసయ్య

— వి. రామన్న పంతులు

యథా జీవః స్వభావంహి
రపరిత్యజ్యాన్య దైహికమ్
పరభావం ప్రకురుతే
పరభావం సమాశ్రితః
జీవుడు తన స్వభావమును పరిత్యజించి
ఏ దేహమును ప్రవేశించునో దానికి
సహజమగు భావములనే కలిగియుండు
నట్లు నటుడు పరభావమును తలచుచూ
పరభావమునే తనలో ఆశ్రయించుకోవలెను.
ఏవం బుధః పరభావం సోస్మీతి
మనసాస్వరన్
వేషాం వాగంగ లీలాశ్చేష్టాభిస్తు
సమాచరేత్ !

అతడే నేను అను భావమును తన మనసునందు తలచుచూ వాగాంగ చేష్టలతో పరభావమును ప్రదర్శింపవలెను.

ఇట్టి అభినయ కళను సుందరముగా ప్రదర్శించుట నటుని కర్తవ్యము. నటన కేవలం నటుని ఆత్మ తృప్తికొరకు కాదు. నటుని ప్రజ్ఞావిశేషాలవల్ల ఇతరులను ఆనందపరుస్తాడు ఈ కళాసేవ నిస్వార్థమైనది.

నటుడుగా రాణించవలెనంటే ఎంతో కృషి, క్రమశిక్షణ అవసరం. నటనాశక్తి ఒక వరం. అట్టి వరప్రసాదులైనవారు రంగస్థలంపై రాణిస్తారు. ఎంతోమందికి ఆనందం యిస్తారు. వారు ధన్యజీవులు.

గాత్రమున మాధుర్యము గంభీరత మొదలగు మంచి లక్షణములు సహజ సిద్ధముగా రూపొందుటకు పూర్వజన్మ సుకృత ముండవలెను. అప్రయుక్తము, అసమర్థము, సందిగ్ధము, క్లిష్టము, విరుద్ధము, క్రమభంగము, అస్పష్టము, అస్ఫుటము మొదలగు దోషములు లేని వాచికరీతి నటునకు యోగ్యతను ఒనగూర్చును. వాచికములో భావార్థ ప్రసారములు సక్రమముగా చేయగలిగిన నటుడు తనపాత్రకు న్యాయము చేకూర్చగలడు. వాచికమునకు తగినట్లు ఆంగిక సాత్వికాభినయములు ప్రదర్శింప గలిగినచో అభినయము పరిపూర్ణత చెందును.

శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు పై చెప్పిన అన్నియోగ్యతలు కలిగిన ఉత్తమ నటుడు. దీక్ష, కృషి ఈయన నటనకు పరిపూర్ణత, విజయము, తెచ్చినవి. విజయంతో ఆత్మవిశ్వాసము, మరింత కృషివల్ల ఘనవిజయ పరంపర ఆయనను వరించినది. నటుడుగా ఆయన సాధించిన విజయాలు ఆయనకు గర్వాన్ని పెంచలేదు. అంతర్గత సంస్కారంవల్ల ఆయన ఆ విజయ పరంపర, తన బాధ్యతలను పెంచినట్లు భావించి వినమ్రుడై కళాసేవ మరింత జాగ్రత్తగా సాగించాడు. తోటి

నట మిత్రులకు బాసటయై నిలిచాడు. నాటకరంగ సేవ తన బాధ్యతగా స్వీకరించి సొంతలాభం అంతా మానుకుని నడుంకట్టాడు. సక్రమ పద్ధతుల్లో నాటక ప్రదర్శనలు జరగటానికి, నాటక సమాజాలు వర్ధిల్లటానికి సమాజంలో నాటక ప్రయత్నం కలగటానికి ఆంధ్రనాటక కళాసమితి స్థాపించాడు. అందరినీ కూడగట్టుకొని బాధ్యతల్ని మాత్రం తను విడవకుండా కళాసేవ చేస్తున్నాడు. నటులను సన్మానిస్తున్నాడు. నాటక కళాపోషకుల్ని గౌరవిస్తున్నాడు. ఆంధ్రనాటక రంగాన్ని అభివృద్ధిలోకి తెస్తున్నాడు. ఇంత టి కళాసేవ చేస్తున్న శ్రీ లక్ష్మీనరసయ్య నిగర్వి, ఎప్పుడూ నిండుగా నవ్వుతూ, తన కష్టాల్ని మరిచిపోయి అందరికీ ఆనందాన్ని పంచుతున్న నిస్వార్థ కళాసేవకుడు, దేశభక్తుడు.

ఆకాశవాణిలో, చలనచిత్ర రంగంలో, జానపద ప్రదర్శనలలో, సంగీతంలో ఆయనకు మంచి ప్రవేశము, ప్రజ్ఞ వున్నాయి. నాటక ప్రయోక్తగా విమర్శకుడుగా, కార్యకర్తగా, న్యాయనిర్ణేతగా, ఆయన ప్రతిభ అద్వితీయం. మూడు దశాబ్దాల ఆధునిక ఆంధ్ర నాటకరంగ చరిత్రలో ధృవతారగా నిలిచి వుండటం ఆయన ప్రతిభకు తార్కాణం.

★★





(కీ॥శే॥ డా॥ రాజారావుగారు నిర్మించిన పుట్టిల్లు : చలన చిత్రంలో శ్రీమతి జమున, శ్రీమతి వి. సరోజిని శ్రీ కర్నాటి, డా॥ రాజారావు)



# "స్నేహశీలి శ్రీ కర్నాటి"

— స్వర్ణరాజ హనుమంతరావు ఎం. ఏ.

అది 1959 వ సంవత్సరము. ఆంధ్రనాటక కళా పరిషత్తు ఆ సంవత్సరము హైదరాబాదులో జరుగవలసివుంది. విజయవాడలో శ్రీ రేడియోమూర్తి గారు (ఎమ్. ఎస్. మూర్తిగారు) పరిషత్తుకు 'నేరము-శిక్ష' తయారుచేస్తున్నారు. అందులో ఒక చిన్నవేషానికి కావాలని, ఆ నాటకానికి నిర్వహణ బాధ్యత వహిస్తున్న పి బి. తిలక్‌గారు (P. W. D.) నన్ను అడిగారు. అయితే నేను వెళ్ళేసరికి నాటకంలో హీరోయిన్ పాత్రకు తండ్రి పాత్ర ఒకటి యింకానిర్ణయం జరుగలేదు. నాకు వయసుమళ్ళిన పాత్రలంటే యిష్టమని చెప్పిచూశాను. నిర్వాహకులు విని వూరుకున్నారు. ఆ పాత్ర త్రాగుబోతు పాత్ర. ఆ పాత్రకు శ్రీ కర్నాటి లక్ష్మి నరసయ్యగారిని వాళ్లు ఎన్నిక చేసుకున్నారు. ఆయన వచ్చి రిహార్సల్సులో పాల్గొనటం ప్రారంభించిన తరువాత వాళ్ల నిర్ణయము సరియైందే, ఆయన ఆ వేషానికి ఎంతో తగిన మనిషి అనిపించింది. అది శ్రీ లక్ష్మినరసయ్యగారితో నా తొలిపరిచయం.

ఆ తరువాత ప్రగతిలో కూడ వేషము వేయమని శ్రీ లక్ష్మి నరసయ్యగారు నన్ను కోరారు. బోయ్ వేషం వేయతగినంత చిన్న వయస్సుకాదు. నా పెర్సనాలిటీకి అది సరిపోయేది కాదు - అయినా ఆయన కోరారు కాబట్టి సరదాగా వేశాను. ఆ తరువాత బెజవాడలో నేనున్న పది సంవత్సరాలు మేము తరచుగా కలుసుకుంటూ ఉండేవాళ్లము. ఏ పైనా సాంస్కృతిక ఉత్సవాలున్నాయంటే మేము తప్పక కలుస్తూ ఉండేవాళ్లము. శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయము మా స్నేహ చలివేంద్రము.

ఆయన చాల ఆదరంగా మాట్లాడుతూ మర్యాద చెబుతూ ఉండేవారు. నా (పి. డబ్ల్యు. డి.) మిత్రులొకరు లక్ష్మినరసయ్యగారిదగ్గర జముకుల కథ నేర్చుకుందామని నన్ను కథకునిగా ఉండమని చాల బలవంత పెట్టాడు. కాని అప్పట్లో శ్రీ లక్ష్మినరసయ్యగారి ఇల్లు బెజవాడకు ఏడెనిమిది మైళ్ళు దూరంలో ఉండేది. అందుచేత ఆ సంకల్పం నెరవేరలేదు. ఆయన వేస్తున్న నాటకాలు చూడడము మాత్రమే జరిగింది.

1967 లో నా మకాము శాశ్వతంగా బందరుకు మారింది. అయితే వారి ఆంధ్ర నాటక కళాసమితి ప్రగతిని గురించి వింటూ అది క్రమంగా మహా వటవృక్షంగా విస్తరిల్లటం పత్రికల్లో గమనిస్తూ వచ్చాను. ఒకొక్కసారి ఆం. నా. క. సమితి ఏర్పాటు చేస్తున్న కార్యక్రమాలకు రెక్కలు కట్టుకొని వాలదామనిపిస్తుంది, ఒకటి రెండుసార్లు ఆపనిచేశాను. కాని ప్రతిసారి అది సాధ్యం కాదుగదా! అయినా ఆంధ్ర నాటక కళాసమితి వెనుక ఉన్న 'బ్రెయిన్' ఆయన! ఒక వుత్తమమైన ప్రేక్షక సంఘానికి ఆయన చేసిన రూపకల్పన! ఆయన చాల జాగ్రత్తగా ఆలోచించే స్వభావంకల మనిషి. సమితి కార్యక్రమాలు నిర్ణయించే విషయంలో స్నేహం కంటే కళా గురుత్వానికే ప్రాధాన్య మెక్కువ. స్నేహంవేరు, కళకీయవలసిన గౌరవంవేరు. పదిమందికి ఉన్నతమైన ప్రమాణంలో కళనుచూపించటంవేరు. సినిమాలు ఇంత విరివిగా ఎంటర్‌టైన్‌మెంటు అందిస్తున్న

ఈ రోజుల్లో ప్రత్యేకంగా నాటకకార్యక్రమాల నేర్పాటు చేస్తున్న సంస్థగా కళాసమితి చాల ఖ్యాతి నార్జించిందంటే అది ఆయన ప్రతిభకు, వ్యుత్పన్నతకు, అనుభవానికి, సమర్థతకు, నేర్పరితనానికి ఒక చక్కని నిదర్శనము.

నిబ్బరంగా సైకిలు తొక్కుకుంటూ చకచకా సాగిపోతుండే ఆయనలో ఆ కార్యవాదిత్వము స్ఫుటంగా గోచరిస్తుంది. ఒకమాట తొందరపడి చెప్పటం, ఒక వాగ్దానం అనవసరంగా చేయటం ఆయన చేయడు. చేయదలిస్తేనే చేస్తానని చెప్పటం ఆయనకున్న సదాచారం. అట్లా అని ఆయన సహాయ నిరాకిరణ చేయడు. వలసినవారికి వలసినంత-వారి అర్హతనుబట్టి- ఆ సహాయాన్ని అందజేస్తూ ఉంటారు.

నాటకం, జానపదకళలు వివిధ విషయాలమీద ఆయనవద్ద బహుగ్రంథ సంచయముంది. ఆయన సంపాదించిన గ్రంథాలు చాల అమూల్యమైనవి కళాకారునిగా ఆయన పొందిన 'కితాబులు' ఇన్ని అన్నికావు. అవి అన్ని ఒక పెద్ద గ్రంథమే.

ఒక కళాకారుడు కళాకారునిగా ఎవరైనా జీవిస్తున్నారంటే మనం సగర్వంగా శ్రీ లక్ష్మినరసయ్యగారి పేరు చెప్పవచ్చు. ఒక కళాసంస్థ కళాసంస్థగా తనకాళ్ళమీద నిలబడి ఔన్నత్యాన్ని అందుకున్నదంటే అది ఆంధ్రనాటక కళాసమితి అని చెప్పవచ్చు.

ఆయన తన్నెరిగిన వారికి చాల మంచిమిత్రుడు. మంచి సహృదయ మిత్రుడు. మంచి కార్యవాది. ఎక్కువ మాటలు మాట్లాడినట్లనిపించదు. పనులు సూటిగా అనుకున్నవి అనుకున్నట్లుగా నిర్విరామంగా కృషిచేసి చేయటం అలవాటు. కళాకారుల్లో సామాన్యంగా లోపించే నిర్వహణా సామర్థ్యం ఆయన సకుపుష్కలంగా ఉంది.

ఒక కళాకారుని మనఃప్రవృత్తి, ఒక వ్యవహారజ్ఞుని బుద్ధి వైభవము, ఒక స్నేహశీలి సహృదయత్వము, ముప్పిరిగొన్న మూర్తి ఆయన!

వారి యింటిపేరు విన్నప్పుడు ఎందుకో శ్రీనాథుని పద్య భాగము జ్ఞాపకానికొస్తుంది. వారి యింటిపేరు కర్ణాటి, ఇతరుల చెవిలో నాటేటట్లు నీటుగా చెబుతాడాయన. ఆయన కొంతకాలం విద్యార్థులకు అధ్యాపకత్వము వహించాడట. ఇప్పటికీ ఆయనలో ఆ అధ్యాపకుడు కనిపిస్తూనే ఉంటాడు. నిత్య విజ్ఞానాన్వేషి ముఖ్యంగా నాటక జానపద కళా సాహిత్యంపై, నిత్యప్రయోగశీలి. నాటకంలో, ఆయన చేసిన ప్రయోగాలు స్మరణీయమైనవి. ప్రస్తుతం నాటక కళను ఉజ్జీవింప చేయటానికి చాల తీవ్రంగా కృషి చేస్తున్నారాయన. ఆయన్ను అభినందిస్తే అది నాటకకళను గౌరవించటం అవుతుంది.

వ్యక్తిగతంగా నాకు ఆయనవలన నాటకకళ విషయంలో చాల ప్రోత్సాహముంది. నాటకరంగంలో అలాంటి అనుభవజ్ఞుడైన మిత్రుడుండటం నాకు చాల ఆనందాన్ని కలిగించే విషయం. నావలె ఆయన సహకారాన్నందుకుంటున్న జిజ్ఞాసువులు చాలమంది ఉన్నారని నాకు తెలుసు! ఆయన జీవితలక్ష్యం సక్రమంగా అందుకొనబడాలని, ఆయన ఈ రంగంలో యింకా ఉన్నత శిఖరాల నందుకోవాలని నా ఆకాంక్ష! సృష్టిలో తీయనిది స్నేహమేనోయ్ అన్నారు కవులు. ఆ తీయని బంధానికి నా అక్షరాభినందన.

★★



# 'జానపద కళాకారుడు కర్నాటి లక్ష్మీ నరసయ్య'

— అత్తిలి కృష్ణారావు

M. A., D. T. A. (Acting) D. T. A. (Play writing)
Head of the Department of Theatre Arts,
Andhra University

ప్రకృతినుండి ధ్వనీ, ధ్వనినుండి సంగీతమూ వింటున్నాం. అందుకే ప్రకృతి అంతటా సంగీతమున్న దన్నాడు బైరన్ మహాకవి. ప్రకృతి ఒడిలోనే పెరుగుతూ, ఛందోరీతులనుగానీ, వాని పోకడలనుగానీ యేవీ ఎరుగని జానపద రచయితల సహజ కవితాగానామృత బిందువులే జానపద గేయాలంటారు. అధమం పదకొండవ శతాబ్దంనుంచి నేటివరకు ఎందరు తెలుగువారు తెలుగునాటపుట్టి కవితాత్మను జీర్ణించుకొని, కవితాహృదయాలు స్పందించగా తెలుగుల వాతావరణాన్ని, కవితారాగ వాహినులతో ముంచెత్తివుంటారు?

సంస్కృతపు సావిళ్ళలో కొలువుతీరిన పండిత ప్రకాండులు వారికేసి చూడక, వారు పాడింది సారస్వతమేమోనన్నైనా క్రీగంట చూడక కనీసం విననైనా వినకుండా వున్నప్పుడు, జాతి జీవననాడిని మీటి మేల్కొలిపి జానపదాలద్వారా, బుర్రకథల ద్వారా జాతీయ జీవిత రేఖలమీద వెలుగును వెదజల్లినవాడూ, తెలుగువారి జాతీయ జనపథికుడూ శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్య. స్వతంత్రదేశంలో స్వాతంత్ర్యమంటే అభిమానమూ దాన్ని రక్షించుకోవలసిన బాధ్యతా ప్రజల జీవనాళాల్లో ప్రవహింప జేయడమే లక్ష్యంగా పెట్టుకుని అనేక జానపద కళారూపాలైన వీధిభాగవతాల్నీ, డప్పుల నృత్యాన్నీ, జముకుల కథల్నీ సమాజిక నవ చైతన్యానికి ప్రయోగించిన జానపద ప్రయోక్త శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య!

జానపద వాఙ్మయమే ఏ జాతియొక్క నిజ సంస్కృతినైనా, జీవిత పరమావధుల్నీ, లక్ష్యాలనూ వారనుభవించిన సుఖదుఃఖాలనూ వ్యక్తం చేయగల ఏకైక సాధనం.

కానీ —

ఆ పాటలన్నీ ఏమయ్యాయి ?
ఆ ఆటలన్నీ ఏవిప్పుడు ?
ఆ సుద్దులన్నీ ఏమయినాయ్ ?
ఆ సూక్తులన్నీ ఎక్కడున్నాయి ?
ఆ గాథలన్నీ ఏవి ?
ఆ కథలన్నీ ఏమయి పోయేయి ?

అని ఎవరైనా ప్రశ్నిస్తే
సమాధానం
శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు చెప్పగలరు !
అందుకు నిదర్శనం
విజయవాడలో పేరెన్నికగన్న సాంస్కృతిక వేదిక
"ఆంధ్రనాటక కళాసమితి"

★★

# 'కళాజీవి'
# శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య

— వింజమూరి శివరామారావు

తెలుగునాటి పల్లెటూరిలో—పేరందిన మంచి రైతు కుటుంబంలో—పుట్టి పెరిగిన శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్య పదిమందిచేతా ఈనాడు మన్నన లందు తూన్న కళాజీవి.

సంగీతమూ, సాహిత్యమూ, నాట్యమూ, నటనా శిల్పమూ, చిత్రలేఖనమూ— ఇవి గొప్ప కళలు. వాటి నుపాసించేవారు ధన్యులు; మాన్యులు. శ్రీ కర్ణాటి ధన్యజీవి.

నాజర్ దళంవారి బుర్రకథ వినడానికి వెళ్లాను. ప్రక్కన పంతగా నిలబడిన శ్రీ కర్ణాటి లక్ష్మీ నరసయ్యను చూశాను. ఈయ నెవరో అసాధ్యుడు లాగున్నాడే — అనుకున్నాను. కథ పూర్తయాక, నేననుకున్నది నిజమే అనిపించింది.

లక్ష్మీనరసయ్యగారిలో చైతన్యం ఉంది. అంతే కాదు; మనలో చైతన్యాన్ని కదిలించే శక్తి ఉంది. ఉత్తమ నటుని కది లక్షణం. స్వభావసిద్ధమైన కళను స్వయంకృషితో వికసింపజేసుకున్న ప్రతిభావంతుడు శ్రీ కర్నాటి.

రంగస్థలం మీద— సాంఘిక నాటికా నాటకాలలో ప్రముఖ పాత్రలను సమర్థంగా వీరు నిర్వహిస్తూండగా చూశాను. యువ నటులలో. ఈయనది ప్రత్యేకస్థానం— అని గ్రహించాను.

అది యిరవై యైదేళ్ళ క్రితం మాట!

రేడియో ప్రసారాలలో వీ రెన్నెన్నో సారులు పాల్గొన్నారు. వీరి గొంతులో వింతయైన యాస—కొత్తదైన వాడుపు— అవీ వీరికి వన్నెతెచ్చాయి. నాటిక లలో సంభాషణలు చెప్పడంలో ఒక చమత్కారం చూపించగల కళాకారు డీయన. మంచి పేరు తెచ్చు కున్నారు.

శ్రీ కర్నాటిలో నాకు నచ్చిన ప్రత్యేక గుణం ఒక టుంది. అది నిజాయితీ—Sincerity. తాను వహించే భూమికను అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తారు. తెలి సిన వారి నడిగి తెలుసుకునేందుకు జంకరు. పాత్రకు న్యాయం జరగడమే వీరి లక్ష్యం. అది ఉత్తమ కళా కారుని లక్షణం. లక్ష్మీ నరసయ్యగారు ఉత్తమ కళా కారుడనడానికి సందేహం లేదు.

మాటమంచి, నడవడిలో నెమ్మది, తలపుకో దిగ జారకపోవడం— ఇవి వీరిని పైకెత్తుతున్నాయని నా నమ్మకం.

బాల్యం నుంచీ దేశభక్తి పూరితుడై, మహాత్ముని సత్యాగ్రహ సమరంలో యోధుడై, దేశ స్వాతంత్ర్యా నికి యథాశక్తి సహకరించిన ధీరుడు శ్రీ కర్నాటి. ఉన్నత విద్యాభ్యాసం లేకపోయినా, ఉత్తమ సంస్కారం పొందినవాడు. సత్సహవాసంవల్ల సాహిత్యంలో

పరిచయం సంపాదించినాడు. వివేకానికి వినయం తోడుపడి, పదిమందిచేత మెప్పులందిస్తూందీయనకు.

ఆంధ్రదేశంలోని చాలామంది ప్రముఖులకు సుపరిచితులు శ్రీ లక్ష్మీనరసయ్య. ప్రతి సాంస్కృతికోద్యమంలోనూ ఈయన ప్రవేసించి, నిరపేక్షతో సేవచేస్తారు. అందరికీ ఆదరణీయుడై, అనురాగాభిమాన పాత్రుడై సంచరిస్తారు.

లక్ష్మీనరసయ్యగారి జీవితం నాటకకళకు అంకితమయింది. నటుడుగా ఎంత మంచిపేరు తెచ్చుకున్నారో, నాటక ప్రయోక్తగా అంత గొప్పతనం గడించుకున్నారు. నిద్రాహారాలుకూడా మాని, నాటక కళాభివృద్ధికోసం అహోరాత్రాలు తపించే దీక్ష కర్నాటివారి ప్రత్యేకత. అదే వారి ప్రాణం.

అనేక సంవత్సరాలనుంచి, విజయవాడలోని ఆంధ్ర నాటక కళాసమితికి ప్రధాన కార్యదర్శిగా, దానిని ఆదర్శప్రాయంగా నిర్వహిస్తూ, అభివృద్ధినందే పద్ధతిలో నిర్విరామంగా కృషిచేస్తున్నారీయన. కొత్త నటులను తయారు చేయడం, కొత్త నాటకాలను తయారు చేయించడం – ఇది వీరి నిత్యకృత్యం. ఎదురీతకు జంకకుండా, తొందరపాటు లేకుండా, తాను తలపెట్టినపని కొనసాగించుకునే కార్యసాధకుడు.

కళారాధకులను సన్మానిస్తూ, కళా సరస్వతిని ఆరాధిస్తూ, జీవితమే ఒక కళగా తీర్చిదిద్దుకుంటూన్న శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు ఆంధ్రులకు సన్మానపాత్రుడు ఈ సత్కళాజీవి

శుభం భూయాత్ !

★★

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★



(డా॥ రాజారావుగారి నాయకత్వాన ఢిల్లీలో సాంస్కృతిక ప్రదర్శనలు ఇవ్వడానికి వెళ్ళిన కళాకారులు.

కూర్చున్నవారిలో 7 వ వారు కీ॥ శే॥ డా॥ రాజారావుగారు, 10వ వారు శ్రీ కర్నాటి.)

# Karnati Lakshmi Narasaiah

## From my dateless Diary

—Chatla Sreeramulu, B.COM., B.D.L. (LONDON)
Stage Director, Andhra University, Waltair.

IT was early fifties- Velidandla Hanumantharaya Grandhalayam was the venue- the night of the premiere of 'KAALA RATRI' written by Prakhya Sreerama Murthy and directed by Late.K. Venkateswara Rao. A great movie star also was to take birth with this production. I was playing a supporting role in the play. Earlier I had received a pat in the back by late Dr. Raja Rao after my "Dean Martin - Jerry Lewis" Style performance in combination with Prasad in Dr. Gangadhara Rao's "PELLI CHOOPULU" and was offered a role in "KAALA RATRI" by its Director. It was my first ever opportunity to work with them. As soon as the performance was over, Karnati Lakshsminarasaiah, one of the very few actors I adore and who was my matinee idol walked to me straight ignoring the play wright, the star- Director and other participants like Nirmala and Ramana Murthy- shook hands with me- embarrassed me by introducing himself (embarrassment for a I dared not approaching him after seeing his star performances lest I might be thrown a slithering glance by such a stalwart of an actor) and said that I did a very clean job as a supporting actor. I stared at him disbelievingly for I did not realise the process of my moulding myself to suit the tunes of the character was so meticulores and graphic. Discerning the disbelief and even before I could utter a word, Lakshminarasaiah went on explaining to me at length as to what I did to step into the shoes of the character and proved to me beyond reasonable doubt his straight jacket quality of liking the best and disliking the medicore. Perhaps this incident was the root cause for me to continue in theatre as a devoted theatre man for over two decades and accept the Commission as Stage Director of Andhra University shunning my job on the Railways.

**CUT TO FLASH BACK :**

Let me go back a decade.

There were three main sources through which the present momentum in the Telugu Theatre emanated. While the experimental theatre wing of Andhra University under the headship of K. V. Gopalaswamy built theatreawareness among student community and Andhra Nataka Kala Parishath under the President of M. R. Appa Rao had started giving the needed fillip to the amateur talent in the state- it was Praja Natya Mandali

with giants like late Dr. Raja Rao behind it, catered to the needs of the masses through its performing arts. The performance of Lakshmi Narasaiah as MANGALI RAMUDU in 'MAA BHUMI' three and a half decades ago had left an everlasting impression on me as a boy. Eversince, he was my muse and my inspiration as an artiste. In those good old days we had no teachers to teach us drama and Theatre. Nor Directors to mould us into actors. It was out and out actor-oriented Theatre. As such it had become indispensable to learn things by watching other eminent actors' performances. Those who studied the spirit with which the great actors approached their roles lasted long and those who had tried to ape them became flattened ballons in no time. It was my keen interest to know as to how actors like Lakshminarasaiah studied their roles ofcourse without personally approaching them. Perhaps it was due to the fact that I was quite shy and unassuming in those days.

No one knew that Karnati (I am sure I will be forgiven for the liberties I take with him– not only by him but also by all his friends, admirers and disciples for what I do) was a teacher teaching Urdu in Reddygudem of Khammam District before turning a full time artiste. He had his education in Khammam High School. Had not Late Dr. Raja Rao seen Karnati in the Play 'MUNDADUGU' playing the HERO Narayana Rao's role in Dendukuru Village of Madhira Taluk and appreciated his performance and drafted him into Praja Natya Mandali, we might have lost a war in the theatre. The war fighting to build audience for the Telugu Theatre. Karnati's performance as MANGALI RAMUDU in 'MAA BHUMI' made that great stalwart, Late Koduru Achaiah Chowdary give up his role in favour of Karnati in the play 'BRATUKU TERUVU'.

Karnati is a MASTER OF ALL THEATRE FORMS and JACK OF NONE. He was equally at ease in any form of theatre. His proficiency in the folk forms is unparallelled in the theatre history of recent times. His Versatality in the folk forms GOLLA SUDDULU, CHENCHULU, JAMUKULA KATHA, BURRA KATHA, VEEDHI BHAGAVATHAM, BHAJANALU, KOLAATAALU FAKEERU and many more will be dead and gone if an organisation like Sangeeta Nataka Akademi does not come forward to record and preserve them for the benefit of the posterity.

Karnati had learnt BURRA KATHA from Machineni Venkateswara Rao– a one time greact actor– now turned to be a big name in the Insurance business and JAMUKULA KATHA from Mikkilineni Radhakrishna Murthy, the one and only historian of the Telugu Theatre Personal. Both Machineni and Mikkilineni were very proud when their disciple turned to be greater than his masters in the arts.

The banning of Praja Natya Mandali led to the launching of a theatre unit– Andhra Art Theatre which was to become the future hope of theatre movement. It was founded by Krithiventi Kutumba Rao as the cultural wing of Velidandla Hanumantharaya Grandhalayam of Vijayawada. The pillars of this

theatre unit were Karnati, Machineni, Mikkilineni, M. V. Satyanarayana, Y. V. Raju and Raghavapurapu Appa Rao as far as I knew. This repertory gave a minimum of 3 shows a month under this banner and the productions included ALLI MUTHA, JEEVITHA PADHAM, JEEHA GAADU, NEPADHYAM and NETI NATUDU.

Then came Atreya's EENAADU which took the Telugu Theatre going audience by a storm. B. Gopalam sprang up as a great music Director with this play. Pulugundala Ramakrishnayya's TUFAAN, a playlet in which Karnati participated as the lead character RAGHAVAREDDY with C. Nagabhushanam and late Chadalavada Kutumba Rao as his supporting cast was performed more than a couple of hundred times all over Andhra. This shows what popularity Karnati brought to the theatre movement. In later years Late K. Venkateswara Rao tookup this playlet inspired by Karnati's performance and made history in his own inimitable style.

Then came another noteworthy turn in Karnati's career as Burra Katha artiste. His collaboration with Nazar and more than a thousand performances brought this folk form nation wide reputation. Theatre luminaries like Balwanth Gargi and Adya Rangacharya counting on Burrakatha as Andhra's most revered traditional folk form was due to this combination perhaps. Karnati was a Burrakatha artiste and also Jamukula Katha artiste in combination with Mikkilineni and Umamaheswara Rao.

His performance in EVARU DROHI and extempore play wherein he answers questions from audience was to be the trend setter for the art of improvisation and forerunner for the various Natyavadhanams now conducted throughout the length and breadth of the State. His performance as the MAD MAN in Atreya's PRAGATHI was in par with that of any westren actor of that era, if not superior. His performance in Anisetty's GALIMEDALU and MAAVURU was seen by the- then-going audience and artistes time and again to have a better in sight into the actor in Karnati. While C. Nagabhushanam was "Siva Sankaram" in MAAVURU, Karnati as "MAHANKALI" gave a stupendous performance.

Many people do not know that late K. Venkateswara Rao had his lessons in the art of make up from Karnati. I very well remember K. Venkateswara Rao confiding with his close associates like me about his getting lessons from Karnati not only in makeup but also in acting. In fact Venkateswara Rao treated him as Guru. Venkateswara Rao was influenced by Karnati to a very great extent in his performance of TOOFAN and TEA CAPPULO TOOFAN.

Karnati's performance in AASAMI, an Andhra Art Theatre's presentation in Andhra Nataka Kala Parishat was responsible for the sweet nostalgic memories of those days of glory of Praja Natya Mandali. He acted in it with Machineni, Nazar, Ramakoti and Kopparapu Sarojini. The play was in production under the supervision of late Kopparapu Subba Rao and bagged the Best Production Award at Masulipatnam.

When Andhra Art Theatre went into oblivion and Andhra Praja

Natya Mandali came into being Karnati turned a director for Gogol's "Government Inspector" adopted into Telugu by Rentala Gopalakrishna as ANTHA PEDDALE. Vallam Narasimha Rao played hero in this drama. This play was performad about 60 times commercially. Karnati was also Director for the plays PRESIDENT PATTAYYA and CHAIRMAN each of which were staged over 50 times. He was the leading actor - manager Giduthuri Suryam's MAANAVUDU CHIRANJEEVI which was staged over 300 times. His participation in Radio plays crossed the century mark long long ago.

To name a few, his other colleagues in the theatre were stalwarts like late K. V. S. Sarma and late Chadalavada Kutumba Rao.

His contribution to the cause of the theatre was endless. Art is demanding when it seeks a controlled expression of a response to life and drama is peculiar in finding its expression through the ageney of living human beings and their context. Drama makes imparallaled demands for self-knowledge and self-control in those who try to practise it and Karnati is perhaps one of the few who go by these norms. In a world of mad madrush where an artiste is not only egotistic and temperamental but also flippant in talk, peevish in behaviour and full of inhibitions, Karoati is far above and full of inhibitions, Karnati is far above and beyond such artistes. He doesn't have false prestige hanging around him. He is on the constant search fot new venues in the field of dance, drama and music.

**CUT TO FLASH FORWARD :**

Today Indian theatre is fighting with the same problem which America faced two decades ago. The problem-BUILDING AUDIENCE FOR THE AMATEUR THEATRE To save Telugu Theatre from this rut, Karnati became 11 years ago the Managiug Chief Secretary of Andhra Nataka Kala Samithi, Vijayawada with the co-operation and assistance of his close friends, well-wishers and members of the Samithi. He is also the honorary adviser for the drama section of Vijayawada Social Club and Literary Society. It will be a white lie if any one says that a particular actor, or theatre unit is not sponsored by Andhra Nataka Kala Samithl. Karnati sponsored a drama a month under the banner of Andhra Nataka Kala Samithi. A troupe comprise of about 10 artistes on an average. A show lasts 2 to 3 hours on an average. The Samithi has a thousand-strong paying membership. 10 actors giving 2 to 3 hours performance a month to 1000 audience for 11 years is worked out to 39,60,000 man hours involvement in pure theatre owing to Karnrti. This is no mean accomplishment. If one says so, it is nothing but self deceit.

Karnati does all this to our theatre anticipating no rhetoric and monument in return. In spite ot it we must think of the most fitting tribute for him. What could it be to honour a one man institution that is KARNATI LAKSHMI NARASAIAH ?

Long Live Karnati Lakshmi Narasaiah and Iong live his self-less sacrifice for the cause of the Telugu Theatre.

★★

# గిరిజనుల నర్తనములు

—'భరత కళాప్రపూర్ణ' నటరాజ రామకృష్ణ

ఆంధ్రదేశపు అరణ్యములలో నివసించు ఆటవిక తెగలకు చెందినవారు ఎన్నో ప్రత్యేక నృత్యములు చేయుచురు. ఇందు కొన్ని మతసంబంధమైనవి, కొన్ని కేవలం వినోదంకొరకు చేయునట్టివి. గదబలు, సవరలు, చెంచులు, కోయలు, ఆదివాసులు, గోండులు, మాతురీలు, లంబాడీలు మొదలైన వారందరూ వారి వారి తెగలయొక్క ఆచార వ్యవహారములను అనుసరించి వివిధ నర్తనములను రూపొందించుకున్నారు. ఈ నర్తనములను జాగ్రత్తగాపరిశీలించి అందలి సంగీతమును, రాగ, తాళ పద్ధతులను, నృత్యగతులను పరిశోధిస్తే ఆయా తెగలయొక్క ప్రత్యేకతలను గూర్చి తెలిసికొనే అవకాశముంటుంది. మాతురీలు హోళి పండుగఅప్పుడు విశేషముగా ఉత్సవములు చేసి నృత్యగానములతో కాలము గడుపుదురు. గోండులు, కోయ మొదలైనవారు వర్షఋతువు ఆరంభములో "ధరణి దేవత" ను పూజించి నృత్యమాడుదురు. చెంచులకోవకు చెందిన చెంచువారు నేటికీ చెంచు లక్ష్మి నాటకము ప్రత్యేకముగా నాడుదురు. ఇట్లే ప్రతి తెగవారు ఒక ప్రత్యేక పండుగకు ప్రత్యేక నృత్యములు సల్పుట కలదు. ఈ పండుగలు, వీరు చేసే నృత్యములు భారతదేశములోని యితర ప్రాంతములందలి గిరిజనులు కళారూపములతో పోల్చిచూసిన భారతదేశములో ప్రాచీన కాలములో కళాసంస్కృతి ఏ విధముగా ఏక రూపముగా నున్నది. అటు పై ప్రాంతీయ ప్రభావముతో నేటి నవనాగరిక ప్రపంచములో, ఎట్లు విభిన్న రూపముల ప్రచారములో నున్నది తెలిసికొనగలము.

తెలంగాణా, రాయలసీమ, కోస్తా ప్రాంతమందు అభివృద్ధి జెందిన ప్రత్యేక నృత్య కళారూపములు.

## తెలంగాణా ప్రాంతం

**యక్షగానం :-** అతి ప్రాచీనమైన యక్షగాన కళారూపము నేటికీ ప్రాచీన పద్ధతిలో, ఒక్క తెలంగాణా ప్రాంతమునందే ప్రదర్శింప బడుచున్నది. సామాన్య ప్రజల అభిమాన కళగా, పల్లె ప్రజలందు నేటికీ మన పురాణేతిహాసముల విశిష్టతను ప్రచారము చేయుచున్నది. కాని ప్రస్తుతకాలంలో ఈ యక్షగాన సంప్రదాయమును జక్కులవారు ఆరాధించుటలేదు. దాసరి భాగవతుల, బహురూపులు, భరతులు, సైంధవులు మొదలైన తెగలవారు ప్రదర్శించుచున్నారు.

వివిధ ఛందస్సులందు కూర్చబడిన కవితను గానము చేస్తూ అందుకు తగురీతిలో హావభావముల ప్రదర్శించుతూ, సులభశైలిలో నృత్యమాడుచారు. వీరి ఆభరణములు ప్రాచీన పద్ధతులలో నున్నవి. రాజు పాత్రలు ధరించే కిరీటములు కాకతీయ రాజుల కిరీటములను పోలియుండును. వీరు పాత్రల యొక్క తత్వమును అనుసరించి ముఖమునకు రంగురంగుల కోటావేయుదురు. వీరిది లయ ప్రాధాన్యమైన ఆటగతి ననుసరించి అడుగులు వేయుదురు.

## ప్రాచీన యక్షగానములు

రుద్రకవి, సుగ్రీవ విజయము, అహోబలమంత్రి గరుడాచలమును పోలిన రచనలను వీరు నర్తన

మాడుదురు. వీరి యక్షగానములకు తంజావూరు తదితర ప్రాంతములందలి యక్షగానములని పిలువబడే రచనలకు చాలా తేడా వున్నది. అవి నృత్య నాటక పద్ధతిలో తీర్చి దిద్ద బడినట్టివి. వీరు ప్రదర్శించు నట్టివి కళాగానశైలిలో ఉండును.

తెనుగుదేశంలోని యక్షగానములకు, కర్ణాటక ప్రాంతంలోని పద్ధతికి చాలా తేడా ఉన్నది. కన్నడ ప్రాంతంలోని కళాకారులు నృత్యసమయములోపాడరు. భాగవతుడు వెనుకనుండి పాడిన పాటకు నృత్యము చేయుదురు. ఆ పాటల అర్థాన్ని వాచికముద్వారా వ్యక్తము చేయుదురు. ప్రతి నర్తకుడు అప్పటి కప్పుడు తన పాత్రకు సంబంధించిన వాచికమును స్వయంగా కూర్చి మాటాడును. తెనుగు ప్రాంత మందలి యక్షగానములో ప్రతి నర్తకుడు గానము ద్వారా, తన పాత్రను వ్యక్తము చేయును. ఇందు సంధి వచనములను మాత్రము సూత్రధారుడు పలుకును.

ఆటయందు, ఆహార్యమందు - రెండు పద్ధతుల యందూ చాలా భేదమున్నది.

## గంటె భాగవతులు

వీరి ప్రదర్శనము ఒక అపూర్వ కళారూపము. ఇట్టిది భారతదేశమందు మరెచ్చటను లేదనియే చెప్ప వచ్చును. సాధారణంగా భాగవతములు, వీధి నాట కములు, యక్షగానములు ప్రాచీన కాలంలో కాగడాల వెలుగునందు, అటుపై గ్యాసులైట్ల వెలుగులో వేయుట ఆచారము, ఈ నర్తనారీతియందు ప్రతి నర్తకుడు చేతిలో ఒక గంటె పట్టుకొని ఉండును. అందు నూనె బోసి, వత్తివేయుదురు. నర్తన సమయమందు దీపము వెలిగింతురు. ప్రతి నర్తకుడు తన పాత్రను అభిన యించవలసి వచ్చినప్పుడు ఆ దీపము తన ముఖము వద్దకు తెచ్చి భావ ప్రకటన చేయును. ఆ దీపము కాంతిలో ఆ పాత్ర ముఖము వింత కాంతులతో గోచ రించును. ప్రతి నర్తకుడు తన పాత్రను అభిన యించ వలసినప్పుడు ముందుకువచ్చి ఆ జ్యోతి కాంతిలో హావభావములు ప్రకటించుటకు నేటి కాలంలో సినిమాలందలి "క్లోజప్"ల పద్ధతిలో ఉండును. గంటెలను చేతపట్టుకొని నర్తనమాడుదురు. కావున వీరిని గంటెభాగవతులందురు. ఒక చేతిలో దీప ముండును గనుక వారి నర్తనము ఒక చేతికి మాత్రమే పరిమితమై ఉండును. కనుక వీరి శైలిలో నృత్యము ఎక్కువగా ఉండదు. భావ ప్రకటన, అందుకు తగిన లయ, తాళ విన్యాసములు ప్రాముఖ్యము గలిగి ఉంటాయి.

## చిరుతల రామాయణము లేదా చిరుతల భాగవతము

చిరుతలతో భజనచేయుట, ఆంధ్రదేశ మంతటా పల్లె ప్రజలకు ఆచారమున్నది. చిరుతల భజన, భాగ వతము రెండింటినీ చేర్చి ఒక విశిష్ట కళారూపముగా ఈ ప్రాంత ప్రజలు రూపొందించారు. ఈ నర్తన రీతిలో చిరుతల భజన సంగీత శైలి, భాగవత భాణి రెండూ మిళితమై యున్నందున-వీరి నర్తనరీతి ఈ రెండు పద్ధతులను అనుసరించి యుండును. నర్తకులు రామాయణములోని కథలను నర్తన మాడుదురు. వివిధ పాత్రల అలంకారములను ధరించి, గుండ్రంగా ఆడుదురు మధ్యలో మృదంగం, హార్మోనియం, వాయించేవారు - కూర్చుని యుందురు. ప్రతి పాత్ర తాము నర్తించవలసిన ఘట్టము రాగానే వలయం మధ్యకు బోయి పాడుతూ, తమ పాత్రను నర్తన మాడుదురు. అది ముగియగానే అందరూ కలసి వల యముగా తిరుగుతూ చిరుతలు వాయించుతూ నాట్య మాడుదురు. వీరికి ఎక్కువగా నృత్యకళలో ప్రవే శము లేనందున, ఇది కేవలం జానపద కళారీతిగా కన్పించిననూ, దీనియందు కొన్ని శాస్త్రీయరీతుల చొప్పించి, ఆట, పాట, మాట, ఆహార్యము సంస్క రించి నర్తకులకు ప్రత్యేక శిక్షణనిచ్చి ప్రదర్శింప చేసిన ఇదొక అపూర్వ కళాఖండముగా రూపొందే అవకాశమున్నది.

పై మూడు నృత్యనాటక రీతులూ తెలంగాణాకు ప్రత్యేకమైనట్టివి.

విప్ర వినోదులు, కాటికాపరులు, సాధనా శూరులు- అను మూడు తెగలవారు ఇంద్రజాల మహేంద్రజాల

విద్యల నెరిగినవారు. వీరు ప్రాచీన కాలమునుండే ఈ విద్యలందు ప్రసిద్ధులు. ఈ తెగలవారు తెలంగాణా ప్రాంతమందు తప్ప మరెచ్చటనూ కన్పించరు.

చిందుమాదిగలు వీధి నాటకాలను ప్రదర్శించే ప్రత్యేక తెగవారు. వీరు పగటిపూట నాటకముల నాడుదురు.

ఉగ్గు గొల్లలు, బవనీలు అను తెగలవారు ప్రత్యేకంగా ఎల్లమ్మదేవత కథను నృత్యగానములద్వారా ప్రదర్శింతురు.

జోగు వారను నర్తకులు పంచముల తెగకు చెందిన వారున్నారు. నృత్యమాడుట వీరి ముఖ్య వృత్తి. ఈ తెగలందు శవమును స్మశానవాటికకు గొనిపోవునప్పుడు, ఒక ప్రత్యేక పద్ధతిలో నృత్యము చేస్తూ తీసికొనిపోవుదురు. ఆ నృత్యమును వీరు చేయుదురు. వీరందరూ ప్రత్యేకంగా తెలంగాణాకు జెందినవారే.

★★

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★



ఎవరు ద్రోహి ప్రదర్శన సందర్భంగా
ప్రేమమూర్తి డా॥ పి. రామచంద్రారెడ్డిగారితో కర్నాటి.
రెండవ వరుసలో కుడినుంచి రెండవవారు కర్నాటి
మూడవవారు రామచంద్రారెడ్డి,
నాల్గవవారు శ్రీమతి రామచంద్రారెడ్డి.

# 'కళా తపస్వి'

# మా లక్ష్మీనరసయ్య అన్నయ్య

— నండూరి సుబ్బారావు
(ఆకాశవాణి)

ఈవాళా నిన్నా...గత మూడు దశాబ్దాల పైగా, నాటకరంగానికి, నటుడుగా, దర్శకుడుగా, సమాజ నిర్వాహకుడిగా అంకితమయిపోయిన వ్యక్తి... ఎటు వంటివారికయినా తానుచేసేపనిమీద కొన్నాళ్ళకు కాక పోయినా మరికొన్నాళ్ళకు విసుగు కలగటం కద్దు... మరి మా లక్ష్మీ నరసయ్యగారు అలాకాదే! ఏళ్లు గడ చినకొద్దీ మరింత పట్టుదలతో నాటక రంగానికి సేవ చేయడం ఉన్నదే అది సామాన్య విషయంకాదు. మరి ఏ జన్మ అనుబంధమో, ఏ నటరాజు చల్లని చూపో, రాత్రి లేదు, పగలు లేదు, వానలేదు, వరదలేదు. ఆఖ రికి పిడుగులు పడుతున్నా నాటకం ఆడటమో, ఆడిం చటమో చేస్తున్నాడంటే అది తపస్సులో భాగం కాక పోతే మరేమిటి... లక్ష్మీ నరసయ్యగారిలో పట్టుదల దీక్ష, మాటతప్పని నిజాయతీ, సహనటుడిని గౌరవిం చడం, అన్నీటికీ మించి విశాల హృదయం ఇవన్నీ ఉన్నాయి కాబట్టే ఇన్ని ఏళ్లుగా అజాత శత్రువుగా అందరిచేతా గౌరవింపబడుతూ, ఒక ఉత్తమ సంస్కా రిగా, ఉత్తమ నటుడిగా పేరు సంపాదించుకో గలి గాడు.

ఉత్తమ నటుడికి కావలసిన హంగులు స్ఫుర ద్రూపం గంభీరగళం, చక్కటి హావభావ ప్రకటన ఇవన్నీ మూడు మూర్తులా మూర్తీభవించి ఉన్నాయి. లక్ష్మీనరసయ్యగారిలో ... జమీందారుగా, రైతుగా, సంపన్న కుటుంబీకుడుగా, సుఖదుఃఖాల మధ్య నలిజ పోయే ఒక కుటుంబపెద్దగా, దొంగసన్యాసిగా, రాగి కీయ నాయకుడిగా ఒకటేమిటి ఏ పాత్రలోనైనా జీవించి నటించగల నేర్పరి. లక్ష్మీనరసయ్యగారి కొన్నికొన్ని పాత్రలు చూచి శహబాస్ అనవలసిందే గాని వర్ణించి చెప్పటం చాలాకష్టం ... ముఖ్యంగా ఛైర్‌మన్ నాటకంలో యోగీశ్వరుడిగా నటించడంలో అతనికతనేసాటి...

లక్ష్మీ నరసయ్యగారిది విజయవాడ దగ్గరలోని ఇక్కంపూడి...నాగలి బుజానవేసుకుని వ్యవసాయం చేసే రైతుబిడ్డ. అవసరమైతే పదిమంది పెట్టుగా ఒక్కడూ వ్యవసాయం చేయించగలవాడు. పగలల్లా పొలంలో పనిచేసి, రాత్రుళ్ళు విజయవాడ వచ్చి, రిహా ర్సలు చేసి, నాటకంవేసి, తెల్లారుజామున మళ్ళీ ఇక్కం పూడి వెళ్ళి వ్యవసాయానికి అందుకున్న రోజులు అనే కం. నాటకకళపట్ల అతని కున్న అభిమానం అటు వంటిది.

ఈనాడు సినీరంగంలో పేరు ప్రఖ్యాతులు సంపా దించుకున్న మిక్కిలినేని, చదలవాడ, రామకోటి, నల్లరామ్మూర్తి, స్వర్గీయ కె. వి. ఎస్. శర్మ, పెరుమాళ్ళు వీళ్ళంతా సినీరంగానికి వెళ్ళక పూర్వం వెళ్ళినతరువాతకూడా నాటకరంగంలో లక్ష్మీనరసయ్య గారితో కలసి ప్రదర్శనలిచ్చినవారే. అంటే అంతా సహనటులే నన్నమాట.

లక్ష్మీనరసయ్యగారు గొప్ప బుర్రకథ కళాకారు డంటే ఇప్పుడిప్పుడే వెలుగులోకి వచ్చే యువ కళా

కారులు ఆశ్చర్యపోవచ్చు ... రామకోటి మొదలయిన వారితో కలిసి కొన్ని రాత్రులకు రాత్రులు బుర్రకథ ప్రదర్శించిన రోజులు అనేకం. తోటి బుర్రకథ ఆర్టిస్టులు సినీరంగంలోకి వెళ్ళడంతో తర్వాత తర్వాత బుర్రకథ ప్రదర్శనలు ఆపివేయడం జరిగింది.

పుట్టిల్లు రాజారావుగారికి (డాక్టరు గరికపాటి రాజా రావుగారు) లక్ష్మీనరసయ్యగారంటే బాగా గౌరవం... ఆ గౌరవంతోనే వీరిని తన మొట్టమొదటి చిత్రం పుట్టిల్లులో ఒక పాత్ర యిచ్చి గౌరవించారు.

లక్ష్మీనరసయ్యగారు కేవలం రంగస్థల నటుడు, బుర్రకథ ఆర్టిస్టు, సినీనటుడూ మాత్రమేకాదు... పేరు పొందిన రేడియో కళాకారుడు...ఆకాశవాణి – విజయ వాడ కేంద్రంనుంచి వెలువడే నాటకాలలో విభిన్నమైన క్లిష్టమయిన పాత్రలు నటించి రేడియో కళాకారుడుగా కూడా దేశం మొత్తంమీద పేరు ప్రఖ్యాతులు సంపా దించు కున్నారు.

లక్ష్మీనరసయ్యగారితో నా తొలిపరిచయం పరో క్షంగా రేడియో నాటికద్వారానే. అప్పటికి రేడియోతో నాకు ఎక్కడ అనుబంధం లేదు...అప్పుడప్పుడూ మాత్రం మావూరినుంచి వచ్చి రేడియో నాటికలలో నటించేవాడిని...ఒకసారి రేడియోలో "తుఫాను" నాట కం వినడం తటస్థించింది. అందులో లక్ష్మీనరసయ్య గారు నిర్వహించిన రాఘవరెడ్డిపాత్ర నన్నెంతో ఆకట్టు కుంది. ఆనాటి నుంచే లక్ష్మీనరసయ్యగారు నా అభి మాన నటుడైనారు. ఆ తర్వాత ప్రత్యక్షంగా వారి దర్శకత్వంలో ప్రదర్శించిన "ఛైర్మన్" నాటకంలో నేనూ నటించినప్పుడు వారితో బాగా సన్నిహితత్వం ఏర్పడింది.

లక్ష్మీనరసయ్యగారు నిగర్వి. ఇంకా ఇంకా నట నలో నేర్చుకోవలసింది చాలా వుంది. దానిని కూడా స్వంతంచేసుకుందామన్న తపన... ఆయన మహా నటుడయినా మరో సహనటుడు (అతనెంత చిన్నవా డయినా సరే) డైలాగు డెలివరీలోగాని. నటించడంలో గాని, 'అలాకాకుండా ఇలా అయితే బాగుంటుందేమో' నని సూచిస్తే వాటిని నిర్లక్ష్యం చేయకుండా ఆలో చించి ఆచరణయోగ్యంగా ఉంటే తప్పక ఆచరించే స్వభావం కలవారు... "ఏదేమిటి? నాకు చెప్పేద మేమిటి" అనే స్వభావం ఆయనకు లేదు. ఇప్పటికీ రేడియోలో ఒక తరహా హుందాగల పాత్రలువస్తే అవి లక్ష్మీనరసయ్యగారు చేపట్టవలసిందే.

మనిషి అనవసర కామెంట్సు చేయడు. తనకు తోచినదేమయినా ఉంటే తను చెప్పినా అర్థం చేసుకో గల ఆత్మీయుల దగ్గరే నోరువిప్పి మాట్లాడతాడు. మిగతావారితో ఎంతవరకు అవసరమో అంతవరకే మాట్లాడి తప్పించుకు వెళ్ళిపోతాడు.

ఎంత వ్యవహర్త కాకపోతే దాదాపు పదేళ్ళ క్రితం స్థాపించిన ఆంధ్ర నాటక కళా సమితి సంస్థను – మొదటిలో కొద్దిమందితో స్థాపించిన సంస్థ ఇప్పుడు అయిదారు వందలమంది మెంబర్లతో మూడుపూవులూ ఆరు కాయలుగా వర్ధిల్లుతోందంటే అదంతా లక్ష్మీనరసయ్యగారి కృషేకదామరి. విజయవాడ పట్టణంలోవున్న వణిక్ప్రముఖులంతా లక్ష్మీనరసయ్య గారి మంచితనాన్నీ, నమ్మకాన్ని గ్రహించి ఈ నాటక సంస్థకు చేదోడు వాదోడుగా నిలిచి ఈయన కృషిని ప్రోత్సహిస్తున్నారు.

మనిషి ఇతర వ్యాపకాలకుపోడు. ఏదుర్వ్యసనమూ లేదు. తను నెలకొల్పిన ఆంధ్ర నాటక కళాసమితినీ, తన రంగస్థల నాటకాలనూ, తన రేడియో నాటకాలనూ చూసుకుంటూ కళాసేవ చేస్తున్న శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్య నిజమైన కళాతపస్వి. మా యిద్దరి మధ్యా ఉన్న స్నేహ సంబంధమూ, లక్ష్మీనరసయ్యగారిపట్ల నాకున్న గౌరవాభిమానాలూ నన్ని రచనకు పురి కొల్పాయి. వీరు ఆయురారోగ్యాలతో చిరకాలమూ కళారంగానికి సేవచేయాలని మనస్ఫూర్తిగా కోరు కుంటున్నాను.

★★





ఆంధ్ర ఆర్ట్సు థియేటర్ వారు శ్రీ పృధ్వీరాజ్ కపూర్ సమక్షంలో ప్రదర్శించిన 'ప్రగతి' నాటికలో పాత్ర;
ధారులు, కళాభిమానులు, పెద్దలు మధ్య నున్నవారు శ్రీ పృధ్వీరాజ్, కుడినుంచి మూడవవారు శ్రీ కర్నాటి

# శ్రీ కర్నాటికి నా వందనాలు

— పరుచూరి వెంకటేశ్వరరావు,
బి. ఎస్. సి.
నాటక రచయిత, నటుడు

ఒక మంచి నాటకం రాయటం కష్టం. అలాగే ఒక మంచి మనిషిని గురించి రాయటం కూడా కష్టంతోకూడిన పనేనని గౌరవనీయులైన శ్రీకర్నాటి లక్ష్మీనరసయ్యగారిని గురించి రాస్తుంటే అర్థమౌతోంది.

మేనెలలో, మండుటెండలో, అందునా బెజవాడలో మేము "సమాధి కడుతున్నాం-చందా లివ్వండి" నాటకం విశాఖలో ప్రదర్శించి తిరిగొస్తుంటే. నా భుజం మీద ఆప్యాయంగా ఓ చేయిపడింది. అది నా మనసుకి చల్లగా తగిలింది. అంత ఎండలోనూ ఇదేమిటని ఆశ్చర్యంగా చూస్తే పక్కనే శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు. అలా ఆయన్ని చూశాను. అంతకుముందు నాటక సమాజాలవారు శ్రీ కర్నాటిని నటుడిగా, వక్తగా, కార్యకర్తగా పొగడుతూ వుంటే వినటం మాత్రమే జరిగింది. ఇవి అతిశయోక్తులు కావని ఆయనతో నా పరిచయం పెరిగిన తరువాత తెలుసుకున్నాను.

అప్పటి కర్నాటిలో నటుడిగా పేరు ప్రఖ్యాతులు గడించాలన్న ఆశవుండి వుంటుంది. ఇది అంచనా మాత్రమే. కానీ ఇప్పటి కర్నాటిలో నాటకరంగానికి సేవ చేయాలన్న తృష్ణమాత్రమే కనిపిస్తుంది. ఇది అంచనా కాదు, నిజం. అందుకే ఆయన ఆధ్వర్యంలో ప్రయోజనాత్మక, ప్రయోగాత్మక నాటకాలు విజయవాడలో ప్రదర్శింపబడుతున్నాయ్. ప్రేక్షకుల్లో ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని కలిగిస్తున్నాయ్. నాటకాని కూడా ప్రయోజనం వుందని ఋజువుచేస్తున్నయ్. ఆయన ఆధ్వర్యంలో నాటకం ప్రదర్శించిన ఏ నాటక సమాజం వారికైనా ప్రకటించిన ప్రైజుకే నాటకం ప్రదర్శించాలన్న గట్టి నియమం ఖచ్చితంగా వంటబడుతుంది

ఒక గొప్ప నటుడు, ఒక గొప్ప ప్రయోక్త తన శక్తి సామర్థ్యాలను స్వప్రయోజనానికి వినియోగించకుండా పదిమంది రచయితలకో, నటులకో, దర్శకులకో గుర్తింపు తీసుకురావాలని, తద్వారా ఆంధ్ర నాటక రంగం అభివృద్ధికి పాటుపడాలని దీక్షతో కృషిచేస్తున్న వ్యక్తి శ్రీ కర్నాటి.

అందుకే నిస్సంకోచంగా ఆయన మహామనీషి. ఆయన్నభినందిస్తున్న సంస్థ "ఆంధ్ర నాటక కళా సమితి"కి అన్ని ఔత్సాహిక నాటక సమాజాలవారు ఋణపడివున్నారు. కారణం ఇది అందరం చేయవలసిన పనిగనుక, అందుకే ఎప్పుడూ ఆయనకు నా వందనాలు.

★★

# నమస్కరిస్తున్నాను

పి. యల్. నారాయణ.

*An Actor is a Thing at which the Masses gaze at with childish amusement and awe, and for intellectuals he is a 'Thing' on the dissection table. Hence the Actor tends to play mostly to the Masses-and Art becomes Dirt.*

ఇది దాదాపు మనందరం చూస్తున్న సత్యం. ఒక సిద్ధాంతానికో, ఒక సంస్థకో కట్టుబడకుండా, ఎల్లాగో అలా తనకు పేరొస్తే చాలుననే తత్వంతో ఎన్నో రకాల ప్రలోభాలకు లోనవుతున్న కళాకారులను మనం చూస్తూనే వున్నాం. తనను విమర్శించే మేధావులకు దూరంగా పరుగెడ్తూ, పామరులైనా తనను మెచ్చుకునే వాళ్ళనే తనచుట్టూ పోగేసుకుంటూ ఆ పొగడ్తలకోసం పామర రంజకమైన పద్ధతులే అనుసరిస్తూ, ఆ మెచ్చుకోళ్ళతో తన స్థాయిని పెంచుకుంటూ తిరుగుతూన్న అనేకమంది ప్రముఖుల్ని చూస్తున్న మనకళ్ళకు 'కర్నాటి' ఒక వింతగానో అమాయకుడుగానో లేక పిచ్చివాడిగానో కన్పించటం మన తప్పులేదు. తనకంటూ ఏమైనా పేరొస్తోందా, ప్రాముఖ్యత వస్తోందా, తనచుట్టూ భజన సంఘం వుందా లేదా...అనే ముఖ్య విషయాలు పట్టించుకోకుండా...కళ, సిద్ధాంతం, సంఘసేవ అంటూ తిరిగే మనిషికి అంతకంటె ఏం కితాబులొస్తాయట ?

ఆనాడు 'ఎవరు ద్రోహో' ఎవరు 'ఆసామీ' యో కనిపెట్టేందుకు పల్లెపల్లె తిరుగుతున్నప్పుడూ 'తన' సంగతి పట్టించుకోకపోయె, ఆ తర్వాత 'ఛైర్మన్' అయినా "ప్రెసిడెంటు పట్టయ్య" అయినా తన కీర్తి పెరుగుతోందా లేదా అనే దిగులు లేకపోయె... అస్తమానం సమాజంకోసం, నాటక సమాజంకోసమే తాపత్రయమైపోయె... సరేనయ్యా యిప్పుడు శక్తి ఉడిగిపోయింది. వయస్సు కుంగదీస్తోంది గదా... యిప్పుడైనా తాతలపేరు చెప్పుకుంటూ నేతులు తాగటమో, పూర్వకాలంలో పొడిచేసిన సంగతులు చెప్పుకుంటూ డబ్బు, కీర్తి సంపాదించుకోవడమో, గతవైభవాల ముసుగులో సన్మానాలు చేయించుకోవడమో, బిరుదు లిప్పించుకోవడమో చేసుకోరాదూ... అబ్బే... ఆ ధ్యాసే లేకపోగా "ఆంధ్ర నాటక కళాసమితి" పెట్టడం, మారుమూల మూలుగుతున్న నాలాంటి కుర్రకారునంతా కళాకారులుగా చేయాలని తాపత్రయ పడటమే పనిగా పెట్టుకున్న ఈ 'సరసయ్యను' 'నర్సమ్మ' అనక యింకేం అంటాం. Hospital లోంచి రేపు బయటకు పోబోతున్న బిడ్డ తనది కాకపోయినా, ఆబిడ్డ పెరిగి పెద్దయ్యాక తన మొఖంచూడదని తెలిసికూడా ప్రాణమొక ఎత్తుగా బిడ్డను సాకే 'నర్స్ అమ్మ' కూ తను అర్థమైన చాకిరీ చేస్తూ ప్రతివాడినీ కళాకారునిగా తీర్చి దిద్దే కర్నాటి 'నర్సమ్మ'కూ ఏమిచ్చి ఋణం తీర్చుకోగలం. అందుకే మా స్వార్థం కోసం మీకు అవాంగ్మానస గోచరమైన ఆ శక్తి, తరగని ఆయుర్దాయాన్ని ప్రసాదించాలని కోరుకుంటూ— మీకు నమస్కరిస్తూ...

★★

# 'కళాయశస్వి' శ్రీకర్నాటి

— చిట్టిబాబు

చిరునవ్వుతో, మల్లెపూవులాంటి తెల్లటి ఖద్దరు బట్టలతో, చేతిసంచీ చేత పట్టుకుని, కళ్లల్లో కళతాలూకు ప్రగాఢ ఆత్మవిశ్వాసాన్ని నింపుకుని, ఎంతో అందంగా, మధురనిష్యందంగా; మల్లెపూలతో కొట్టినట్టు – మంచిగంధం రాసినట్టు అనుభూతిని కలిగించే వారు ఎవరైనా విజయవాడలో తారసపడితే ఆయనపేరు శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య.

½ దశాబ్దాల ఆంధ్ర నాటకరంగ చరిత్రలో ఆయనదొక అద్భుతమైన పాత్ర. నటుడుగా, దర్శకుడుగా, వక్తగా, వేత్తగా, నాటకక్షేత్రంలో ఆయన పండించిన పంట అనితరసాధ్యమైనది –

వైతాళికుడుగా హావికుడుగా ఆయనది కళారంగం మీద చెప్పుకోదగిన చరిత్ర.

'నాసర్'తో బుర్రకథలు చెప్పటంనుంచి; కీ.శే. డా. రాజారావ్‌తో, 'రోడ్డురోలర్'లాగటంనుంచి, 'పట్టయ్య'గా ప్రఖ్యాతి పొందటంనుంచి, ఎన్ని నాటకాలు, ఎన్ని నాటికలు ఆడారు, ఆడించారు– నిజానికి, యివ్వాళ రంగస్థలంమీద ఒక నాటకం ప్రదర్శించటమంటే–గొప్ప యజ్ఞం చేయటం లాంటిది. ఐతే శ్రీ లక్ష్మీనరసయ్యగారు యజ్ఞాలు చేయటమేకాదు, చేయించారు కూడాను–

ఆంధ్రనాటక కళాసమితి పుట్టి, యిప్పటికి పదేళ్లయ్యింది. యీ పదేళ్ళ కాలంలో శ్రీ లక్ష్మీనరసయ్యగారు, తనశక్తి – మేధ అంతా కళారంగానికే వినియోగించారు. వేలాదిమంది చందాదారులను చేర్చి, ప్రతినెలా వేళ్ళమీద లెక్కపెట్టగలిగిన గొప్ప నాటకాల్ని, ప్రేక్షకుల కళ్ళముందు, పటంగట్టి వ్రేలాడేశారు.

అయితే, మఘలో పుట్టి, పుబ్బల్లో అస్తమించిన చాలానాట్యమండలులను, కళామండలులను మనం విని వుంటాం. యీ పదేళ్లకాలంలో తన వెలుగును నాలుగువైపులా ప్రసరింపచేసిన ఖ్యాతి ఆంధ్ర నాటక కళాసమితికి మాత్రమే దక్కివుంటుంది.

మరి, యింతమంది చందాదారులని దశాబ్దినుంచీ, జెసక్కుండా పట్టుకురావటమంటే, అది తేలికైన విషయం కాదు.

నిజానికి, కళఎంత వున్నతమైనా, అది ఆర్థికమైన దెబ్బలకు లోనవుతూనే వుంటుంది. 'కళ' అనే గొప్ప అంశంమీద సరైన అవగాహనవున్న మనుషులు వేళ్లమీద మాత్రమే దొరుకుతారు.

గొప్ప నటుల్ని, సమూహాల్ని పీడిస్తున్న భయంకర సమస్య 'ధనం' – కళల్ని పోషించగల్గిన దాతలు యివ్వాళ గనక వుండివుంటే, తెలుగునాటక కళామతల్లి కాలిగజ్జెల ఘలంఘలలు, మధుర మంజులంగా వినిపించి వుండేవి. ఆ తల్లి కాళ్ల పారాణి –నిత్యమూ పచ్చని పసుపుతో భాసించివుండేది–

కళామతల్లి ప్రజల్లోంచి రానురానూ అదృశ్యమైపోవటం మొదలెట్టింది–అర్థరూపాయికి అందుబాటులో వుండే చలనచిత్రసీమ, యివ్వాళ చాలా బలాన్ని పుంజుకుంది–సినిమాల్లో 'కళ' చాలా తక్కువ. నిక్కచ్చిగా మాట్లాడాలంటే–

ఇవ్వాళ మేధావులు, నటులు, కళాప్రియులు ఆలోచించాల్సిన మంచి విషయం ఒకటి మనముందున్నది.

శ్రీ లక్ష్మీనరసయ్యగారిలాంటి కళాప్రియుల్ని గౌరవించటం నేర్చుకుంటే చాలా దూరపు సమాజాలు, ఆంధ్రనాటక కళాసమితి ఖర్చుతో గొప్ప ప్రదర్శనలు చూడగల్గుతుంది.

ఇవ్వాల్టి సంగతేమోగాని, రేపటి ప్రజలు శ్రీ లక్ష్మీనరసయ్యగారి Sinciarity కి నీరాజనాలు ఇచ్చి తీరుతారు. ఒక వ్యక్తిగా గాక, ఒక సమిష్టి శక్తిగా ఆయన చేస్తున్న కళాసేవ నిరుపమానమైనది.

కువిమర్శకుల విమర్శనలకు చోటు యివ్వకపోతే, యీ పదేళ్లకాలంలో ఆంధ్రనాటక రంగానికి, ఆయన చేసిన సేవను గురించి ప్రతి కళాకారుడూ ఆలోచించాల్సిన అవసరం, కనీసం ఒక్క క్షణమైనా వుంది.

★★





‘ఎవరు ద్రోహి’ నాటికలో

M. L. A. పాత్రధారి కర్నాటి



# "కర్నాటి వ్యక్తిత్వం"

— సి. రామమోహనరావు
(ఆకాశవాణి)

నాదోపాసన ద్వారా మానవులు సుఖ-శాంతులు పొందవచ్చుననే సత్యాన్ని మన పూర్వులు ఆచరణల ద్వారానూ, అనుభవాల ద్వారానూ చాటి చెప్పారు. అయితే యిందుకు ముఖ్యంగా కావలసింది నియమ, నిష్ఠలూ, లక్ష్యశుద్ధి. యివిలేని, కళారాధన అన్న పదానికి అర్థమేలేదు, పోతే, నలుగురి మెప్పులకు చేసే కళాపోషణ, కళారాధన రక్తికీ, రంగానికీ కాకుండా పోతుంది. అయితే, వంది మాగధుల ఆర్భాటాలూ, తాత్కాలిక ప్రయోజనాలూ ఎన్నయినా కలగవచ్చు-అది వేరే విషయం. యింతకీ, అసలు సంగతి నాదోపాసనగదా - సకల గోళ కోటులనూనిబంధించేసూత్రం శబ్దబ్రహ్మమైనప్పుడు-దాన్ని సరియైన విధానంలో ఉపాసించి, ఉభయతారకమైన ఫలప్రాప్తిని పొందటం వాంఛనీయం.

'సుశబ్దంబుల్ శోభిల్లం పల్కుము నాదు వాక్కునను' అని సరస్వతీదేవిని ప్రార్థిస్తుంటాము. 'నోరు మంచిదైతే నరుడా ఊరు మంచిదౌరా' అని నానుడి. యిన్ని సల్లక్షణాలు కలవాడు నేనెరిగిన కర్నాటి లక్ష్మీనరసయ్య. కొందరు చీటికీ మాటికీ అపభ్రంశపు పలుకులు పలుకుతూంటారు. మరి కొందరికి అలాటి ఊతపదాలు లేనిది నిత్య జీవిత వ్యాపారమే సాగదు. ఇలా మాట్లాడే వారంటే లక్ష్మీనరసయ్యకు ఎంతో ఏవగింపు. తానుగా ఎప్పుడూ సవ్యంగానే మాట్లాడ్తాడు. కర్నాటి నోటినుంచి, అపసవ్యమైన పలుకు వినాలంటే చాలా రోజులు అతని వెన్నంటి కనిపెట్టాలి. నిండైన గొంతుతో కర్నాటి ఏ విషయం గురించి మాట్లాడుతున్నా-ఆ మాటలకు బలం పుంజుకుంటుంది. కర్నాటి విజయపరంపరకు పునాది కారణం యిక్కడుంది. అదే అతని నోటి మంచితనం.

లక్ష్మీనరసయ్యను గురించి అందరికీ తెలిసిన మరో బహిరంగ రహస్యమొకటుంది అది విరామం లేని పరిశ్రమ. ఎవరో ఏదో అనుకున్నారని, అనుకుంటారనో తను చేస్తున్న పనినిగానీ, చేయదలచుకున్న పనినిగానీ విడిచిపెట్టడు. కర్నాటి కనిపిస్తే చాలుమనసులోఅసూయపడేవాళ్ళుకొందరువుండవచ్చు. అయితే,కర్నాటి నోరువిప్పి తనకిదికావాలనిఅడుగుతే, కాదనేవారు దాదాపు లేరని చెప్పాలి. దీనికీ ఒక కిటుకుంది. ఏ సంస్థకు ప్రతినిధిగా కర్నాటి ప్రత్యక్షమవుతాడో ఆ సంస్థను తన ప్రాణంకన్న మిన్నగా భావిస్తాడు. ఆ సంస్థ పెరగాలి, ఆ సంస్థద్వారా సామాజిక ప్రయోజనం దండిగా జరగాలి, వ్యక్తిగతమైన పేరు ప్రతిష్ఠలు తనకు కావలసి ఉన్నా-సంస్థాపరమైన తన ప్రతిష్ఠకు మరింత బలం వుంటుంది. అందుకే తన సంస్థ పెంపుదలకు అహర్నిశలు శ్రమిస్తూనే ఉంటాడు యీ విషయంలో-నే నెరిగున్నంతలో-కర్నాటికి దీటుగా మనకు స్ఫురించేవాడు కీ॥శే॥నటరాజు కె. వెంకటేశ్వరరావు మాత్రమే. తన జీవితపు చివరిఘడియల్లోకూడా రసన సమాఖ్య కోసం పలవరించేవాడు, తపించేవాడు. తన జీవితంమీద మబ్బులు ముసురుకుంటున్న కాలంలోనే, ర.స.న. మీద ఆశలు వదలుకున్నాడు.

తానుమొక్కవేసి, పాదుచేసి,నీరుపోసి పెంచుకుందామనుకున్న సంస్థకు సర్వాత్మనా పాటుపడే. ఆ సల్లక్ష

ణంలో, కర్నాటి తన గురుదేవులైన కీ॥ శే॥ డా॥ రాజారావుగారి అడుగుజాడలనే అనుసరిస్తాడు. అంతటి దీక్షాదక్షతలు పుంజుకున్నాడు

యింత కొద్దికాలంలోనే ఆంధ్ర నాటక కళాసమితికి యింత ప్రతిష్ఠ కలగడానికిగాని, సమితి యీ స్థాయికి రావటానికిగాని కారణం కర్నాటి కర్తృత్వతే. యింతగా సంస్థకోసం విరగబడి, చాకిరీచేసే మనిషి మరొకడేడీ? అందరూ పల్లకీ నెక్కితే – పాల్కీ మోసే బోయీలెవ్వరు? తనను ఆ స్థాయిలో ఊహించుకుని, సామాజిక స్ఫురణతో పాటుపడ్తాడు గనుకనే–కర్నాటి మాట పాటిగా చెల్లుతుంది. తన మాట కాదంటే దాన్ని నేర్పుగా చెల్లించుకునే తీరూ తనకు తెలుసు. అవి అతనికిగల ఓర్పూ, ఒడుపూ యీ రెండు లక్షణాలూ అనుకోగానే అందరికీ అబ్బేవిగావు. దానికి కొంత సంస్కారం అలవడాలి, యీ సంస్కారం కర్నాటికి కావలసినంత.

మరో ముఖ్యమైన సంగతి – కర్నాటిని గురించి చెప్పుకోవాల్సింది. ఒట్టి చొల్లు సమావేశాల్లో కర్నాటి ససేమిరా పాల్గొనడు. ప్రయోజన శూన్యమైన పనులంటే రోత, ఎప్పుడూ, ఎక్కడో అక్కడ కనిపించినా, వృధా కాలక్షేపం, కాలయాపన ససేమిరా చేయడు. కనుకనే కర్నాటి భుజస్కంధాలమీద ఒక పని పడేశామంటే, అది విజయవంతమైనట్లేనని మిగిలినవారికి కొండంత ధైర్యం ఉంటుంది. ఇవన్నీ కర్నాటిలో నేను కనిపెట్టిన సల్లక్షణాలు ఒక వ్యక్తిగా, ఎవరికీ తీసిపోని విధంగా బాగా బ్రతకాలనే తలంపు ఎంతో గొప్పగాదూ!

మీదుమిక్కిలి అతను రంగులు మార్చడు – ప్రక్కదారుల వెంట నడవడు. మరి తనకు చేత నవునో కాదో తెలియదుగాని, డొంకదారుల వెంట వెళ్ళటానికి యిష్టపడడు. అందుకు అనుగుణంగానే తెల్లటి మల్లెపూవుల్లాంటి శుద్ధఖద్దరు వేసే జాతీయవాదీ, కార్యవాదీను.

అయితే కళాకారుడుగా చెప్పుకోవాలంటే – ఎన్ని రంగులు మార్చేడో లెఖ్ఖలేదు!! వివిధములైన జానపద కళా ప్రక్రియల్తోపాటు, రంగస్థల నాటక కళాకారుడుగానూ, చలనచిత్ర కళాకారుడుగానూ, రేడియో నాటకకళాకారుడుగానూ ఎంతో పరిశ్రమించి, వాటిద్వారాతన ప్రతిభను ప్రదర్శించాడు.రంగస్థల నటుడుగా, నాకూ – లక్ష్మీనరసయ్యకూ పాతికేళ్ళ దోస్తీ. నేను రేడియోలో ఉద్యోగానికి కుదురుకున్నప్పట్నుంచీ మరింతదోస్తీ. శతాధికంగా రేడియో నాటకాల్లో భిన్న భిన్న పాత్రలు ధరించాడు. అదిపౌరాణిక నాటకంగానీ, చారిత్రక ఇతివృత్తంగలదిగానీ, సాంఘిక కథావస్తువు గానీ–కర్నాటి ఒక ముఖ్యపాత్రకే గాత్రధారి ఔతాడు. అది పెద్దమనిషి తరహా పాత్రగానీ – క్రూరస్వభావం గలది గానీ–దానికి కావలసిన విధంగా సంభాషణలను పలికించి–ఆపాత్రలకు శ్రోతలస్మృతిపథంలో జీవం పోసి నిలుపుతాడు. కనుకనే, రేడియో నటుడుగాకూడా కర్నాటి మంచి పేరు తెచ్చుకో గలిగాడు. శబ్దాన్ని సమ్యగా ప్రయోగించగల నేర్పు తనకు వెన్నతో పెట్టిన విద్య గనుక, రేడియో నాటకం ఒద్దికలు జరిగే టప్పుడు శ్రద్ధగా పాల్గొని– ఆ సూచనల్ని అమలు జరుపుతూ వేషాన్ని అధ్యయనం చేస్తాడు. యీ శ్రద్ధే కర్నాటిపై మా అభిమానానికి ప్రధాన హేతువు. శబ్దాన్ని ఏ విధంగా మలిస్తే ఏభావం పలుకుతుందో– ఎంచుకుంటూ సాధన చేస్తాడు. రంగస్థల కళాకారుడుగా యీ ప్రక్రియను ఉపాసించటానికి ఉపక్రమించిన కర్నాటి, రేడియో నటుడుగా శ్రోతల అభిమానాన్ని సంపాదించుకుంటానికి, ఆ తపస్సును పండించుకున్నాడు. మరీ, రేడియో నాటికల్లో, రాణీ రుద్రమ, చిన్నపరెడ్డి నాటికల్లో లక్ష్మీనరసయ్య అత్యద్భుతంగా పాత్రపోషణ చేశాడు. తెల్లదొరలు తనను బందీ చేయటానికి కుట్రచేశారని తెలిసినప్పుడు చిన్నపరెడ్డి ఆవేశం,ఆత్మఘోష,చివరిగా అతని ఆత్మత్యాగము– యివన్నీ ప్రశంసనీయంగా నిర్వహించాడు. ప్రతి వేషాన్ని యింతపట్టుగానూ, శ్రద్ధతోనూ నిర్వహిస్తాడు– రంగస్థలంమీద కొన్ని వేషాల్లో లక్ష్మీనరసయ్యను చూస్తే మనకు ఈర్ష్య కలుగుతుంది– వ్యక్తిగానూ, నటుడుగానూ– యింతటి నిండైనవానికి విజయ పరంపరలు సిద్ధించటంలోనూ– సన్మాన పరంపరలు జరగటంలోనూ, ఆశ్చర్యమేముంది.

వాగ్దేవి కరుణా కటాక్ష వీక్షణములకు పాత్రుడై, అన్నాయ్– కర్నాటి లక్ష్మీనరసయ్య– నిరంతరం ఆనందమయమైన జీవితం గడుపుతూ, తను సారథ్యం వహిస్తున్న సంస్థల్ని బాగా అభివృద్ధిచేసి, కళాకారుడుగానూ, కళాపోషకుడుగానూ, చిరయశస్సు నార్జించాలని నా ప్రగాఢవాంఛ.

★★

# 'జగమెరిగిన ప్రజానటుడు'

— కె. యస్. శాస్త్రి

(మేకప్ ఆర్టిస్టు)

ఏ వేషానికి ఎలా మేకప్ సమకూర్చాలో చెప్ప గలను చెయ్యగలనుగానీ - వ్యాసాలు వ్రాయటం తెలియని నాకు మిత్రులు లక్ష్మీనరసయ్యగార్ని గురించి ఈ వ్యాసం వ్రాయలేకుండా వుండలేక పోతున్నాను. ఇది గొప్ప సాహసమే !

ఈ వ్యాసం ఆయనమీద నాకున్న గౌరవమనండీ, అభిమానమనండీ, స్నేహమనండి, ఈ అవకాశం మహద్భాగ్యంగా భావిస్తున్నాను.

ఆంధ్ర నాటకరంగ చరిత్రలో శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారంటే తెలియనివారు లేరంటే అతిశయోక్తి కాదేమో - గత మూడు దశాబ్దాల పైగా నాటక రంగానికి సేవచేస్తున్న వ్యక్తుల్ని యీనాడు వ్రేళ్ళమీద లెక్కించొచ్చు. అలాంటి వారిలో లక్ష్మీనరసయ్యగారొకరు.

ప్రజానాట్యమండలి నిర్మాతలలో ముఖ్యులుగా, ఆచార్యులుగా, ఆదర్శప్రాయులైన దర్శకులుగా నాటక కళకోసం అహరహము శ్రమించి వందలాది నటీ నటులను శాస్త్రీయపద్ధతిలో క్రమశిక్షణతో, తీర్చిదిద్దిన గురుతుల్యులు కోడూరు అచ్చయ్య, డా॥ గరికపాటి రాజారావుగార్ల శిష్యరికంలో రూపుదిద్దుకున్న నటుడు కర్నాటి లక్ష్మీనరసయ్యగారు.

శ్రీ లక్ష్మీనరసయ్యగార్ని గత 1౯ సంవత్సరాలుగా ఎరుగుదును. ఆయన నాటకాలు చూశాను. ఆయనమీద ఒక మంచి అభిప్రాయం కలిగింది. కానీ ఆయన్ని పరిచయంచేసుకోవాలంటే మట్టుకు భయంగా వుండేది. కారణం కొందరు మిత్రులు ఆయనచాటుగా కథలు అల్లేవారు. అది విన్న నేను పరిచయం లేక పోయినంతమాత్రాన ప్రమాదంఏమీలేదులే ! అని సరిపెట్టు కొనేవాడిని.

అలా కొంతకాలం కాలగర్భంలో కల్సిపోయింది. నేను ఆయన్ని పరిచయం చేసుకున్నానో - ఆయనే నన్ను పరిచయం చేసుకున్నాడో తెలియదుగానీ, తరచు మేం కలవటం, యోగక్షేమాలు విచారించు కోవటం, నాటకాల గురించి మాట్లాడు కోవటం, ఒకరి అభిప్రాయాలు మరొకరు తెల్సుకోవటంద్వారా ఎప్పుడు స్నేహితుల మయ్యామో తెలియదు గానీ- ప్రస్తుతం నాటకాలనుంచి స్వవిషయాలవరకూ మేము చర్చించని రోజంటూ లేదు, గాంధీమహాత్మునికే విరోధులుండగా మన లక్ష్మీనరసయ్యగార్కి వుండ టంలో అబ్బురమేముంది ? అందరికీ అందరూ మంచివారు కాలేరుకదా !

ఒక్క విషయం- నాకు తెల్సింది ఆయన్నుగురించి చెప్పక తప్పదు. ఆయన కొన్ని నియమాలకు కట్టు బడ్డ వ్యక్తి. త్రాగుబోతులకూ, జూదరులకూ, వ్యభి చారులకూ, క్రమశిక్షణ, నియమాలు పాటించలేని వ్యక్తులతో మాత్రం ఆయన ఏకీభవించడు. అదే ఆయన చేసిన అపరాధమేమో !

ఆయనతో నా కొక అనుభవం. అది ఉగాది అను కుంటాను. సమితిలో నాటకం. ఆరోజు నేను మేకప్ చెయ్యాలి. వాంతులు, తలనొప్పి, జ్వరబాధతో మేకప్ చేయలేకపోతున్నాను. నాటకం ప్రారంభించ

టానికి ఇంక 15 నిముషాలే వుంది. ఇంకా వేషాలు పూర్తి కాలేదు. ఇంతలో లక్ష్మీనరసయ్యగారొచ్చి నిరుత్సాహంతోనూ, ఆందోళనతోనూ ఏమండీ శాస్త్రిగారూ ఇంకా 15 నిముషాలే వ్యవధి వుంది. యింక ఎప్పుడు వేషాలు అందిస్తారు? అని అడిగారు. నేనింకా నా పరిస్థితి గురించి చెప్పబోయేంతలో కలగచేసుకొని ఇప్పుడు అవన్నీ అప్రస్తుతం. ఎలాంటి పరిస్థితిలోనూ 6-30 కి కర్టెను తెరుస్తాను. తర్వాత మీ యిష్టం అంటూ వెళ్ళిపోయారు. దాంతో నాతల తిరిగిపోయింది. అవమానంతో కుంచించుకు పోయాను. ఎలాగో ఓపిక చేసుకుని వేషాల్ని పూర్తిచేసి, స్నేహితుడన్న విచక్షణ లేకుండా ఇంత కర్కోటకుడిగా ప్రవర్తించాడేమిటా అని ఆలోచిస్తుండగానే ఒక డాక్టరును ఆయన వెంట పెట్టుకు రావటం, ట్రీట్‌మెంట్ యిప్పించటం, తనతో వచ్చిన వారితో నా సిన్సియారిటీ గురించి, నా పరిస్థితి గురించి విపులీకరించటం క్షిప్తకాలంలో జరిగిపోయినాయ్.

పలుకరించే వారందరూ స్నేహితులు అంటే ఒప్పుకోకూడదు. మన హితవుకోరే వారినే స్నేహితుడుగా భావించాలి. లక్ష్మీనరసయ్యగారి దృష్టిలో అందరూ హితులే! అందుకే ఆయన అందరికి స్నేహితుడు.

కళ కళకోసం కాదనీ - అది ప్రజలకోసమనీ, చాటి చెప్పిన కీ॥ శే॥ కోడూరి అచ్చయ్య డా॥ గరికపాటి రాజారావుగార్ల ఆశయాలను నమ్మి ఆచరిస్తున్న వ్యక్తి లక్ష్మీనరసయ్యగారు. గత 35 సంవత్సరాలుగా కళాసాధనలో కొన్ని వందల వేల ప్రదర్శనలిచ్చి యిప్పటికీ ఏదో తెల్సుకోవాలనే తపన ఆయనలో ప్రతి క్షణమూ ద్యోతక మవుతూనే వుంటుంది.

లక్ష్మీనరసయ్యగారు ఒక్క నటుడేకాదు. ఒక మంచి ప్రయోక్త, అంతకన్నా మంచి దర్శకుడు, తనకు నచ్చనదీ, తనఆశయాలకు విరుద్ధంగా వుండే - సందేశం లేని ఏ నాటకాన్ని ఆయిన గౌరవించడు. చేపట్టడు. తను అనుకున్న విధంగా నటుడ్ని తీర్చి దిద్దనిదే నిద్రపోడు, ఈనాడునాటకాలలో కన్పిస్తున్న సర్కసులు, గారడీలు సుతరామూ ఆయనకు ఇష్టం వుండవు.

ఈనాడు నటీ, నటులు ఎంతగానో ఎదిగారు కానీ, క్రమశిక్షణ, పరస్పర సహకారం దెబ్బతిందనీ, మన నాటకరంగం ఇంతగా వెనుకబడటానికి కారకులు కళాకారులేనని, సినిమాకు రూపాయిలు ఖర్చుచేసే యీ నటులు నాటకానికి అర్ధరూపాయైనా ఖర్చుపెట్టరనీ, నాటక రంగంమీద అంతటి గౌరవాభిమానాలు చూపుతున్నాడనీ, ప్రతి కళాకారుడూ 0-50 పైసలుతో నాటకం చూస్తే మనం ప్రభుత్వం మీదకానీ, పబ్లిక్ మీద కానీ ఆధారపడనక్కరలేదనీ,అలా కాకుండా పత్రికా మార్గాన నాటకానికొచ్చి వెక్కిరింతలూ, వేళాకోళాలూ చేయుటద్వారా మన గౌరవాన్ని మనమే నాశనం చేసుకుంటున్నామనీ, ఇలాగైతే మన నాటకాలు ఎలా బాగుపడతాయనీ, నాటకం ఒక యజ్ఞమనీ, అందులో కళాకారులు సమిధలనీ, నటుడు సరదాకోసమో - మెప్పుకోసమో నాటకాలు ఆడకూడదని, ప్రజలను చైతన్యవంతం చేసేదే నాటకమనీ అంటారాయన.

చెప్పటానికి శక్తి చాలదుకానీ- ఆయన్ని గురించి చెప్పాలన్నా- వ్రాయాలన్నా- అది రామాయణమో- మహాభారతమో- అంతకన్నా గొప్పగ్రంథమో అవుతుంది.

ఒక్క మాటలో చెప్పాలంటే- ఆయన ముక్కుకు సూటిగాపోయే వ్యక్తి. అంతకన్నా నిబ్బరమైన గుండె గలవాడు. అంతకన్నా పట్టుదల కలవాడు. ఓటమి ఎరుగని మనిషి.

దాని ప్రతిరూపమే ఆంధ్రనాటక కళాసమితిస్థాపన సంకల్ప బలంతో, స్వయంకృషితో పదిమంది పెద్దిలను కూడగట్టుకొని సాధించిన ఘనవిజయం.

ఇన్ని సంవత్సరాలుగా ఎన్ని నాటకాలాడాము? ఎన్ని ప్రదర్శనలిచ్చాము? అన్నది ప్రశ్నకాదు. ఇన్ని సంవత్సరాలు నాటకరంగంలో వుండి మనం సాధించిన దేమిటి? అన్నదే ప్రశ్న. కొన్ని దశాబ్దాలుగా నాటకరంగంలో వుంటూ-ఆంధ్ర నాటకరంగం నానాటికి దిగజారిపోతోందని, దీనికి ఆదరణలేదని, ఎవరో రావాలనీ, దీన్ని ఉద్ధరించాలని వేదికలెక్కి ఉపన్యాసాలిచ్చే తను ఏమి చేశామన్నది - ఏమి చెయ్యాలన్నది

చెప్పలేని దశలో "పట్టి మాటలు కట్టి పెట్టోయ్ గట్టి మేల్ తలపెట్టవోయ్" అని గురజాడ అప్పారావుగారు చెప్పినట్టు తు॥చ॥ తప్పకుండా పాటించి-నేను యీ సంస్థను స్థాపించి దేశం నలుమూలలవుండే కళాకారులను విజయవాడకు పరిచయం చేయుటలో ఉడుతా భక్తి చూపిస్తున్నానని-ఇక మీవంతు పూర్తిచెయ్యండి అని ప్రశ్నించినట్లు చేశారు. ఇది లక్ష్మీనరసయ్యగారి జీవితంలో మరపురాని, మరువలేని ఘట్టం, చిరస్మరణీయం.

ఇక ముందు ఇలాంటి కార్యక్రమాలు ఆయన జీవితంలో ఎన్నో చేపట్టి - విజయంపొంది బ్రతుకికి ఒక అర్థం చూపించుతారని నమ్ముతూ-లక్ష్మీనరసయ్య గారు, ఆయన స్థాపించిన "ఆంధ్రనాటక కళాసమితి" ఆచంద్రార్కం ప్రకాశింపబడాలని కోరుకుంటూ శలవు తీసుకుంటున్నాను.

★★





శ్రీ కర్నాటిని సత్కరిస్తున్న
శ్రీ బొమ్మిశెట్టి సత్యమూర్తిగారు, బి. ఏ.



# 'సద్గుణసంపన్నుడు' మా కర్నాటి

— బచ్చు రామచంద్రరావు
B. Sc, L. L. B, L. S, Gd.

కళారంగంలో కర్నాటివారి పేరెరుగనివారు లేరనడం అతిశయోక్తి కాదేమో. ఉపాధ్యాయవృత్తితో జీవితాన్ని ప్రారంభించినా వారి మనస్సు, వారి ఆలోచనలు అన్నీ కళారంగంలోనే విహరిస్తుండేవి. నాటక రంగంలోనేగాక బుర్రకథలలో, జముకుల కథలలో వీధి భాగవతాలలో నిష్ణాతులుగా వీరి పేరు విరివిగా వినిపిస్తుంది. వివిధ రంగాలలో, విభిన్న పాత్రలలో, వినూత్న భావాలను వ్యక్తం చేయగలిగిన వ్యక్తి వారు. నాటక రంగంలో కళాకారుడుగా వారు తిరగని పల్లె పట్టులేదు. వేయని పాత్రలేదు. ఇన్నెందుకు. వారి సేవలనందుకొనని కళారంగం లేదంటే ఆశ్చర్యపడ వలసిన పనిలేదు.

కర్నాటివారి కంఠం వింటే కర్ణభేరి కంపించ వలసిందే. మంచి కంఠంతో గంటలతరబడి ఉపన్యసించ కల్గిన వ్యక్తి అని ఘంటాపథంగా చెప్పవచ్చు. వారి ముచ్చటైన భాష మనందరిని మురిపిస్తుంది. భాషలో శ్లేషలేదు. భావంచూస్తే ముదావహం. దురలవాట్లు, దురభ్యాసములకు దూరంగా నిలబడే వ్యక్తి. సద్గుణ సంపన్నుడు. విదేశి వస్త్రములను విసర్జించి తెల్లని, సన్నని, చక్కని, చల్లని ఖద్దరు వస్త్రములు ధరించి హుందాగా కనబడతారు. నిగర్వి; నిరాడంబరజీవి; వారి నిరాడంబరత్వమే వారి నిర్మల చిత్తమునకు నిదర్శనము.

పదకొండు సంవత్సరాల క్రితం ఆంధ్రనాటక కళాసమితిని స్థాపించి ప్రధాన కార్యదర్శిగా ప్రధాన పాత్రను పోషిస్తున్నారు. కళాకారుడుగా కళాకారులను ఆదరిస్తూ, కళాభిమానిగా కళాభిమానులను గౌరవిస్తూ మంచి మనస్సుతో, మర్యాదతో అందరిని ఆహ్వానిస్తూ క్రమశిక్షణతో కార్యక్రమములను కొనసాగిస్తూ నియమ నిబంధనలతో నిర్వహిస్తూ అందరి ఆదరాభిమానములను చూరగొనిన వ్యక్తి శ్రీ కర్నాటి లక్ష్మినరసయ్య గారు. సాధారణ వ్యక్తిగా అసాధారణమైన కార్యక్రమములను సాధించి నిర్వహించగలడు. వారి పలుకులో పరుషములుగాని హొల్లులుగాని వుండవు. సంస్కారం వారిసొత్తు.

కళాతృష్ణతో నిరంతరం తపించే వ్యక్తిని గురించి యింకా ఎంతవ్రాసినా కొంత మిగిలే వుంటుంది. వారంటే అందరికీ అంత అభిమానం ఎందుకో? అందుకే ఆనందంతో అందజేస్తున్నాను వారికి నా అభివందనలు.

★★

# 'నట తపస్వి'

— సోంపల్లి బాపయ్య

ప్రాచీన భారతం నుండి, ఈనాటివరకు పల్లె సీమలే కళాసంస్కృతులకు, జీవగర్రలై, ఆటపట్టులై, ఆబాలగోపాలాన్ని అలరించినవి. నాటినుండి నేటివరకు వెలుగురేఖలై ఖ్యాతి గడించిన మేటి నటశేఖరులు, కీర్తిగడించిన కళాకారులు, రాణకెక్కిన రాజకీయ ప్రజ్ఞా దురంధరులు, ప్రతిభనిండిన పండితోద్దండులు, మన పల్లెసీమలలో ప్రభవించి, అల్లారుముద్దుగ, ఆడి, పాడుకొని, ప్రదీప్తులైన వారెందరోగలరు.

నట తపస్వి శ్రీ కర్నాటి లక్ష్మినరసయ్య నిజంగా అలాంటివారే. పుట్టినది రైతు కుటుంబం, పిన్ననాటి నుండి ప్రతివారి మన్ననలకు ప్రీతిపాత్రుడై. అందరిలో, అన్నిటిలో ప్రజ్ఞాపాటవములతో కలిసి మెలసి తిరిగి, ఎన్నెన్నో రంగములలో రాణకెక్కిన రస పిపాసిగా గణుతికెక్కినవారు, సాహిత్య నాటకరంగములలో తీవ్రసాధనా చతురుడై యిరుప్రక్కల సవ్యసాచివలె నిలిచినాడు. ఆయన హృదయం విజ్ఞాన తృష్ణకై పరితపించిన ఫలమే, యింతటి ఘనుడుగ గణుతికెక్క గలిగినది.

బడిపంతులుగ జీవితం సాగించిన శ్రీ లక్ష్మినరసయ్య, పల్లెజీవితం ఔపాసనబట్టి వుద్దండుడైన శ్రీ లక్ష్మినరసయ్య పట్టణ జీవిత శోభల వైపుకు నడిచి, యువజన సందోహానానికి తాను నమ్మిన,తాను తెలిసికొన్న సిద్ధాంతములు, రసగుళికలు, మ్రింగించ యత్నించాడు. రాత్రింబవళ్ళు నిర్విరామ కృషి సల్పి ప్రజానాట్య మండలిలో కాకలుదీరిన కళాకారుడై, బుర్రకథల పితామహుడని ఖ్యాతిగన్న శ్రీ నాజర్ ప్రక్కన వంతగా జీవితయాత్ర సాగించి, అశేష ఆంధ్ర ప్రజాకోటి అచ్చెరవొందునట్లు కథా కార్యక్రమములలో పాల్గొన్న అసమాన్యుడు, అమృత హృదయుడు. అటు తర్వాత జగత్ ప్రసిద్ధినొందిన ఆంధ్రుల జానపదరీతులలో అత్యున్నతమైన జముకుల కథలు, గొల్లసుద్దులు బహుజనము మెచ్చు బాణీలలో గళమెత్తి గానములుజేసి, స్వరములు పలికించిన నవరస భరితుడు.

అక్కడనుండి ఆయన చూపు, ఊపు నాటక కళా రంగంపై ప్రత్యేకింపబడ్డది. పలుపాత్రలు రంగస్థలముపై ప్రదర్శించి, పెద్దల, ప్రజల, ఆశీస్సులు, ఆదరణలు, ఆర్జించి తెలుగు రంగస్థలమునకే తీరుతెన్నులు దిద్దు ధీపటిమ సంతరించుకున్నారు.

ఆయన పాత్రల తీరుతెన్నులు స్వాభావిక సాధనల, ప్రేరేపణలతో, జనామోదమై నిండి, పండి, ప్రదర్శన రూపులో సాక్షాత్కరించగలవు. ఇందుకు వక్కటే కారణము. శ్రీ కర్నాటి లక్ష్మినరసయ్యగారిలో నిండి, నిబిడీకృతమై, కళాతృష్ణ, కార్యదీక్ష, దక్షత, గాక మరొకటిగాదు. రంగస్థలం ఆయన భావుకతలో అన్నివేళల సాక్షాత్కరించి, ఎప్పుడు యేమి చెయ్యవలయునో అది చేయుటకు ముందుకు వురికించగలదు- ప్రయోక్తగా వందలు నాటకములు రంగస్థలములపై ప్రదర్శించునట్లుజేసి శెభాష్ అనిపించుకున్నారు. అంతకు మిక్కలి వేషధారణలు గావించి ఆంధ్రదేశములో ప్రేక్షకుల హృదయములపై చెరగని ముద్రలు వేశారు.

శ్రీ కర్నాటిలో నటలోకము నేర్చుకొనవలసిన ముఖ్యాతి ముఖ్యమైనవి- వాచకము- పాత్ర స్వభావము, రంగస్థలములో పాత్ర ప్రవేశము- సమయ

చతురత- హావ భావములు, ముఖ్యముగా ఆయన రూపం. ప్రతి రంగస్థల నటునికి పై విషయపరి జ్ఞానము అత్యంత ముఖ్యం.

ప్రతి విషయమూ కూలంకషంగ చర్చించిన అనంతరమే, ప్రతిపాదించి, నిర్వహించడం ఆయన ముఖ్యోద్దేశం. తోటి కళాకారులన్న, సాహిత్య రస పిపాసులన్నా అత్యోన్నత గౌరవము. ఎందరికో దీవెనలందించి, ప్రోత్సాహ ప్రోద్బలములు ప్రోదిజేసి ఆంధ్రదేశము నలుమూలలు కలియదిరిగిన కార్య చతురుడు. అందరిని గౌరవించి, అందరి మెప్పులతో సాగి ముందుకు నడుచు సరస హృదయుడు. ఆయన భోగులకు, త్యాగులకు, భావుకులకు, అందరికి సన్నిహితుడే!

శ్రీ కర్నాటి దాదాపు 10 సంవత్సరాలనుండి ఆంధ్ర నాటక కళాసమితి (విజయవాడ) కార్యదర్శిగ విధి నిర్వహణలు భరించి, ఆ సమితికి ఎన్నెన్నో రూపురేఖలుదిద్ది తీర్చి దినదినాభివృద్ధి గావించి అందరిచే గౌరవించబడుతున్నారు. ఆయనకు నా కళాభివందనములు.

★★





పట్టియ్య నాటక సందర్భమున శ్రీ కర్నాటిని సత్కరిస్తున్న, ది బెజవాడ జ్యూయలర్స్ & బులియన్ మర్చంట్స్ అసోసియేషన్ అధ్యక్షులు శ్రీ సజ్జా కోటిసూర్య ప్రకాశరావు చౌదరిగారు.

# తెలుగు నాటక రంగము : తీరుతెన్నులు

— ముళ్ళపూడి తిమ్మరాజు

గత శతాబ్ది చివరి భాగములో, శ్రీ ధర్మవరం కృష్ణమాచార్యులుగారు, తమ చిత్రనళీయ నాటక ప్రస్తావనలో ఆంధ్ర నాటకరంగమభివృద్ధి కాలేదనియు ప్రేక్షకుల నాకర్షింపగల నాటక ప్రదర్శనములుగాని, రచనలుగాని తెలుగునాట లేవనియు, అంతియేగాక, తెనుగు నాటకమున కెత్తిన భాష భాషయే కాదను అభిప్రాయం పలువురకు కలదనియు, ఆ కొరత తీర్చుటకు తాము నాటకమును రచించి ప్రదర్శించుచున్నామను భావమును వెల్లడించియున్నారు. అది సరి కాదని మనవి చేయుచున్నాను. ఆచార్యులవారున్నది ప్రధానముగ కన్నడము స్వభాషగాగలవారు పెక్కురున్న బళ్ళారి మండలము. అక్కడ మహారాష్ట్రము మాతృభాషగాగల వారును బహు సంఖ్యాకులు. అట్టి ప్రాంతములలో తెనుగు నాటక ప్రదర్శనములు లేకపోవుట సహజమే. కన్నడ, మహారాష్ట్ర భాషలలోని నాటకముల కలవాటుపడిన వారికి తెనుగు నాటకములున్నవా ? నాటక ప్రదర్శనముల కాస్కారమున్నదా? అను సందేహము కలుగవచ్చును.కాని ఆకాలముఅంతకు పూర్వమున ముఖ్యముగా ఆంధ్ర తీరప్రాంతములందు ప్రఖ్యాతిగన్న నాటక సమాజములు వెలసినవి. ఆసమాజముల ఆధ్వర్యమున ప్రతిభావంతులగు నటకులు ప్రేక్షకజనమును రంజింప చేయుచునే యుండిరి.

ఈ విషయము కృష్ణమాచార్యులవారికి తెలియనిది కాదు. ఇక్కడి నాటకములు, ప్రదర్శనములు అభినయ ప్రధానములైనవి. బళ్ళారి, ధార్వాడ ప్రాంతములలోనినాటకములుసంగీత ప్రధానములైనవి. పాటల కలవాటు పడినవారికి కేవలము మాటలచే భావ ప్రకటనము రుచింపక పోవుటయేకాదు, గుర్తింపను లేకపోవచ్చును. కృష్ణమాచార్యులుగారు వెలిబుచ్చిన అభిప్రాయమునకిదికూడ కారణము కావచ్చును.

విజయనగర గజపతుల పోషణలో వెలసిన నాటక సమాజ ప్రదర్శనములలో సేది కాశీనాథ శాస్త్రిల వారు స్త్రీ పాత్ర ధరించెడివారట. వారు మహా విద్వాంసులు. సంగీతమురాదు. అట్లే రాజమహేంద్రవరంలోని ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారి ఆధ్వర్యమున వెలసిన నాటక సమాజములో ప్రముఖ రాజకీయవేత్తలు, ఆంధ్రప్రదేశ్‌కు మొట్టమొదటి ప్రధానామాత్యులు టంగుటూరి ప్రకాశం పంతులుగారు స్త్రీ పాత్ర ధరించెడివారు. వీరికి సంగీతము రాకపోవుటచే, ఆ సమాజమునకు రచించిన నాటకములలో నాయికా పాత్రలకు పద్యములు పెట్టలేదు, రచయిత చిలకమర్తి లక్ష్మీనరసింహగారు. అట్లే బందరులో ప్రతిభావంతులగు యీమని లక్ష్మణస్వామిగారు నాయకపాత్ర ధరించెడివారట. కానీ అభినయము ప్రేక్షకులను నివ్వెర గొల్పెడిదట. విశ్వామిత్ర తపోభంగమును వారు ప్రదర్శించినప్పుడు, విశ్వామిత్రునిగా, వీరు మేనక పాత్రధారిణిపై వారి మోహపరవశమైన చూపు తనువే పులకరింపజేసినదని, వారితో మేనకగా నటించిన కోపల్లె హనుమంతరావు గారు చెప్పెడివారు. వీరిద్దరకును సంగీతము రాదు.

ఇంతటి ప్రతిభావంతులే ఆ కాలములో పేరుగాంచిన వేదురుమూడి శేషగిరిరావుగారు. శృతితో కలిపి పద్య

మనుటయేగాని వారికి రాగజ్ఞానములేదు. వారి రాజు వేషము చూపరుల కబ్బురము గొలిపెడిది. వారు మొదట పిఠాపురము రాజాస్థానానికి చెందిన శ్రీ రాణీ చెల్లయ్యమ్మారావుగారి నాటక సమాజమున కధినేతగా నుండి మన ప్రాంతములందేగాక, బర్మాలోకూడ ప్రదర్శనములు గావించిరి. వారు కొంతకాలము మా తణుకులో ఉద్యోగరీత్యా మా నాయనగారు శ్రీ ముళ్ళపూడి వెంకట్రాయుడిగారి ఆహ్వానముపై వచ్చి యుండిరి.

అంతకు పూర్వము ధార్వాడ కంపెనీవారు మా యూరిలో కొన్ని ప్రదర్శనల నిచ్చియుండిరి ఆ ప్రదర్శనల ప్రభావముచే మా యూరిలో కొందరు ఉత్సాహవంతులగు యువకులు, అప్పటి పురప్రముఖులలో నొకరగు కాట్రావులపల్లి నారాయణరావుగారి నేతృత్వమున యిక్కడ నొక నాటక సమాజమును నెలకొల్పి కొన్ని రంగస్థల పరికరములు సంపాదించుకొని, ప్రదర్శనలను గావించి వారి శక్తికొలది ప్రజలను రంజింప ప్రయత్నించిరి. ధార్వాడ కంపెనీవారు, రెండవసారి తిరిగి యీ గ్రామములో ప్రదర్శనల నిచ్చుటకువచ్చినప్పుడు పూర్వపు స్నేహముచే నిక్కడి నటులకు తమ రంగాలంకరణములను బహూకరించి యుండిరి. వాటితో ఎట్లో ఈ నాటకసమాజము నామ మాత్రముగనే జీవించుచున్న స్థితిలో, వేదురుమూడి శేషగిరిరావుగారు మా యూరివారైరి. వారు ఈ సమాజమును జీవింప చేయుటయేగాక, మరికొందరు యువకులనుకలుపుకొని, హరిశ్చంద్ర, ప్రసన్నయాదవము, నర్మదాపురుకుత్సీయము మొదలగు నాటకములను ప్రదర్శించి, ఈ ప్రాంతపు ప్రజల యభిమానమును చూరగొనిరి. ధార్వాడ కంపెనీవారిచ్చిన తెరలు మొదలైనవి నిరుపయోగములగుటచేతను, ప్రదర్శనానుకూలము గాకపోవుటచే, శేషగిరిరావుగారి ప్రోత్సాహమున, మా యూరిలోని ఔత్సాహిక చిత్రకారులు, యరగొర్ల కృష్ణమూర్తిగారు తెరలను చిత్రించి, అట్టలతోను, కర్రపలకలతోను, పూలచెట్లు, కొండలు మొదలైనవి కల్పించి, రంగాలంకరణమున కొంత వాస్తవికత చేకూర్చిరి. వారిక్కడ న్యాయవాదిగ నుండెడివారు.

ఈ సమాజములో స్త్రీ పాత్రధారులు, తురగా పేర్రాజు, ఇటికాల వెంకటేశ్వర్లుగారలు. వీరిలో వెంకటేశ్వర్లుగారు మొదట రాజమండ్రిలో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి నాటకసమాజములో నుండెడి వారు. వారి ప్రసన్నయాదవ నాటకమీ యూరిలో ప్రదర్శించినప్పుడు, సత్యభామ పాత్రను ధరించుటకు వెంకటేశ్వర్లుగారు యెరవుగావచ్చి యిక్కడనే స్థిర పడిరి.

వీరి నాటక ప్రదర్శనములలో చెప్పుకో తగ్గవి బొబ్బిలి యుద్ధము, హరిశ్చంద్ర, పీష్వా నారాయణ రావు వధ ముఖ్యములు. బొబ్బిలిలో శేషగిరిరావుగారు హైదరుజంగు పాత్ర ధరించెడివారు. హైదరుజంగుగా వారి నటనాచాతుర్యము ప్రేక్షకులను ముగ్ధులగావించెడిది. ముఖ్యముగా యుద్ధానంతరము, శిబిరమంతయు నిద్రలోనుండగా, తాండ్ర పాపారాయుడు అకస్మాత్తుగా ప్రవేశించి, విజయరామరాజును చంపినప్పుడు, హైదరుజంగు ఆరాటము సైనికులను పురికొల్పుటలో వారి అభినయము వర్ణనాతీతము.

పానుగంటివారి నాటకములన్నియు, ముందుగ నిక్కడనే, లక్ష్మీనరసింహారావుగారి పర్యవేక్షణమున ప్రదర్శింపబడు చుండెడివి. కొన్ని ప్రచండచాణక్యము కోకిలవంటివి, పిఠాపురం దర్బారులో ప్రదర్శింపక పూర్వమే యిక్కడ రంగస్థలమున కెక్కినవి. వారి ప్రథమ రచన నర్మదాపురుకుత్సీయము. ఇక్కడగాక వేరొకచోట ప్రదర్శించినట్లు వినలేదు. ఆ నాటకములో నర్మదను, పురుకుత్సుడు దేవలోకము నుండి తీసికొని వచ్చుటకు దేవేంద్రుని సభకు పోయిన రంగము మరపురానిది-నర్మదా, పురుకుత్సుల ప్రేమను పరీక్షించుటకు, నర్మదను శిలాప్రతిమయని భ్రమింప చేసినప్పుడు పురుకుత్సునిగా శేషగిరిరావుగారు అభినయము, నర్మదగా వెంకటేశ్వర్లుగారి నటనాకౌశలము ప్రేక్షకులను ముగ్ధులు గావించెడిది. శేషగిరిరావుగారు హరిశ్చంద్రునిగాను, పేర్రాజుగారు చంద్రమతిగాను నటించెడువారు రాత్రి అంతయు ప్రదర్శనము జరుగుచునే యుండెడిది. కాని చివరివరకు హాలు క్రిక్కిరిసియే యుండెడిది. చంద్రమతి హరిశ్చంద్రుని గుర్తించు సన్నివేశములో ప్రేక్షకులలోకంటతడి పెట్టనివారుండెకి వారుకాదు. షేక్స్పియరువ్రాసిన కింగులియరు, ఒథెలో

లతో తులతూగగలిగిన ట్రాజెడీ (Tragedy) హరిశ్చంద్ర యని శేషగిరిరావుగా రనుచుండెడివారు. తన యందభిమానము లేనివారి యెడల అభిమానముంచుటయే లియరు విషాద జీవితమునకు బీజము. చెప్పుడు మాటలు విని, అదే నిజమనుకొని వ్యవహరించుటయే ఒథెల్లో జీవితము విషాదాంత మగుటకు కారణము. అనగ బుద్ధి మాంద్యము ట్రాజెడీకి కారణమయ్యెనక్కడ. హరిశ్చంద్రుడు సత్యవాక్పరిపాలనము తన జీవిత లక్ష్యమునకై బుద్ధిపూర్వకముగ కష్టములకు లోనైనాడు ఇక్కడ ట్రాజెడీకి బీజము ఆత్మ విశ్వాసము. ఈ భావమును స్ఫురింపజేయుటకే నా ప్రయత్నమని శేషగిరిరావుగా రనుచుండెడివారు. హరిశ్చంద్రుని గ వారిని చూచినవారికి వారి గాంభీర్యతలో యీ భావము స్ఫురించెడిదని చెప్పగలను.

మా యూరివారు గనుక, మా నటకులని పొగడు చుంటినని భావింపవద్దని వేడుకొనుచున్నాను. ఆ కాలములో ప్రథమశ్రేణికి చెందిననాటక సమాజములు రెండు మూడింటిలో నిది యొకటి యగుటచేతనే నే నింతగా చెప్పుట. ఈ కీర్తియే వారి కరిష్టదాయక మయ్యెను. వారిపై యీర్ష్యగల నాటక సమాజము లెన్నియో యుండెడివి. నిడదవోలులో వారు హరిశ్చంద్రను ప్రదర్శించుచున్నప్పుడు యీర్ష్యాళువు లెవరో నాటక శాలకు నిప్పుబెట్టిరి. సమాజ పరికరము లన్నియు దగ్ధములైనవి. దానితో నాటక సమాజ మంతరించినది శేషగిరిరావుగారు మా యూరు విడచి మదరాసు ఆంధ్ర పత్రికా సంపాదకవర్గములో చేరిరి.

నే నింతవరకు వ్రాసినది, సంగీతమంత ప్రధానముగా నెంచక, నటనా కౌశలముచే మనోరంజకములగు ప్రదర్శనము లీయగల నాటక సమాజములు తెనుగునాట నుండెడినని చూపుటకే. కాకినాడ సింగితం అబ్బాయిగారి నాటక సమాజం విశాఖపట్నంలో విక్రమ దేవవర్మగారి జగన్మిత్ర నాట్యమండలి, గుంటూరు ఫస్టు సెకండు కంపెనీలు, వీటిని వీటిలోనున్న ప్రముఖ నటుల గురించి చెప్పుటయన్న పెద్ద చరిత్రనే వ్రాయవలసి యుండును.

రానురాను ప్రతిభావంతులగు కళాకారులు లేకపోవుటచే జనులను రంజింపజేయుటకు సంగీతము ప్రధానమయ్యెను. వివిధ రాగములలో రాగప్రస్తారమే ప్రధానముగచేసి పద్యములను పాడుటయేగాదు, తాళప్రస్తారముతో కూడిన పాటలు, హిందూస్థానీ పట్లు నాటక ప్రదర్శనముల లోకి వచ్చినవి. సంభాషణలలో వచ్చిన పాటలు పద్యములు పాడుటకు నటకులు స్టేజి ముందుకువచ్చి, అక్కడ నుండెడి హార్మోనియమ్, తబలాల సహాయముతో ఒక చిన్న పాటకచ్చేరీ చేయుట పరిపాటి అయినది. సభికులలో నెవరైనా వన్సుమోర్ అన్నచో ఇక చెప్పెడిదేమి; ఒక అరగంట కచ్చేరీయే. అసలు నాటకము మాట దేవుడెరుగును.

ఇట్టి సందర్భములలో నాటకములో పద్యము లుండకూడదు, ఏవియో కొన్ని యున్నను వాటిని వచనమువలెనే భావస్ఫోరకముగ చదువుటకు వీలైనవిగా నుండవలెనను వాదము బయలుదేరెను. పానుగంటివారు తమ నాటకములలో గీతములను వ్రాయుట అవి వచనముతో సమానముగ నుండునని యు వారే చెప్పియున్నారు. వారి మొదటి నాటకము, నర్మదా పురుకుత్సీయములో వారు వివిధ వృత్తములలో వాడియే యున్నారు. నాటకమన్నది నిత్యజీవితమునకు ప్రతిబింబమగుటచే, పద్యమునకు గాని పాటకు గాని స్థానమెక్కడ యన్నది వీరి వాదము.

కాని నాటకమన్నది యొక కళ యన్నమాట వీరు గమనింపలేదని నా మనవి. నిత్యజీవితముకోని కొన్ని విషయములను ఏర్చి కూర్చి, యొక భావనామయ చిత్రమును నిర్మించి మనయెదుటపెట్టి తద్వారా తన యనుభవముల వ్యక్తముచేయుటకు కళాకారుడు ప్రయత్నముచేయును. అట్టి భావ చిత్రణములు (Significant form) ఒక భావనామయ జీవితమును కదల్చి, మన యందున అనురూపమైన అనుభవమును కలిగించును. నాయకునకు, కవికి, శ్రోతకు అనుభవము, సమానమై యుండుననికదా చెప్పుచుందురు. నాటక కళలో యొక విశేషమున్నది. రంగస్థలమునందుండి నటకులు వారి వేషభాషలచేతను, అభినయాది చేష్టలచేతను మనతో సంబంధం కల్పించుకొని వారి భావములు వ్యక్తము చేయుచుందురు. నిత్య జీవితములో మనముచూచు సన్నివేశములు, భావ సంచలనము కలుగజేయవు. నాటకరంగములో కళాకారులు కల్పించిన కృత్రిమ

వాతావరణములో వాటిని జూచునప్పుడు మన హృదయము కంపించును. నిత్య జీవితములో మన భావములు వ్యక్తముచేయు చేష్టలను (actions) భావములనే మన మనస్సుల కెక్కించుటకు నటుని అభినయ చేష్టలలో నొక విశిష్టత యుండినగాని, తన నటన భావచిత్రణము కానేరదు. ఇట్టి తరి, ఒకప్పుడు పద్యముచేతను, పాటచేతను నటకుడు మనతో సంబంధము కల్పించుకొని నాటకములోని తన పాత్ర కనురూపమైన అనుభవమును వ్యక్తము చేయుచుండును.

ఉదాహరణకు, పానుగంటివారి పాదుకా పట్టాభిషేకములో "రామా రాఘవా అని పిలచినప్పుడు ఎగిరి గంతిడుచు" అన్న సీస పద్యమును అద్దంకి శ్రీరామమూర్తిగారు రాగయుక్తముగ పాడినప్పుడు, దశరథుని మమత, పుత్రప్రేమ, ప్రేక్షకులకు తెలియకుండగనే వారి కనుభవమగుచుండెను. అట్లే తులాభారములో "భలే మంచి చౌకబేరము" అని పాడుచు కపిలవాయి రామనాథశాస్త్రిగారు శ్రీకృష్ణుని అమ్మజూపినప్పుడు, ఆ సన్నివేశము వేళాకోళమని యు కేవలము సత్యభామకు జ్ఞానోదయము కలిగించుటకే యన్నది స్పష్టమగుచుండెడిది. ఇట్లే శకుంతల నాటకములో, శకుంతలగా, స్థానం నరసింహారావుగారు "ఏలవీతువమ్మానాకు" అన్న పాట పాడుచు తన చెలికత్తెలను వారించునప్పుడు ఆమె మనోభావము ప్రేక్షకుల కనుభవమగుచుండెను. పైన చెప్పిన ఉదాహరణలిప్పటి తరము వారికి తెలియకపోవచ్చును. కాని అవి రికార్డులై యుండుటచే, వాటిని వినినప్పుడైన ఆ సందర్భములు వారికనుభవమునకు రాగలవనియే నేనెంతును.

కాని ఒక సన్నివేశములో తానూహించుకొన్న భావమును వ్యక్తీకరించుటకు కవి వ్రాసిన పద్యమును గాని పాటనుగాని నటకుడుపయోగింపక తన యభినయముచేతనే భావ చిత్రణము కావించుచుండును. ఇట్టిది మిక్కిలి ప్రతిభావంతులగు కళాకారులకుగాని సాధ్యముకాదు. ఉదాహరణకు, చిత్రనళీయ నాటకములో బాహుకుడుగ నటుడు విదర్భరాజు అంతఃపురముననున్నప్పుడు, భారతియను దమయంతిచెలికత్తె బాహుకుడు నలుడోకాడోయని పరీక్షించుటకు అతని యొద్దకు అతని కుమారుని ఇంద్రసేనుని తీసికొని వచ్చును. ఈ సందర్భములో ఆచార్యులవారు ఇంద్రసేనునకు రెండు పద్యములు పెట్టిరి. అవి ఆ పాత్రను ధరించిన బాలుడు కంఠమెత్తి పాడునప్పుడు ప్రేక్షకులందరు సంతోషముతో నోలలాడుచుందురు. కన్నతండ్రికి అట్టికుమారుడు ముద్దు వచ్చుటలో అబ్బురము లేదు. ఈ భావము వ్యక్తము చేయుటకు ఆచార్యులవారు అక్కడ "వాచాసుఖ వ్రాత నక్షత్రపంక్తికి తనయుడే కుముద బాంధవుడు సుమ్ము" అని ప్రారంభించు సీస పద్యమును వ్రాసిరి. ఈ సన్నివేశమును ప్రదర్శించునప్పుడు హరిప్రసాదరావుగారు, దబ్బున ఇంద్రసేనుని సమీపించి, ఆ బాలునెత్తుకొని యీ పద్యము పూర్తిగ చదివెడివారు. సభ్యులు కరతాళ ధ్వనులచేతను తృప్తిని తెలిపెడివారు.

బళ్ళారి రాఘవగారీ సందర్భమున పద్యమును చదువనే చదువరు చిరునవ్వు తొణికిసలాడెడి ముఖముతో తమ సంతోషమును వెలిబుచ్చుచు, చేతులు చాచి, స్టేజిమీద కొంత దూరము పోయి, చటుక్కున తాము బాహుకునిగనున్న విషయము తెలుప గూడదనుభావము స్ఫురించుటచే నాగినట్లు ఆగి వెనుకకు తిరిగి బరువుగ నడుగులువేయుచు స్టేజి చివరకు పోయెడివారు. ఈ దృశ్యము చూచినప్పుడు ప్రేక్షకులు తన్మయులై కంట తడిపెట్టని వారుండెడివారుకాదు. అప్పుడు తెర దించినతర్వాత, యీ సన్నివేశములో రాఘవగారి అద్భుత నటనాకౌశలము గుర్తుకువచ్చి సభికులలో కరతాళధ్వనులు చెలరేగెడివి.

ఇంతకు పూర్వము, ఋతుపర్ణుని యింట బాహుకునిగా వారున్నప్పుడు, రాత్రి తన వంటపని ముగిసిన తర్వాత, తన పూర్వచరిత్రను జ్ఞాపకముచేసికొనుటలో గ్రంథకర్త రచించిన నక్షత్రమాలయను యిరువది యేడు పద్యములను పూర్తిగ చదివిన రాఘవగారు ఇక్కడ పద్యమును వదలుటలోగల స్వారస్యము విశదము కాగలదు. రాఘవగారికి సంగీతమురాదు. అయినప్పటికిని పద్యమును చదువుటలో వారి ప్రతిభ అద్భుతముగా నుండెడిది. ఇంకొక యుదాహరణము యీయకుండ నుండజాలను. ప్రహ్లాద నాటకములో హిరణ్యకశిపునిగ వారు, నాటకపు చివరి యంకములో–

"ఇంద్రుడే దల నా మోలనెత్తి వెరచు, ఏల వెరవవు బాలకా నీ కేది దిక్కు" అన్న పోతనగారి పద్యము ను చదువుచు, ప్రహ్లాదుని ప్రశ్నించుచు, రంగస్థలము నందంతటను తిరుగాడుచు, ప్రారంభములో క్రోధముచే గంభీరతదాల్చియున్న కంఠస్వరమును క్రమ క్రమముగ హీనముగావించి చివరకు గద్గదికతో ముగించుటలో హిరణ్యకశిపుని హృదయ పరివర్తనము వ్యక్తము గావించెడి సన్నివేశము మరువ రానిది. నరసింహావతార రహస్యమును వారు వ్యక్తీకరించిరాయను భావము స్ఫురించును. ఈ సన్నివేశమీ తరమువారికి తెలియని దగుటచే విస్తరించి వ్రాసియున్నాను. నాటకములో పద్యము లుండరాదను వాదము సమంజసం కాదనుటకే నేనింత వ్రాసినది.

నాటకకళ యొక్క సహకారసంస్థ. కవి, నటకుడు, దర్శకుడు, సూత్రధారి, యింకను పలువురు రంగాలంకరణకు కావలసిన వ్యక్తులు, వీరితోబాటు ప్రేక్షకులును కలిసినగాని నాటకము పరిపూర్తికానేరదు. పైన నేను వ్రాసినదానిలో చిత్రనళీయ కర్తభావము హరిప్రసాదరావు వ్యక్తీకరించుటకు ఆ పద్యము నుపయోగించిరి. దానిని గైకొనకయే రాఘవగారు గ్రంథకర్తభావమును ఇనుమడిగా ప్రస్ఫుటము గావించిరి. ఇట్టి పని ప్రతిభావంతులగు కళాకారులకు సాధ్యము.

ఎంతటి ప్రతిభావంతులైనను కవి భావమును గ్రహించుటలో నొకప్పుడు పొరబడుటయు సంభవించును. కవి వ్రాసిన పద్యమున కాతడుద్దేశింపని భావమును నటకుడు తానా పద్యమును చదువుటచే వ్యక్తీకరించినను, ప్రతిభగల నటకుడు రసస్ఫూర్తిని కలుగజేయగలడు. ఉదాహరణ కొకటి మనవి చేయుదును.

చిలకమర్తివారి గయోపాఖ్యానములో బందరు. ఇండియన్ డ్రమెటిక్ అసోసియేషన్‌వారి ప్రదర్శనములలో ఆ సమాజ అధినేత డి. వి. సుబ్బారావుగారు అర్జునపాత్ర ధరించెడివారు. – అర్జునుడు గయునకభయమిచ్చు సన్నివేశములో కవి "నిటలాక్షుండిపు డెత్తి వచ్చినను రానీ" అను పద్యమును వ్రాసిరి. అంతకు ముందు శ్రీకృష్ణుడు గయుని చంపెదనని ప్రతిన బూనిన సందర్భములో, కృష్ణునికి వారు "చతురానన పంచానన, షడానన, పాశాయుధ, వజ్రాయుధ" మొదలగు పదములుపయోగించి ఎవరడ్డుపడినను గయుని చక్రాయుధమున కెరచేయుదునని చెప్పుటకు వచనమునే వాడిరి. అది కృష్ణపాత్రధారి ఆ గంభీర శబ్ద సమన్వితమగు వచనమును ఉన్నచోట నుండి కదలకయే చెప్పవచ్చును. కాని అర్జునుడు పద్యమును చదువవలెను. సుబ్బారావుగారు అనితర సాధ్యమైన శ్రీరాగములో నా పద్యము నెత్తుకొని, క్రోధభావమును ప్రస్ఫుటము చేయుచు, రంగస్థలములో పరిక్రమించి, ఆ పద్యమును చదివి గయుని వీపుపై చరచినప్పుడు తృప్తితో ప్రేక్షకు లుప్పొంగుచుండిరి. ఒకనాడు వారు గుంటూరులో గయోపాఖ్యాన మాడినప్పుడు, సుప్రసిద్ధులగు హరిప్రసాదరావుగారు స్టేజి సైడు ఫేసులోనుండి వీరి ప్రదర్శనను తిలకించిరట. "నిటలాక్షుండిపు పద్యము వారు పాడినప్పుడు, అందరితోబాటు వారును చప్పట్లు చరచి ఆయన కుత్సాహము కలిగించిరి.

కాని మరునాడు ఆ ప్రదర్శనమును సమీక్షించుచు ప్రసాదరావుగారు చిరునవ్వుతో, సుబ్బారావుగారిని జూచి "నాయనా, ఆ పద్యము సవాలుకాదు. తన కెంతటి కష్టము వచ్చినను, తనకు పాశుపతము ప్రసాదించిన శివుడే సాక్షాత్ తనపైకి వచ్చినను, తన అన్నదమ్ములు తన్ను విడనాడినను చిన్నప్పటినుండి తనకు సఖుడై తన బాగోగులు కనిపెట్టుచున్న కృష్ణుడేవచ్చి అర్థించినను అన్నింటికి లోనుగాక గయుని రక్షించెదనని అతని నిశ్చయము తెలియజేసి గయునికి ధైర్యము చేకూర్చుటయే ఆ పద్య ప్రయోజనము. గాంభీర్యములో తన హృదయములోని ఆరాటమును వ్యక్తము చేయుచు ఆ పద్యమును చదువవలె"నని చెప్పి, తాము ఆ ఘట్టము నభినయించి చూపిరట. సుబ్బారావుగారు ఆ ప్రయోగ విధమును రిహార్సల్స్‌లో అభ్యసించినను, ప్రదర్శనములో స్టేజిమీద వెనుకటి అలవాటునే అనుసరించుట జరుగుచుండెనని వారే ఒకసారి చెప్పియుండిరి. సుబద్ధమైన శారీరముతో, సుస్పష్టమైన రాగభావముతో, సందర్భశుద్ధిగ పద్యములు చదువుటలో సాటిలేనివారని ప్రఖ్యాతి గడించినవారు డి. వి. సుబ్బారావుగారు.

నేను పైన వ్రాసిన సన్నివేశములను చూచినవారును వాటిని పలుమారు జ్ఞప్తికితెచ్చుకొని అప్పటి ఆనంద మనుభూతికి తెచ్చుకొనువారు పలువు రిప్పటికిని యున్నారు. ఆ రోజులలో తెనుగు నాటకరంగములలో పరాకాష్టకు చెందినదని చెప్పజాలనుగాని, దక్షిణ హిందూదేశములోని నాటక రంగములలో ప్రథమ స్థాన మాక్రమించి యుండెనని నిస్సందేహముగా చెప్పగలను.

కాని యిప్పటి పరిస్థితులు జూచినప్పుడు వెనుకటి యుత్సాహము లేదు సరికదా, నాటకకళ నామమాత్ర ముగనైన లేదేమో యని తోచును. ఇది తెనుగునాటనే కాదు. ఇతర దేశములయందును యిట్లే యున్నదని మనలను మనమే యూరడించుకొనుచున్నాము గాని పరిస్థితిని చక్కబరచుటకు ప్రయత్నముకూడ చేయక పోవుట శోచనీయమే.

టాకీల ప్రభావమువల్ల నాటక ప్రదర్శనములు వెనుకబడిన మాటసత్యమే ఎక్కడనైన పూర్వము జనాదరణము పొందిన నాటకప్రదర్శనములున్నను, టాకీ ప్రపంచములోగాని రేడియోలోగాని పేరుపొందిన (ఒకొక్కప్పుడు, పేరుపొందిన వారే కారుక్కరలేదు. ఏ చిన్నపార్టు ధరించిన వారైనను చాలు) వారు పాల్గొనుటవల్లనే యివి ఆకర్షణీయము లగుచున్నవి. ఈ ప్రదర్శనములలో పాల్గొనువారు వివిధ ప్రదేశముల నుండి ఆరాత్రి కొకచోట కూడినవారగుటచే వారికి తమ కంట్రాక్టును నిర్వర్తించుకొనుటకే ప్రయత్నము, అంతియేకాని నాటకకళను పోషించు దృష్టియుండదు. ఇట్టి ప్రదర్శనములలో ప్రేక్షకులను కళాప్రౌఢిమను గాని అభినయ విదగ్ధతనుగాని కోరుటలేదు. సినిమా తెరమీద ఛాయా విగ్రహములుగ కన్పడినవారు తమ యెదుట సజీవముగ మెలుగుటనూ చూచుటయే వారు కోరునది. ఇక ప్రదర్శనములున్ననూ "ముచ్చటైన మూడువందల పద్యములు" చదువుటయేగాని భావ ప్రకటనము మృగ్యము.

దీనికి కారణము లేకపోలేదు. ఫిల్ములలోవలె రంగ స్థలమునకు వాస్తవికతను చేకూర్చి సంతృప్తికరము లగు ప్రదర్శనములీయగల నాటక సమాజములులేకుం డుటయేకారణము. సమర్థవంతులగు నటకులు ఫిల్ములకే పోవుచున్నారుగాని నాటక కళయందు వారు దృష్టి నుంచుటయేలేదు. పెద్ద పెద్ద సెట్టింగులను కూర్చి, ప్రదర్శనలిచ్చుటకు ప్రయత్నించు ధనవంతు లక్కడక్కడ యున్నను, ఆ సెట్టింగుల మధ్య నటకుని చర్యల ప్రధానములే యగుచున్నవి. ప్రేక్షకుల దృష్టి అంతయు సెట్టింగుల తళతళలపైననే యుండును.

పూర్వ నాటక ప్రదర్శనములలో, నాటకకర్త సంకల్పించిన ప్రదేశము వాస్తవికముగ నెదుట కన్పిం పకపోవుటచే, నటకుల మాటలచేతను, అభినయ సాహాయ్యమునను ప్రేక్షకు లూహించుకొని భావ చేతన యందు కల్పించుకొనుట కవకాశముండెడిది. ఈ ప్రయ త్నములో నాతనికేకాగ్రతచేకూరి, సహృదయదృష్టితో ప్రదర్శనమును తిలకించి రసాస్వాదనము చేయగలిగెడి వాడు. ఇప్పటి ప్రదర్శనములలో టాకీసీనుల కలవాటు పడుటచే భావనకు (Imagination) అవకాశమే లేకుండా పోయినది. పై మెరుగు వినోదము తోడనే అతనికి తృప్తికలుగుచున్నది. పూర్వపు నాటక ప్రదర్శ నములన్న అతనికి విసుగు కల్గుట సహజమే.

ఇప్పుడిప్పుడు నాటక కళాభిమానులు కొందరు నాటక పోటీలను నిర్వహించుచు, నటకులకు, ఉత్తమ ప్రదర్శనలకు, ఉత్తమ రచయితలకు విరివిగ పారి తోషికము లిచ్చి యీ కళను ప్రోత్సహింప ప్రయ త్నించుచున్నారు. ఇట్టి కార్యక్రమములు యావద్భారత దేశ స్థాయిగ నున్నట్టును వినుచున్నాము. ప్రభుత్వము వారి ఆధ్వర్యమున నిర్వహింపబడు నాటక పరిషత్తు లున్నవి, కాని ఫలితము సామాన్యమే.

ఈ పరిస్థితికి కారణ మరయుట అంత కష్టము కాదు. అన్య దేశీయ సంస్కృతీ పరిచయముచేతను, ఇతర ధర్మముల అనుకరణ వలనను, కళ యొక్క ప్రయోజనమే మారినది. బ్రహ్మానందముతో సమాన మైన రసానుభవముచే మానవుని అంతరంగము విక సింపజేసి, ఆతని ఆధ్యాత్మికాభ్యుదయమునకు కళా స్వాదనము సహాయకారియగు ప్రయోజనము సంకుచిత మని యిప్పటివారిలో పలువురి అభిప్రాయము. మానవ సమాజాభ్యుదయము, ముఖ్యముగ దళిత ప్రజల సాంఘిక ఆర్థిక జీవితమును ప్రగతి పథమున కెక్కిం చుటకు సహాయపడని కళకు స్థానమే లేదని వారం

దురు. కళ వినోదమునకు కాదని వారి వాదన. అది నిజమే – వినోదమునకు కాదు.

కాని సామాన్య జనుడు తన నిత్య జీవితపు ఒడి దుడుకులలో విశ్రాంతికై వినోదమునే కోరును. ఆ ప్రయోజన మాతనికి ప్రస్తుతము సినిమావల్ల నెరవేరు చున్నది. అట్టి వినోదముతోబాటు సంస్కృతిని, బుద్ధి వైశద్యమును ఆతనికి సంపాదింపగల కళా కార్య క్రమములను సామాన్యుల కందజేయుట యిప్పటి కవుల, రచయితల, నాటక ప్రయోక్తల (Producers) కర్తవ్యమై యున్నది. అభ్యుదయ కవుల రచనలు సామాన్యముగ ప్రచారమునందే పర్యవ సానము చెందుచున్నవి. ప్రస్తుత పరిస్థితులపై తన దృష్టిని కేంద్రీకరింపజేసి, వాటియందు మార్పుతెచ్చు టయే యీ రచనల లక్ష్యమగుటచే నవి తాత్కాలిక ప్రయోజనములే. శాశ్వతానందము చేకూర్చజాలవు.

ఇట్టి పరిస్థితులలో మన నాటక రంగమును పునరు జ్జీవింప జేయుట ఎట్లన్నది ప్రశ్న. పాశ్చాత్య కళా ప్రపంచమునందును ఇట్టి సమస్యయే సహృదయుల దృష్టి నాకర్షించుచున్నది. ఈ సమస్య పరిష్కారము నకు తగు విధానము విద్వాంసులు నిర్ణయించవలసి యున్నది. నాబోటివానికది సాధ్యంకాదు. అయినను యితరులతోపాటు నేను ప్రదర్శనములను జూచుట యందాసక్తి గలుగుటచే నా అభిప్రాయములను సూచింతును. అవి ఎంతవర కాచరణ యోగ్యములో విజ్ఞులు పరిశీలింతురుగాక.

పూర్వపు నాటకములలో నాయికా నాయకుల జీవిత పూర్తి చిత్రణ ముండెడిది. కాని అట్టి చిత్రణము గల నాటకములో పరిమితమైన పరికరములుగల రంగస్థలమునందు కంటె, అపరిమితములైన వనరు లున్న టాకీలలో సమగ్రముగ చిత్రించి ప్రజల కానందము కల్గించుట సులభము.

కాని నాటకమునందొక విశేషమున్నది. నటకుల సంభాషణలు, చేష్టలు, (Dialogue, Gestures) తోబాటు, జీవముతోనున్న వ్యక్తులు ప్రేక్షకుల నెదు ర్కొని, వారితో సంబంధము కల్పించుకొందురు. కొన్ని సన్నివేశములలో వారి భావచిత్రణము ప్రేక్షకుల హృదయముల కత్తుకొని రసానుభవము కల్గింపగలరు. ఇట్టిది టాకీ ప్రదర్శనములలో సంభవించుట కష్టము. టాకీలలో డైలాగు సంభాషణకు ప్రాముఖ్యము లేదు. Close-up లలో నటకుల ఛాయలనే చూతుముగాని చైతన్యముగల వ్యక్తులు మనయెదుట తారసిల్లరు.

నాటకరంగము యొక్క విశిష్టతను మన మూతగా గైకొని నాటకరంగమును ఉజ్జీవింప జేయవచ్చునని నా యూహ. కాని నాయికా నాయకుల జీవిత పూర్తి చిత్రణము టాకీలకే వదలి, వారిజీవితములో భావ గర్భితమైన యొకటి రెండు సన్నివేశములకే నాటకము పరిమితము చేయుట లాభకారియగునని నా అభిప్రా యము. పెద్దనవలకును కథానికకును గల తారతమ్యమే టాకీలకును, నాటకములకును కల్పింపవలెనని నా యూహ. ఇట్టి రంగముల ప్రదర్శనములలో రచయిత, ప్రయోక్తల భావచిత్రములో, నటకులు ప్రేక్షకుల కందించి, వారియందు భావసంచలనము కల్గించి రసానుభూతికి తోడ్పడగలరని నేనెంతును.

ఇట్టి రచనలలో సంభాషణలచేతనే ప్రేక్షకులతో సంబంధము కల్పించుకొనుట కష్టసాధ్యము. డైలాగ్ చైతన్యముతో కూడినదై యున్నగాని నటకుని భావప్రక టనమున కాస్కారముండదు. ఇట్టిచోట్ల బెర్నార్డ్‌షా, హాస్యము నుపయోగించుకొన్నాడు. అది సున్నితమైన గాని ప్రయోగార్హము కానేరదు. కాని యిది అన్ని సన్నివేశములలోను సాధ్యముకాదు.

సంగీతముచే నీ సంబంధము కల్పించుకొనుట సుకరము. సంగీతమును నాటకరంగమునుండి బహి ష్కరించుట అనాలోచితమని నా అభిప్రాయము.

ఇట్టి నాటకములు ఏకాంకలుగనే నుండనవసరము లేదు. ఎన్ని రంగములున్నను ప్రదర్శనమునకనుకూల ముగ నున్నచో, అనగా రంగములు మార్చుటలో వ్యవధి ఎంత తక్కువై యున్న ప్రదర్శనమంత రక్తి కట్టునని నా అభిప్రాయము. టాకీలు యాంత్రికము లగుటచే నిది సులభసాధ్య మగుచున్నది.

మన పూర్వ కవులలో భాసుడట్టి రచనలు గావించెను. అతని ఊరుభంగము అద్భుత రచన. అది ఏకాంకమే.

పాశ్చాత్య దేశములందు, జర్మను దేశీయుడగు **Brenden Brecht** బ్రెన్‌డెన్ బ్రెక్ట్ అను రచయిత **Epic Theatre** (పౌరాణిక నాటక రంగము) అను నాటక ప్రదర్శనములలో నొక నూతన సాంప్రదాయమును అనుసరించుచున్నట్లు వినుచున్నాము. కొన్ని ప్రత్యేక సన్నివేశములను నాటికలుగ చిత్రించి, సీనుకు సీనుకు మధ్య, ఆ రంగములో ప్రదర్శించిన భావమును, కొందరు కథకులు సంగీతము నృత్యము సమీక్షించుచూ వ్యక్తీకరింతురట. ముఖ్యముగ నునేడు సామాజిక సమస్యలపైననే ప్రేక్షకుల దృష్టిని కేంద్రీకరింపజేసి, వారి భావములను (**emotions**) గాక బుద్ధిని ప్రబోధితముచేయుటకే ప్రయత్నించుచునని తెలియుచున్నది.

ఆయన రచించిన **Mother Courage** తల్లి, ధైర్యము, అను ప్రదర్శనము సహృదయుల మన్ననలనందుకొన్నది. అది యూరపులో జరిగిన ముప్పది సంవత్సరముల యుద్ధమునాటి కథ. అందు నాయిక యొక కులట. ఆ యుద్ధములో పాల్గొన్న వివిధ దేశ సైనికుల శిబిరములకామె బలవంతముగ కొనిపోబడి ప్రతి శిబిరములోను యొక పుత్రునికనెను. ఆ కొడుకులతో ఆమెవివిధ రంగములలో ప్రయాణముచేయుటలో యుదముపల్ల సంభవించెడి యనర్థములను కవి వ్యక్తీకరించును.

మన ప్రాంతపు బుర్రకథలతో ఇట్టి రచనలను కలిపి రంగమున కెక్కించుటలో ప్రేక్షకులకు వినోదము కల్గుటయేగాక రసానుభవముతోబాటు సామాజిక సమస్యలపై నాతని దృష్టి కేంద్రీకరింప జేయవచ్చును. ఇట్లు మన అభ్యుదయ రచయితల ఆశయముకూడా నెరవేరును. ఈ విషయమును మన నాటక ప్రయోక్తలు ఆలోచింతురని నా కోరిక.

★★



విజయవాడ సోషల్ క్లబ్ & లిటరరీ సొసైటీవారి వజ్రోత్సవ సందర్భంలో సత్కరించబడిన శ్రీ కర్నాటి.

# వ్యక్తిగా - వక్తగా ప్రయోక్తగా శ్రీ కర్నాటి



— శ్రీ సజ్జా కోటి సూర్యప్రకాశరావు చౌదరి

తెలుగునాట యెందరో మహావక్తలున్నారు. మహా నటులున్నారు. మహాకవులున్నారు. మహా రచయితలున్నారు. అయినా వక్తలు రచయితలు కావడం, రచయితలు వక్తలు కావడం అరుదు. అలాగే కవి నటుడు కావడం, నటుడు రచయిత కావడంకూడా అబ్బురం. ఈ లక్షణాలన్నీవున్నా కార్యనిర్వహణ దక్షత కలిగివుండడం మరీ పేర్కొని తీరవలసిన విశేషం.

ఆప్తులు శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యను "మహా వ్యక్తి" అనడానికి నేను సాహసిస్తున్నానంటే యీ విశిష్టతలన్నీ ఆయనలో మూర్తీభవించి వున్నందు వల్లనే.

## వక్తగా...

వక్తృత్వం ఒక కళ. మామూలుగా వేదికలపై జరిగే రాజకీయోపన్యాసాలన్నిటిని వక్తృత్వానికి నిదర్శనలుగా నేను అంగీకరించలేను. అలాగే గంటల తరబడి అనర్గళంగా గంభీరోపన్యాసాలీయడాన్ని, ఎదుటివారికి అర్థంకాని, జటిల సమాసాలను పుష్కలంగా ప్రయోగించి ప్రసంగించడాన్ని వక్తృత్వ మనడంలో అర్థంలేదు. తాను చెప్పవలసిన అంశాన్ని శ్రోతలకు అర్థమయ్యేటట్టు స్పష్టంగా వివరించడమే అసలైన వక్తృత్వం కాగలదు. అంతేగాదు. తన ప్రసంగాన్ని వింటున్న శ్రోతలు ఏ తరహావారో, ఏ తీరులో, ఏ భాషలో, ఏ వివరణలతో ప్రసంగిస్తే వారికి సులభంగా అవగాహన కాగలదో నిర్ణయించుకొన గలగడం వక్తల కుండితీరవలసిన ప్రధాన లక్షణం.

కొందరు వక్తలు ఎంతసేపయినా అనర్గళంగా ఉపన్యసిస్తారు. ఆ పదలాలిత్యం, ప్రవాహధోరణి అందరినీ ఆకర్షిస్తాయికూడా. ప్రసంగాన్ని వింటున్నంతసేపూ శ్రోతలు ''సెహబాష్'' అనుకుంటారు. తీరా ఉపన్యాసం ముగిసిన తర్వాత ఆ వక్త చెప్పినదేమిటి? అని తర్కించుకుంటే ఏమీ గుర్తుండదు. అంటే ఆ ప్రసంగంలో శ్రోతల్ని అప్పటికప్పుడు ఆకట్టుకునే పదలాలిత్యమే వున్నదిగాని భావావేశం లేదన్నమాట.

శ్రీ లక్ష్మీనరసయ్య గంభీరోపన్యాసకులు కారు. వారి ప్రసంగంలో ప్రవాహధోరణి కానరాదు. కాని ఆయన సిసలైనవక్త.

తాను ఏ అంశాన్ని గురించి మాట్లాడవలసివచ్చినా తూచి మాట్లాడడం, తు. చ. తప్పకుండా వివరించ డం ఆయనకు స్వత సిద్ధంగా అలవడిన విద్య. చెప్పే విషయాన్ని సూటిగాను, సింపుల్‌గాను చెప్పడంలో ఆయనతో పోల్చదగినవారు కొద్దిమందే వుంటారు.

## నటుడుగా - ప్రయోక్తగా...

ఇక రంగస్థల నటుడుగాను, ప్రయోక్తగాను లక్ష్మీ నరసయ్యగారి పేరు తెలుగువారికి సుపరిచితమే.

ఏ పాత్రనైనా చేపట్టి మెప్పించగలవాడే నటు డన్న విషయం నిజమే

తనకు నచ్చిన పాత్రలను మరెవరూపోషించలేనంత అద్భుతంగా వాటిని పోషిస్తారు. కిరాయికోసం ఏ పాత్ర నైనా వేసే మనస్తత్వం కాదు వారిది. నాటకకళను ఆయన ధనార్జనకే వినియోగించుకుంటే ఏ నా డో పౌరాణిక నాటకాలను చేపట్టేవారు. నిజానికి పౌరాణి కాల్లో కృష్ణపాత్రవంటి వాటికి ఆయన పర్సనాలిటీ బ్రహ్మాండముగా నప్పుతుంది. కాని ఆయన లక్ష్యం వేరు. కళ మానవ శ్రేయస్సుకు వినియోగ పడా లన్నది ఆయన నమ్మిన సిద్ధాంతం. అందువల్లనే ప్రజాసమస్యల్ని ప్రతిబింబింపచేసే సాంఘిక నాటకా లకు ఆయన ప్రాధాన్యమిస్తారు. వాటిలోనే నటిస్తారు.

పోతే- నాటక ప్రయోక్తగా లక్ష్మీనరసయ్యగారి ప్రతిభ అనన్యసామాన్యం. ఒక ప్రదర్శనయివ్వా లంటే ఆ యితివృత్తంలోని పాత్రలకు తగిన నటీనటు లను ఎన్నుకొనడం సాధారణ విషయం కాదు. లక్ష్మీ నరసయ్యగారికి మాత్రం అది వెన్నతో నేర్చినవిద్య. ఇక- ప్రదర్శనలో ఎలాంటి చిన్న లోటుపాట్లు సహి తం రాకుండా ముందే జాగ్రత్త పడడం ప్రయోక్తగా ఆయన ప్రతిభకు తార్కాణం. నటీనటుల్ని ఎన్నుకో వడంలోగాని, నాటకాన్ని ఎంపిక చేయడంలోగాని, ఆయనంత నిర్మొహమాటంగాను, నిష్పాక్షికంగాను వ్యవహరించేవారు యీనాడు చాలా తక్కువమంది కనిపిస్తారు.

## వ్యక్తిగా...

ఇక- వ్యక్తిగా శ్రీ లక్ష్మీనరసయ్యగారు అమృత హృదయులు. చిన్నవారు, పెద్దవారు అన్న తార తమ్యంతో నిమిత్తం లేకుండా ఎవరినైనా చిరు నవ్వుతో మన్నిస్తూ, నిండుమనసుతో పలకరించడం ఆయనకు ఎప్పుడూ వున్న అలవాటు. అలాగే అవ సరమైన సందర్భములలో తోటివారికి తోడ్పడి తీరా లన్నది ఆయన అచరిస్తున్న సిద్ధాంతాలలో ఒకటి. పీటన్నిటినీ మించి మరొక విశేషం. వాస్తవానికి యీ నాడు తెలుగునాటకాల అగ్రశేణి రంగస్థలనటులలో ఆయనొకరైనా, చూదామన్నా ఆయనలో గర్వం, అతిశయంకానరావు. ఆడంబరం అసలే కనిపించదు.

జముకుల కథ, బుర్రకథవంటి జానపద కళలలో ఆయన నిష్ణాతులని, జానపదరీతులు అంతరించి పోకుండా నిలబెట్టడానికి కృషిచేసిన ముఖ్యులలో లక్ష్మీ నరసయ్యగా రొకరని ఎందరికి తెలుసు ?

ఏమైనా యీనాడు మిత్రులు శ్రీ లక్ష్మీనరసయ్య గారిని అభినందించడానికి విజయవాడ ప్రముఖులు పూనుకొనడం చాలా సంతోషంగా వుంది.

కళా వా చ స్ప తి శ్రీ జగ్గయ్యగారు చెప్పినట్లు శ్రీ లక్ష్మీనరసయ్యగారు ప్రజానటుడు. ఆయనకు ఈ సందర్భంలో నా హృదయపూర్వక అభినందనలు.

★★

మిత్రమా అని సంబోధిస్తూ శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారిని గూర్చి

కీ. శే. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారి

# వాణి . అమరవాణి

**మిత్రమా :**

దైవదత్తం అయిన శక్తిని, దైవస్వరూపులు అయిన ప్రజలను ఆరాధించుటకై మీరు వినియోగ పరుస్తున్నారు. అందుకే మీ నడవడికలో నమ్రత, మాటలలో సూనృతం, చేతలలో ఆరాధన గోచరిస్తయ్.

**స్నేహశీలి :**

బహుముఖమూ, వైవిధ్యమూగల ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకొని, బహుత్వంలోని — ఏకత్వమైన మైత్రిని మీరు చూస్తారు. చూపుతారు.

**ప్రతిభాశాలి :**

బుర్రకథ, కథ, జముకుల కథ, రూపకం, నాటిక, నాటకం, వీధిభాగవతం, రేడియో, సినిమాలలో — వివిధ కళారూపాలలో - మీరు రస స్వరూపాన్ని దర్శించారు. ప్రదర్శించారు. అందుకే మీ నిర్వహణ నిర్దుష్టం, నిరుపమానం. ఏ కళారూపాన మీరు దర్శనం ఇచ్చినా అది ప్రజా హృదయాలలో నిలిచి వుంటుంది. మీరు కారెక్టర్ యాక్టర్ అనిపించు కున్నారు. మీరు వేస్తేనే, మీరు వేసే నాటకాలను చూడవలెననే ప్రజా సందోహం గొప్పది.

**అభ్యుదయ పథగామీ :**

ఆంధ్ర ఆర్ట్ థియేటర్, ప్రజానాట్యమండలిలో మీరు చేసిన నిస్వార్థమైన సేవకు — ఆంధ్రావని పులకించింది. మిమ్మల్ని తన ముద్దు బిడ్డడుగా కీర్తించింది. ఆనాటి మహాకవి పోతరాజువలె ఈ నాటి మహానటులు మీరూ, హాలికులైననేమి అని హలం చేపట్టి, కర్షకులూ అయినారు. నటనలో ముందడుగువేసే నటశేఖరులూ అయినారు అదే మీ రససిద్ధికి తార్కాణం. నిజాయితీ మీ సొమ్ము.

**మిత్రమా :**

కలకాలం మీరు ఆయురారోగ్యాలతో, నిరంతరమైన కళాతపస్సుతో జేగీయమానం అయిన కీర్తి ప్రతిష్ఠలతో వర్ధిల్లాలని కోరుతూన్న మీ మిత్రుడు.

★★

# 'రథసారథి'

ఆంధ్ర నాటక రంగానికి అత్యుత్తమరీతిని
సేవ చేస్తున్నవారిలో అగ్రగణ్యుడు లక్ష్మీనరసయ్య
ముఖస్తుతికి నే చెప్పడం కాదుగాని చెప్పింది చేయడం ఆయనకు అలవాటు
ప్రజాసేవ చేయడం పరిపాటి, అది అతని పరమావధి
ఆ తరానికి యీ తరానికి వారధి
ముప్పై సంవత్సరాలుగా చూస్తున్నా
మనిషిలో, మమతలో, మంచితనం చూపించడంలో
మార్పులేదు, రాదేమోకూడా
ఆంధ్ర నాటక కళాసమితికి నేటి సారథి
ప్రజానాట్యమండలికి ఆనాడు (1942) ప్రముఖ వ్యక్తి
ప్రెసిడెంటు పట్టయ్యగా ప్రతిభ చూపిన ప్రముఖుడు
బుర్రకథను రక్తికట్టించి హాస్యాన్ని గిర్రున తిప్పిన జగజెట్టి
అందుకే ఆయనంటే నాకు "అదోయిది"
ఎంత చెప్పినా తరగనంటుంది ''మది''
స్వశక్తితో, ఆసక్తితో, అనురక్తితో అందర్నీ
ఆకర్షించే 'అది' ఆయనలో యిమిడివుంది
మాకు సమకాలికుడు
మరువలేని, మరువరాని
మనసున్న మంచివాడు
మన ''కర్నాటి''
''కిరీటి''
ఆదే
అతని
''ధాటి''

—"కోగంటి"

# Dedicated to the stage

P. S. RAO

'ART is long and time is fleeting', said the poet. But a lifelong votary of art, in quest of new horizons, takes Time by the forelock. In his endless pursuit he absorbs many new trends, as Art is not constrained by rigidity, and always strives to improve himself. A keen eye, selfcriticism, receptivity and freedom from insularity should be his attributes.

Mr. Karnati Lakshminarasayya, the well-known stage actor, who has dedicated a major part of his life — nearly two-thirds of his 50-year age — to the Andhra stage, possesses all the qualities of a devoted artiste, whose organisational skill and zeal have not blunted with passege of time. He can very well be described as a people's artiste, since he earnestly believes in the concept of 'Art for people's sake' and that all true art is purposeful and must create social awareness.

The career-graph of Mr. Lakshminarasayya is even and not undulating. From teaching in a school to acting on stage is a far cry but for him it had been a simple change-over. He attracted attention with the hero's role in 'Mundadugu', staged by Praja Natya Mandali in early forties. The late stage veteran Dr. Raja Rao was greatly impressed by it and took Lakshminarasayya under his wing. From that day onwards there had been no looking back; the theatre had been and is his all-consuming passion. Stalwarts like Kodurupati Achayya and Perumallu inculcated in him a disciplined approach to stage-craft.

After making his mark in many plays like 'Mabhoomi'. he switched over to Andhra Art Theatre, Vijayawada. The score is envirble and his roles in dramas like 'Antaa Peddale' and 'Neramu–Siksha' are memorable. Very few are aware that he moulded the talent of K. Venkateswara Rao, another past stage luminary, in his formative period.

Apart from acting, producing dramas, and organising dramatic programmes, Lakshminarasayya is proficient in many folk-forms like 'Burrakatha', 'Jamukulakatha' and 'Golla Suddulu' which speaks for his versatility as a performing artiste. His chief asset is his well-modulated voice.

That neither craze for fame and pelf nor a cinema-career could lure him is ample testimony to his dedication to the Telugu theatre and its advancement. To all aspiring actors, stage enthusiasts and amateur organisations his untiring service, counted with unassuming attitude and amiability, is worthy of emulation. What the Telugu stage-now in doldrums-needs is more men having Lakshminarasayya devotion to the art.

(In "INDIAN EXPRESS" Jan. 14, 1977)

# శ్రీ లక్ష్మీనరసయ్యగారి కళాత్మ పరిశీలన

— నండూరి వెంకటేశ్వర్లు

(నటుడు)

అన్యుల నొప్పింపక, తా నొవ్వక ఒప్పించుక తిరుగువాడు మా లక్ష్మీనరసయ్యగారు. ఆయన ఒక నాటక కళలోనేకాదు, అనేక జానపద కళలలో ప్రవేశము, పాండిత్యమున్న దిట్ట, జ్ఞాని, మంచి ఆవేశం, పట్టుదల ఉన్న కళాకారుడు.

నటుడు పాటించవలసిన కొన్ని ముఖ్యమైన నియమ నింబంధనలకు కట్టుబడిన వ్యక్తి నాకు తెలిసినంతవరకు ఆయన ఒక్కడేనేమోనని నా కనిపిస్తుంటుంది.ఎటువంటి కార్యాన్నయినా సౌమ్యతతో సాధించుక రాగలిగిన నేర్పు గలవాడు. గత 30 సంవత్సరాలుగా వివిధ కళారూపాల్లో పాత్రని, కళకు ఆయనచేసిన సేవను సమీక్షించడం నాకంటె అన్నిటా పెద్దవాళ్ళెవరైనా చెయ్యవలసిన పని.

అయితే గత కొద్ది సంవత్సరాలుగా ఆయన ఔత్సాహిక నాటక రంగానికి, ప్రత్యక్షంగా పరోక్షంగా చేస్తున్న సేవ ఎంతైనా కొనియాడదగినది. ఏ కొద్దిమందికోతప్ప సాధ్యం కాని పని అది. తెరెత్తినపుడు వెయ్యిమందుంటె, తెర దించేప్పుడు పాతికమందికంటె ఎక్కువ మందిని మిగుల్చుకోలేని పరిస్థితికి దిగజారి పోతున్న సాంఘిక నాటకాల్ని ఆడించడమంటే తమాషాకాదు. అందర్నీ కూడగట్టుకొని, నచ్చచెప్పి సభ్యులుగా జేర్పించి నాటకం బాగాలేదని తిరిగి పోతున్న ప్రేక్షకుడ్ని గేటువద్ద కాపలా వేసి పట్టుకుని రాబోయేసీను బాగుంటుందని బుజ్జగించి మరల తీసుకొచ్చి కూర్చోబెట్టగలిగిన ఓపిక, నేర్పు, అంతకు మించి కళకు సేవ చేయాలనేతపన ఉన్నవాళ్ళు ఎంత మందుంటారు? పద్యాలులేని నాటకంగూడా నాటకమేనా ! అనుకునేవారితో దాన్నికూడ మీరే ఆదగించాలి. అది సామాన్య ప్రజలకొరకు అందుబాటులో వుండేదని సానునయంగాచెప్పి కొంతమంది సహృదయుల్నయినా మన నాటకాలు చూడటానికి అలవాటు చేసిన లక్ష్మీనరసయ్యలాంటి వారి ఋణం ఔత్సాహిక నాటకరంగం ఏనాటికైనా తీర్చుకోవలసివుంది.

★★



ఏ దేశ మేగినా ఎందు కాలిడినా
ఏ పీఠ మెక్కినా ఎవ్వరెదురైనా,
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము

-- రాయప్రోలు.

# ఆదర్శమూర్తి శ్రీ నరసయ్య

—వీరంరాజు

కళాకారుడిగా, నటకుడిగా శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య నాకు పరిచితుడుగాలేదు. నాకు తెలిసినంతలో ఆయన ఒక ఉత్తమ వ్యక్తి, ఆదర్శప్రాయుడు, కార్యదక్షులు, సంస్థా నిర్మాత, శీలవంతుడు.

కళారంగంలో ఎందరో పేరు ప్రఖ్యాతులు, సంపాదించుకున్న నటకులు, సంగీత విద్వాంసులు, కవులు, కళాకారులు వున్నారు. సత్యం చెప్పాలంటే వీరిలో ఎక్కువమంది మూడు 'W' లలో అన్నింటికో, లేదా ఏదో ఒక దానికో దాసులే Women, wine, wealth లకు అంజలి ఘటించని కళాకారులను కంచుకాగడాబెట్టి వెతికినా కనుపించరు. సహారా ఎడారిలో ఒయాసిస్‌వలె నాకు శ్రీ నరసయ్య ఒకడు కనుపిస్తున్నాడు. ఆయన శీలమే నన్ను ఆకర్షించింది. ఆయన్ను చూస్తే నాకు విచారం కూడా కలుగుతున్నది. ఇంత ఉత్తమ గుణసంపన్నుడు కళారంగంలో మనగలడా అని. కళాకారులను ప్రేమిస్తాడు, ఆదరిస్తాడు కాని వారిలో పాదుకున్న అవగుణాలను తీవ్రంగా నిరసిస్తాడు.

కళాకారుడు ఏదో ఒక కళలో మాత్రమే విశేష ప్రజ్ఞ చూపించగలడు. ఆంధ్రదేశం ప్రపంచానికి ఇచ్చిన బహుముఖ ప్రజ్ఞాశాలి ఒక్క బాలమురళీకృష్ణ కనుపిస్తాడు. సాంప్రదాయ, లలితసంగీతాలలో వాయిద్య కారుడిగా, అఖండ ప్రజ్ఞావంతుడిగా, వాగ్గేయకారుడిగా బాలమురళి దక్షిణ భారతావనిలో ఏకైక తారగా వెలుగుచున్నాడు. అట్లాగే శ్రీ కర్నాటి రంగస్థల, రేడియో నటకాగ్రేసరుడిగానే గాక, బుర్రకథ, జముకులకథ, గొల్లసుద్దులు, జంగంకథ, వీధి భాగవతాది తదితర జానపద కళా ప్రక్రియలలో నిష్ణాతుడు గావడం విశేషం. అంతేగాక 'అణునాటిక' అనే కొత్త ప్రయోగాన్ని సాధించినాడు. కళాశాస్త్రాన్ని సాధారణ ప్రజలకు మనోరంజకంగా చెప్పగల ఉపన్యాసకుడు. అన్నిటికి మించి కళా సంస్థ నిర్వాహకుడుగా నేడు కళాకారులకు గొడుగు పట్టినవ్యక్తి. ఇన్ని శక్తులు ఒక వ్యక్తిలో కనుపించడం చాలా అసాధారణ విషయం. అందువలన శ్రీ నరసయ్య నాదృష్టిలో బహుముఖ ప్రజ్ఞాశాలి.

ఆంధ్ర నాటక కళాసమితిని 10 సం॥రాలుగా నిర్వహించడంలో విజయవాడ పట్టణ శ్రీమంతులకు మధ్యతరగతి గృహస్థులకు ఆయన చాలా సన్నిహితుడయ్యాడు. ఎందరో సంపన్నులను కళాభిమానులుగా, కళాపోషకులుగా తీర్చిదిద్దినాడు. కళాపోషకులను గిలిగింతలు పెట్టడంలో ఎన్నో చిత్ర విచిత్ర ప్రక్రియలను రూపొందించినాడు. కళాపోషకులను రూపొందించే సాంకేతిక శాస్త్రాన్ని ఒక దానిని ఆయన ప్రపంచానికి ఇవ్వగలడేమో !

కళాసంస్థ పోషకులైన సంపన్నుల విశ్వాసాన్ని చూరగొన్నాడు. ఆయనకు తామే ఎంతో ఋణపడినట్లుగా భావిస్తారు. వారు ఆయనను కర్ణదాతగా చూస్తున్నారు. వారు వ్యక్తంచేసే నమ్మకాన్ని తన వ్యక్తిగత అభ్యుదయానికి ఉపయోగించుకోనని నిస్వార్థజీవి. ఉదయం ౬.00 గంటలనుండి రాత్రి 11.00 ల వరకు ఆ సంస్థకు కొత్త సభ్యులను చేర్చడంలో తన కాలాన్ని వెచ్చించే నిరంతర కార్యశీలి.

ఈయన ఎందరో ఔత్సాహిక నటకులకు, దర్శకులకు, సంస్థా నిర్వాహకులకు, రచయితలకు 'నర్సమ్మ' (Nurse) గా వ్యవహరిస్తున్నాడు.

ఆయన మెప్పు సంపాదిస్తే గొప్పఅని భావిస్తారు. వీరి లోని మంచితనాన్ని, ప్రజ్ఞను గుర్తించి ప్రోత్సాహ మిస్తాడు. తన స్వంతభేరి ప్రమోగించుకొనడం నేను వినలేదు. నేడు కళాకారుల కల్పవృక్షంగా వుండే కళాసమితిని తీర్చిదిద్దడంలో శ్రమిస్తున్నాడు.

నాటకాలను నిర్ణీతకాలానికి మొదలుపెట్టించడంలో ఆయనపడే శ్రమ, తీసుకుందే జాగ్రత్తలు వర్ణనాతీతం. ఇందుగల డందులేడనిపిస్తాడు. ప్రేక్షకులను, సమితి సభ్యులను మర్యాదచేసి ఎవరిని ఎక్కడ కూర్చోపెట్టవలెనో జాగ్రత్త తీసుకుంటారు. వారిపట్ల ఆయన చూపే వినయం, మర్యాద మరువ లేనివి.

పెద్ద పెద్ద తత్వాలను వల్లిస్తూ కులాభిమానాన్ని దాచుకోలేని పెద్దలతో కూడిన నేటి సమాజంలో శ్రీ నర్సయ్య కులాతీతుడు. 'నీ కులం ఏది' అని ఎవరైనా ప్రశ్నిస్తే తుకతుకలాడిపోతాడు. సభ్యత కోసం ఓర్చుకుంటాడు. "వీరికి నా కులంతో పని ఏమండి" అంటాడు. ఏ కులాన్ని గురించి పొగడడం, హీనంగా మాట్లాడటం నేను వినలేదు. అన్ని కులాల్లో ఆయన మిత్రులుండటం ఆయన విశేష వ్యక్తిత్వానికి ఒక నిదర్శనం.

కళ ప్రజల కోసమని, వారిని ఉత్తమ శీలవంతులుగా, సంస్కారులుగా తీర్చిదిద్దడానికి ఒక సాధన మని ఆయన నమ్మిక. నాటకం కాలక్షేపం కోసం కాదని, అది ప్రబోధాత్మకంగా వుండాలని ఆయన అభిప్రాయం.

స్వర్గీయులు శ్రీ కోడూరి ఆచ్చయ్య, డా॥ రాజారావు, శ్రీ మాచినేని వెంకటేశ్వరరావులవద్ద నాటక, జానపద కళలలో శిక్షణ పొందిన శ్రీ నర్సయ్య, ఆ శాస్త్రాలను యువతరంవారికి బోధించే విద్యాలయాన్ని నడిపి, గురు ఋణాన్ని తీర్చుకొనవలసిన తరుణం ఆసన్నమయింది. ఈ లక్ష్య సాధనలో ఆంధ్ర నాటక కళాసమితి అధ్యక్షులు శ్రీ శేషయ్య, పాపులర్ షూ మార్టు మేనేజింగ్ పార్ట్‌నర్, ఆంధ్ర నాటక కళాసమితి ఉపాధ్యక్షులు శ్రీ పిచ్చయ్యగారలు తోడ్పడగలరని ఆశిస్తున్నాను.

★★



శ్రీ కర్నాటిని సత్కరించిన శ్రీ పెరుమాళ్ళ వెంకట సుబ్బారావుగారు

ప్రజానాట్యమండలి కళాకారుడు

# లక్ష్మీనరసయ్య

— కొడాలి ఆదిశేషయ్య

ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి ఆవిర్భావానికి కృష్ణాజిల్లా ప్రధానకారణం. తిరువూరు తాలూకా తునికిపాడు గ్రామమే కర్నాటి లక్ష్మీనరసయ్యగారు పుట్టిన ఊరు. పుట్టింది తునికిపాడు అయినా మెట్టింది తెలంగాణా ప్రాంతం. మధిర తాలూకా దెందుకూరు లో జీవనారంభదశలో ఉర్దూ టీచరుగా కొంత కాలం పనిచేస్తూ వచ్చారు.

ఆనాడు దెందుకూరు ఆంధ్రమహాసభకు ప్రజానాట్యమండలి కార్యకలాపాలకు ఆటపట్టు. దెందుకూరులో ప్రముఖ కళాకారులుండేవారు- నాటకాలాడుతుండేవారు. వారితో లక్ష్మీనరసయ్యగారికి సన్నిహిత సంబంధముండేది. వారు ఆడే నాటకాలలో వరవిక్రయంలో, ముందడుగులో నాయకపాత్ర అపనిందలో ఒక పాత్ర ధరించి, తర్వాత దెందుకూరు ప్రజానాట్యమండలి నాటకాలలో బాగానటించి ఆంధ్ర ప్రజానాట్యమండలిచే ఆకర్షింపబడ్డారు. ఆంధ్ర ప్రజానాట్యమండలి సభ్యులయ్యారు.

విఖ్యాతిచెందిన ప్రజానాట్యమండలి 'మా భూమి' నాటకంలో రాముడు పాత్ర ధరించి ప్రముఖుల మన్నన పొందారు. ప్రజానాట్యమండలి కళాకారులు శ్రీ మాచినేని వెంకటేశ్వరరావుయొద్ద బుర్రకథ, శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తియొద్ద జముకుల కథ అభ్యసించారు. నాజరు బుర్రకథ దళములో రాజకీయాలు, హాస్యం చెప్పి నాజరు బుర్రకథ రక్తికట్టటానికి రామకోటితోపాటు ప్రధాన కారకులయ్యారు. ఆంధ్ర ప్రజానాట్యమండలి కార్యకలాపము లన్నింట పాల్గొన్నారు.

నైజాం రజాకారుల గుండాలకు భూస్వామ్య వర్గాలకు వ్యతిరేకంగా పోరాడు ప్రజల పక్షాన నిలబడిన ప్రజానాట్యమండలి కార్యకలాపాలమీద ఆనాటి ప్రభుత్వ దమనకాండ కారణంగా 1948 నుండి దాని కార్యకలాపాలు స్తంభించిపోయాయి.

ప్రజానాట్యమండలి కార్యకర్తలు అనేక నిర్బంధాలకు గురిఅయ్యారు. కొందరు జైళ్ళపాలయ్యారు. మరికొందరు విజయవాడలోని శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ శాఖగా ఆంధ్ర ఆర్ట్సు థియేటరుపేర ప్రజా నాట్యమండలి కళాకారుల కార్యకలాపాలకు అవకాశం లభించింది. ఆంధ్ర ఆర్ట్సు థియేటరు కళాకారులు ప్రజా నాట్యమండలి కళాకారులే కనుక ప్రజా నాట్యమండలి క్రమశిక్షణలోనే ఆంధ్ర ఆర్ట్సు థియేటరు ఆంధ్రలో బహుముఖంగా పనిచేసింది. అందులో శ్రీయుతులు మిక్కిలినేని, మాచినేని, కర్నాటి లక్ష్మీనరసయ్య, రామకోటి, యం. వి. సత్యం మొదలైన కళాకారులు పనిచేశారు. ఆంధ్ర ఆర్ట్సు థియేటర్ ప్రదర్శనల్లో ప్రగతిలో పిచ్చివాడుగా, మా వూరులో మహంకాళిగా, ఈనాడులో రాముగా, జీవితపథములో తండ్రిగా, జీతగాడులో భూస్వామిగా, అల్లీముఠాలో చిన్నపరెడ్డిగా, గాలిమేడలులో పెద్ద గుమాస్తాగా, తుఫానులో రాఘవరెడ్డిగా, శిక్షలో నారాయణరావుగా నటించి తాను ధరించిన పాత్రలకు న్యాయంచేకూర్చి విశేష ఖ్యాతి నందారు.

అనంతరం విజయవాడ ప్రజా నాట్యమండలి పేరుతో ఆసామి నాటకంలో నటించారు- ఆ తరువాత ఆంధ్ర ప్రజానాట్యమండలి చేపట్టిన ఇన్‌స్పెక్టర్ జనరల్ నాటకంలో చైనులుపాత్ర ధరించారు. ఆ మండలి కార్యవర్గ సభ్యులుగా కూడా పనిచేశారు.

ఈయన భారతీయ నాట్యమండలి స్థాపనకు ప్రధాన కారకులు. ఆ సంస్థ ప్రదర్శించిన చైర్మన్‌లో స్వామీజీగా, ప్రెసిడెంటు పట్టయ్యలో పట్టయ్యగా నటించిన లక్ష్మీనరసయ్యగారి కళాకౌశలము ప్రేక్షకులను ఆకట్టుకున్నది. ఈ విధముగా ఎన్నని చెప్పేది!

రేడియో ఆర్టిస్టుగా చాలా కాలముగా పనిచేస్తూ శ్రోతల అభిమానాన్ని చూరగొన్నారు. తెలుగునాటక కళాకారుల ప్రతిభను విజయవాడ ప్రేక్షకులకు విశదమయ్యేలాగా పనిచేస్తున్న ప్రదాససంస్థ. ఆంధ్రనాటక కళాసమితి స్థాపకుల్లో ఒకరు. ఇపుడు దాని ప్రధాన కార్యదర్శి. పుట్టిల్లు సినిమాలో కూడ నటించారు. వడుమడుకుగల బ్రతుకు బాటలలో చాల జాగ్రత్తగా పయనించిన బాటసారి శ్రీ లక్ష్మీనరసయ్య. తొందరపడి మాట్లాడడు, ఎవ్వరినీ నొప్పించడు. పలకరించుటలో విపరీతమైన ఆప్యాయత-కార్యాన్ని సాధించటములో అమితమైన కార్యదీక్ష-నేర్పుగల వ్యక్తి.

ప్రజానాట్యమండలి అభివృద్ధికి వినలేని సేవచేసిన ఈ కళాకారుని ఈ మధ్యనె బందరులో జరిగిన కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి మహాసభల్లో సన్మానించి గౌరవించింది. మానవుడు జీవితపుమలుపులలో ఏ మలుపులలో తను జాగ్రత్త వహించకపోయినా తన ఆదర్శాన్ని, లక్ష్యాన్ని చేరలేడు. అట్టి స్థితిలోనే తనజాగ్రత్త వహించాలి వ్యక్తి అందరికొరకు అందరు ప్రతి ఒక్కరికొరకు అనేది ప్రజాకళాకారులు దీక్షగా పాటించాలి. ఆయన అనేకతుఫానులలో ఒడుదుడుకులలో తనకున్న అవకాశాన్ని కళారంగానికె ఉపయోగించి మన కళాకారుడుగా నిర్విరామంగా కృషిచేస్తూ వచ్చారు అందుకే కళాకారుడిగా నేను అభినందించుచున్నాను.

తన ఉన్నత స్థితికి ప్రధాన కారణమైన ప్రజానాట్యమండలి అభివృద్ధికి ప్రజా కళాకారుడుగా, దాని అభివృద్ధి కాముకుడుగా ముందుకు వచ్చి కృషిసల్పుతారని ఆశిస్తున్నాను. బహుముఖ ప్రజ్ఞాశాలి మన కర్నాటి కళారంగములో ఇకముందుకూడా నిర్విరామ కృషి గావించాలని కాంక్షిస్తున్నాను.

★★



శ్రీ కర్నాటిని సత్కరిస్తున్న శ్రీ కాజ రంగారావుగారు

# కార్యదక్షుడు కర్నాటి లక్ష్మీనరసయ్య



— పర్చూరి రాధాకృష్ణమూర్తి

అధ్యక్షులు :
విజయవాడ ఫెర్టిలైజర్స్ డీలర్స్
అసోసియేషన్, విజయవాడ

లక్ష్మీనరసయ్యగారనగా మొదట నేనెరిగినది ఒక జానపద కళాకారునిగా, ముఖ్యంగా నాజరు బుర్రకథ దళంలో వంతకునిగా. ఆరోజుల్లో నాజరు బుర్రకథ వినటానికి బండ్లమీద, సైకిళ్ళమీద, రైళ్ళ మీద పాతికేసి మైళ్ళ వరకు లెక్కచేయకుండా ప్రజలు పరవళ్ళు త్రొక్కుకుంటూ వెళ్ళేవారు. ఆ కథా గానంలో, కథా కథనంలో, కథావస్తువులో ప్రజా వాహిని సమ్మోహనమయ్యేది. దానిలోనే రాజకీయాలు, చతురోక్తులు సమ్మిళితమై ప్రజల్ని ఉత్తేజపరచేయి. ఒక్కమాటలో చెప్పాలంటే ఆనాడు బుర్రకథతో తెలుగువాడు ఉత్తేజితుడై తెలుగునాడు చైతన్యంతో వెలుగొందింది అనటంలో సందేహంలేదు. ఆనాటినుంచీ లక్ష్మీనరసయ్యగారు నా మనస్సులో చెరగని ముద్రగా నిల్చారు. ఆటు తర్వాత అనేక రేడియో నాటికలలో వారి వాక్పటిమ, బాణి నన్ను ఆకట్టుకొని నాలో వారి యెడల అభిమానాన్ని పెంపు చేశాయి.

కొద్ది సంవత్సరాల క్రితమే లక్ష్మీనరసయ్యగారు నాకు వ్యక్తిగతంగా పరిచయమైనప్పుడు ఆ మనిషి చిరపరిచితుడే ననిపించింది. ఆ తర్వాత వారితో సాన్నిహిత్యం పెరిగినకొద్దీ అనేక మానవత్వపు విలువల్ని ఆయనలో గ్రహించాను. సంస్కారం ఆయనలో అడుగడుగునా మూర్తీభవించి వుంది. ఆయన నిగర్వి, సహృదయుడు, నిరాడంబరుడు– కుల, మత, వర్గ తత్వాలకు అతీత మైన స్నేహశీలం ఆయన పుణికిపుచ్చుకున్నాడు. నాకప్పుడనిపించింది ఆయన రంగస్థలంమీదనేకాక జీవితరంగంలోకూడా మంచి నటుడని. అందుకే ఆయన అన్ని రంగములలోనివారికి అభిమానపాత్రు డయ్యాడు. ఇది అనితర సాధ్యమేమో !

ఆంధ్ర నాటక కళాసమితి స్థాపకుల్లో ఒకరై దానికి కార్యదర్శిగా సారథ్యం వహిస్తూ విజయవాడలాంటి విశేష ప్రాధాన్యతగల పట్టణంలో వివిధ రంగాలకు చెందిన ప్రముఖులను, కళాభిమానులను, కళా పోషకులను తన సామర్థ్యంతో సమీకరించి, కార్య దీక్షతో దాని పురోభివృద్ధికి కృషి చేస్తున్నారు. సమితి సభ్యులందరి ఆదరాభిమానాలను ప్రోత్సాహాన్ని పొంది ఉత్తమ నాటకాలను ప్రదర్శింపజేయటంద్వారా ప్రజా చైతన్యాన్ని కలిగిస్తూ ఔత్సాహిక నాటక సమాజాలకు అండగా నిలిచారంటే అవి వారి కార్య దక్షతకు తార్కాణం.

ఇటువంటి నిర్మాణాత్మకమైన, క్రియాశీలుడైన, ప్రతిభావంతుడైన నటుడు, దర్శకుడు, వక్త నిర్వాహకుడు శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారిని సమాజం గౌరవించటమేకాక వారి ప్రతిభతో క్రొత్త నటులను, దర్శకులను, నిర్వాహకులను తయారుచేసుకోవటం అవసరమేమో ననిపిస్తుంది. నాటకరంగానికి ఆయన చేస్తున్న కృషికి సమాజం ఋణపడివుంది. నాటక రంగాభివృద్ధికి వారి కృషి నిరంతరం కొనసాగాలని వారి మిత్రునిగా నా ఆకాంక్ష.

★★

# నే నెరిగిన శ్రీ లక్ష్మీనరసయ్య



— శ్రీ పొట్టి సత్యనారాయణ

అధ్యక్షులు :
విజయవాడ బియ్యం వర్తకుల
సంఘం.

శ్రీ లక్ష్మీనరసయ్యగారు నా కెన్నాళ్లనుంచో చిర పరిచితులు. లక్ష్మీనరసయ్యగారు ప్రతిభావంతమైన నటుడు. నటుడు అనగానే రంగస్థలంమీద పాత్రధారణచేసి నటించే వాడు అని తాత్పర్యమైనా దానిలో తారతమ్యాలు లేకపోలేదు. నటనలో కౌశల్యం చూపి రోజూ మనంచూస్తున్న వ్యక్తి అయినా, మన మెరుగని వానివలె రంగస్థలంమీద తన పాత్రలో లీనమై తన వాస్తవిక జీవిత వ్యక్తిత్వాన్ని బహిర్గతం కాకుండా పాత్రపోషణ చేసే వారే మహానటులు. ఆయన పరస్పర వైరుధ్యంగల పాత్రలను కూడా నేర్పుతోపోషించి ప్రతి పాత్రలోనూ ఒక క్రొత్త వెలుగును, మెళుకువను చూపుతారు. జానపద కళారూపాలలో ఆయన పాత్రకు ఆయనే సాటి అనిపించింది నాకు.

నే నెరిగిన లక్ష్మీ నరసయ్యగారు కేవలం నటులే కాదు- మంచి వక్త, కార్యదీక్షాపరుడు, కార్య నిర్వాహకుడు, నిరంతర స్నేహశీలి. చాలామందికి ఏదో ఒక కళలోనే ప్రతిభ వుంటుంది. కాని ఆయన ఏ పని చేసినా అందులో ప్రతిభ వెల్లడి అవుతుంది. అందుకే ఆయన అజేయుడు అనిపిస్తుంది నాకు. ఆయనతో ఒకసారి స్నేహభాగ్యం కలిగితే అది మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్లుతుందేగాని, వైరుధ్యానికి తావుండదు. వీటన్నింటికీ కారణం-- ఆయన మితభాషి, వినయశీలి, పరనిందా విముఖుడు, సంకుచిత తత్వాలకు అతీతుడు. సంఘ శ్రేయోభిలాషి కావటమే ననుకుంటాను. సాహిత్య కళారంగాలలో తన కార్యక్షేత్రంలో ఎదురయ్యే సమస్యలను వూహించి భయపడకుండా పరిస్థితులను తనకు సానుకూలం చేసుకొని కార్యసాధన చేయగల కార్యశూరుడుగా నేనాయన్ని గ్రహించాను. ఇది వాస్తవం కనుకనే ఆయన సారధ్యంలో ఆంధ్ర నాటక కళాసమితి యింతకాలంగా నిత్య నూతనంగా, శక్తివంతంగా, సమర్ధనీయంగా నడుస్తోంది. కళాభిమానుల నుంచి పోషకులవరకు తరతమ భేదం లేకుండా అందర్నీ గౌరవించి అందరి మన్నన ఆయన పొందగల్గుతున్నారు.

ఇటువంటి నిరంతర కళాసంపన్నుడు, వినయశీలి, సౌజన్యమూర్తి సహకారం, సాన్నిహిత్యం ఆంధ్ర నాటకరంగానికి చిరకాలం వుండాలని, వారి సాహచర్యం నావంటి మిత్రులందరికీ సదా లభించాలని కోరుతూ వారి సత్కీర్తి దశదిశలా ప్రసరించాలని మిత్రునిగా కోరుకొంటున్నాను.

★★

# సమీక్ష

ఆంధ్రుల అభిమాన పండుగ— సస్యలక్ష్మి శోభలతో కళకళలాడే పండుగ— సంక్రాంతి. ఈ రోజే ఆంధ్ర నాటక రంగానికి కళా పర్వదినం. ఆంధ్ర నాటక కళాసమితి ఆధ్వర్యంలో, రంగస్థలిపై కళామతల్లి అనుంగు పుత్రుడు, యశోవిలాసుడు, శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారి అభినందన పరంపరయే ఈ పర్వదిన విశేషం. కళా లక్ష్మి ఉప్పొంగి వుత్తేజితమైన పర్వం. కళాపిపాసువులందరూ పులకించిన పర్వదినం.

ఈరోజున శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారిని గూర్చిన అభినందన సభలో సాహితీవేత్తలు, న్యాయమూర్తులు, కళాకారులు. రచయితలు, పురప్రముఖులు వెల్లడించిన అమూల్యాభిప్రాయాలు వారి గుణగణాలను, కళా ప్రతిభను ప్రతిబింబింప చేశాయి.

ఆహ్వానసంఘ కార్యదర్శి శ్రీ ఘంటసాల మాణిక్యాలరావుగారు ఆహ్వానితుల నందరినీ వేదిక పైకి ఆహ్వానించారు. ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ చలువాది సత్యనారాయణగారు సభా వుద్దేశ్యాన్ని విశదీకరించారు. శ్రీ కనిగిచర్ల శేషయ్యగారు సభాధ్యక్షులుగా వ్యవహరించారు. శ్రీ బచ్చు రామచంద్రరావుగారు అతిధులను సత్కరించారు.

ప్రముఖ సాహితీపరులు, చిత్రకారులు శ్రీ సంజీవదేవ్‌గారు ఉపన్యసిస్తూ యిలా అన్నారు: కళాకారుల హృదయం చాలా సున్నితమైనది. అందువలన వారినిగూర్చి చెప్పటం సులభతరం కాదు. ఎవరిని గురించైనా ఒక అభిప్రాయానికి వచ్చే ముందు మానవునిగా మనం వారి వ్యక్తిత్వాన్ని గుర్తించాలి. లక్ష్మీనరసయ్యగారు కళాకారులే కాకుండా వ్యక్తిత్వపు విలువయున్న మంచిమానవుడు అన్నారు. ఎన్నోకళల సమ్మిశ్రమం నాటకకళ. ఇందులో దృశ్యకళ, శ్రవ్యకళ, వాస్తుకళలాంటి వెన్నోవుంటాయి. అందువల్ల యిదొక గొప్ప ప్రయోగం.



శ్రీ సంజీవ్‌దేవ్‌గారు

నటుడు రెండుపాత్రలు గుర్తుంచుకోవాలి. ఒకటి తాను, రెండవది తాను అభినయిస్తున్న పాత్ర సక్రమమైన నటన అంటే తాను ఏదికాదో అది నటించాలి. తన్ను ప్రకటించుకోకుండా పాత్రను పూర్తిగా

ప్రకటించటమే సవ్యమైననటన. నటుడు వ్యక్తిగత జీవితంలోకూడా క్రమశిక్షణ, నిజాయితీ కల్గివుంచేనే ఉత్తమ నటుడుగా గుర్తించబడతాడు. అలాంటి ఉత్తమనటుని ఈ సభాముఖాన గౌరవించటంచాలా సమంజసంగావుంది.

ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తి, సాహితీవేత్త శ్రీఆవుల సాంబశివరావుగారు 'సావనీర్' ఆవిష్కరిస్తూ జీవితం ఒక నాటకం. ఆ నాటకమే జీవితం. నాటకం ఒక తపస్సు. నాటకాన్ని తన జీవితంగా, నాటకాన్ని తన జీవన సర్వస్వంగా



శ్రీ ఆవుల సాంబశివరావుగారు

భావించినవాడు, దాన్ని సాధించినవాడు శ్రీ లక్ష్మీనరసయ్యగారు. ఈ సంచిక వారి జీవితానికి దర్పణం. ఆయన అనేక కళా ప్రయోగాలు చేశారు ప్రజల్ని అలరించే కళల్లో ప్రజల్ని అలరించి, చైతన్యవంతుల్ని చేశారు. నాటకాలు—ప్రజల్ని ఉద్రేకపరచేవి ప్రజల ఆలోచన రేకెత్తించేవి - రెండు రకాలుగావుంటాయి. ఆత్మశక్తిని, జీవనోత్సాహాన్ని ఉద్దీపింపజేసి ఆలోచనా శక్తిని పెంపొందించే నాటకాలు వేయాలి. నాకు తెలిసినంతలో లక్ష్మీనరసయ్యగారు ఆడిన నాటకాలు ఈ వుద్దేశ్యంతో వేసినవే. ప్రజా నాట్యమండలి అందించిన యిలాంటి నాటకాల్లో ఆయన పాత్ర ధరించాడు. నాటకం ప్రజల్ని అలరించి ఉత్సాహపరచి నంతగా సినిమా చేయలేదు. నాటక కళ అన్ని ప్రదర్శన కళలకు తల్లిలాంటిది. అందువల్లనే కళల్లో నా తొలివలపు నాటకరంగానికి అన్నారు. ఇంకా విశదీకరిస్తూ— మనిషిని ప్రభావంతం చేయగలిగేది నాటకం. దీనిలో కళాధిక్యతను తన సొత్తుగా చేసికొని ప్రజలకు సన్నిహితులయ్యారు లక్ష్మీనరసయ్యగారు. ఈ అభినందన ప్రజల దగ్గరినుంచి వచ్చిన ఒక అభిలాష, ఒక కోరిక, ఒక హెచ్చరిక. మీ నుంచి యింకా కళా ఔన్నత్యాన్ని దర్శించాలని కోరుతున్నట్లు భావిస్తున్నాను —— అన్నారు.

ప్రముఖ రంగస్థల, సినీ నటులు శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు ప్రసంగిస్తూ యిలా అన్నారు: సంస్థలు స్థాపించడం తేలికే. కాని అవి కొన్నాళ్ళు జీవించడం కష్టం— వాటిని జీవింపజేయటం కష్టం. ఈ క్లిష్టమైన పనిని సమర్థవంతంగా నిర్వహిస్తున్నాడు లక్ష్మీనరసయ్యగారు. రంగు పూసుకొన్న ప్రతివాడు రంగస్థల నటుడు కాలేడు. కళలో సిద్ధహస్తుడు కావాలి. ఆ సామర్థ్యం వుంది కనుకనే ఆయన అనేక విభిన్న పాత్రలను జీవింపజేసి విశ్వరూపాన్ని సందర్శింపజేశాడు. కేవలం నటనోత్సాహంతో కాకుండా, కేవలం కిరాయి నటుడుగా డబ్బుకోసం, బ్రతుకు కోసం నాటకమాడకుండా ప్రజా చైతన్యంకొరకు రంగు పూసుకొని రంగస్థలమెక్కి విభిన్న పాత్రలు అభినయించారు. ప్రతి వానికి తిండి, బట్ట, యిల్లు కనీసం వుండాలని చాటిచెప్పేందుకు రంగువేసుకున్నారు. బుర్రకథలు, నాటకాలు, నాటికలు, జముకుల కథలు, గొల్లసుద్దులు, చిత్ర విచిత్ర వేషాలు ఎన్నో వేశారు. కేవలం వినోదం కొరకు కాకుండా ప్రజా చైతన్యం కొరకు మూడు దశాబ్దాలుగా నాటకరంగంలో శ్రమిస్తున్నారు. తెలంగాణాలో భూస్వామ్య విధానాన్ని వ్యతిరేకించి ప్రజల్ని మేల్కొల్పారు. అందుకు క్షీణించి పోతున్న అక్కడి ప్రజల జానపద కళారూపాలకు పునర్జన్మ ప్రసాదించి, వాటి ద్వారా వారికి అర్థమయ్యే భాషలో ప్రజా సమస్యల్ని ఎత్తిచూపారు. కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలిలో ప్రవేశించి ప్రజల



శ్రీ మిక్కిలినేని, శ్రీ కర్నాటి, శ్రీ బచ్చు రామచంద్రరావు

కొరకు, ప్రజా వుద్యమాల్లో పనిచేసి, ప్రజా సమస్యలకు సంబంధించిన నాటకాల్లో నటించి ప్రజానటుడు అనిపించుకొన్నారు. మేమిద్దరం కలసి జీవించిన నట జీవితం మహత్తరమైనది, మరపురానిది. అదంతా నేడొక మధురస్మృతి.

లక్ష్మీనరసయ్యగారు ధరించిన ప్రతి పాత్ర క్లిష్టమైనది. కేరక్టరు యాక్టరుగా ఆయన ప్రతిభను వెల్లడి

చేశాయి. ప్రఖ్యాతి చెందిన దర్శకులు అనబడే కొందరికి నటన అంటే ఏమిటో నేర్పిన వాడు లక్ష్మీనరసయ్యగారు అని చెప్పటానికి గర్విస్తున్నాను. ప్రజానాట్యమండలి క్రమశిక్షణను బాగా జీర్ణించుకున్న వాడాయన. కొందరు గొప్పవాడనగానే పొంగిపోయి పతనమవుతారు. కాని ఆయన దాన్ని అండగా తీసు

విధానాన్ని, ఫ్యూడల్‌వ్యవస్థనూ, వెట్టిచాకిరీ విధానాన్ని నిరసించేవారని, అందుకు సామాజికమార్పు అనివార్యం అని భావించి, సామాజిక వ్యత్యాసాలు ఎత్తిచూపటానికి, సంఘాన్ని ఉద్ధరించటానికి నాటకరంగాన్ని, నాటక కళను వినియోగించటం గొప్పవిశేషం అన్నారు. ఈ విధంగా 25 సంవత్స



శ్రీ చుక్కపల్లి పిచ్చయ్య, శ్రీ కర్నాటి

కొని యింకా ఎదగడానికి ప్రయత్నిస్తారు. అందుకే ఆయన నిగర్వి, నిరాడంబరుడు, నిరంతర కళాజీవి- అంటూ లక్ష్మీనరసయ్యగారి సహ కళాకారుడిగా తమ అభిప్రాయాన్ని, గౌరవాన్ని వెల్లడించారు శ్రీ మిక్కిలినేని. వారిని గౌరవించటం ఆంధ్ర నాటక కళాసమితి అనుసరించిన సత్సంప్రదాయం అన్నారు.

శ్రీ చుక్కపల్లి పిచ్చయ్యగారు మాట్లాడుతూ లక్ష్మీనరసయ్యగారు చిన్ననాటినుంచే జమీందారీ

రాలనుంచీ తమ నటజీవితంలో ప్రజాచైతన్యానికి కృషి చేస్తున్నారని వక్కాణించారు. చాలా ఆదర్శవంతమైన గుణగణాలను అలవరచుకొన్న అనుభవశాలి అనీ; ప్రజల్ని అర్థంచేసుకొని ప్రజలకొరకు ప్రజా కళను ప్రయోగిస్తున్న ప్రజానటుడు, ప్రయోక్త అని శ్లాఘించారు.

శ్రీ రెంటాల గోపాలకృష్ణగారు ప్రసంగిస్తూ 1947 వ సంవత్సరంనుంచి తాము సహనటులమని,

లాము వ్రాసిన నాటకాల్లో లక్ష్మీనరసయ్యగారు బహు క్లిష్టమైన పాత్రల్ని వూహించలేనంత సమర్ధవంతంగా నిర్వహించారనీ అన్నారు. మనమంతా జీవితంలో నటిస్తూవుంటాము, లక్ష్మీనరసయ్యగారు నటనలో జీవిస్తూంటారు. కళద్వారా ప్రజల్ని చైతన్యవంతం చేయవచ్చుని భావించే నిర్దుష్ట లక్ష్యమున్నవారు. శ్రీలక్ష్మీనరసయ్య అహర్నిశలూ ఈ రంగస్థలంమీదనే శ్రమించి, ఈ రంగస్థలంమీదనే గౌరవమందటం గొప్పవిశేషం అని అభినందించారు.

శ్రీ సి. యస్. రావుగారు తమ కృతి "కళ్ళు తెరండిరా" నాటికను శ్రీ లక్ష్మీనరసయ్యగార్కి అంకితమిచ్చి హంసకు పాలనుంచి నీటిని వేరుజేసే శక్తి వున్నట్లే లక్ష్మీనరసయ్యగారికి నాటకాలనుంచి



శ్రీ కర్నాటి, శ్రీ సి. యస్. రావు,

మంచి నాటకాలను ఎన్నుకొనే నేర్పు వుందనీ, ప్రేక్షక సంఘాలు లేకపోతే నాటకాలు ముఖ్యంగా ఔత్సాహిక సమాజాల నాటకాలు లేకుండేవనీ, నాటకాలకు జీవగర్ర ప్రేక్షక సంఘాలు అనీ, అలాంటి సంఘం— చైతన్యవంతమయిన, పటిష్టమైన సంఘం— ఆంధ్ర నాటక కళాసమితిని నెలకొల్పి, విజయవంతంగా నిర్వహిస్తున్నందుకు హర్షిస్తున్నాననీ— అన్నారు.

శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు "కళ్ళు తెరండిరా" నాటికనుగూర్చి పరిచయం చేస్తూ సాంఘిక చైతన్యంలో, సాంఘిక అవగాహనతో వ్రాయబడిన నాటిక అనీ, కులమత నిర్మూలన ప్రజాస్వామ్య ఉద్ధరణ జరగాలంటే యింకా సమాజం ఎదగాలి అని, అందుకు యిలాంటి నాటికలు నాటకాలు అవసరమనీ, ఆ ధ్యేయంతో ప్రజానటుడుగా కీర్తించబడుతున్న శ్రీ లక్ష్మీనరసయ్యగార్కి అంకిత మీయబడటం ఔచిత్యమనీ శ్లాఘించారు.

శ్రీ కె. యస్. టి. శాయిగారు ప్రసంగిస్తూ శ్రీ లక్ష్మీనరసయ్యగారు, నటులు ప్రయోక్త, దర్శకులుకారని చెపుతూ అందుకు కారణ కారణ్యాలు విపులీకరించారు. ఒక దృక్పథంతో ఆలోచిస్తే లక్ష్మీనరసయ్యగారివంటి నటులు, దర్శకులు, ప్రయోక్తలు చాలామంది వున్నారని, కానీ మంచి మనసు, మంచి నడవడి, మంచి క్రమశిక్షణ కల్గి ఆచరణలో ఆదర్శాన్నిచూపి మార్గదర్శి అయిన శ్రీ లక్ష్మీనరసయ్యగారివంటి మంచి నటులు, మంచి దర్శకులు కంచుకాగడావేసి వెదకినా కనుపించరు కనుక ఆయన మొదటి కోవకు చెందిన మామూలు నటులు, దర్శకులుకారని విశదీకరించారు. లక్ష్మీనరసయ్యగారు కేవలం నటనోన్నత శిఖరాల నధిరోహించినందుకే కాకుండా మంచి మనసునుకూడా పెంచుకొన్నందువల్లనే మహానటులు, మహామనీషి కాగలిగారన్నారు.

శ్రీ శాయిగారు లక్ష్మీనరసయ్యగారిని నాటకాలాడించే వ్యక్తికాదని ఖండిస్తూ, ఈనాడు నాటకరంగం వృత్తి నాటక సమాజాలు, ఔత్సాహిక నాటక సమాజాలు అని రెండింటిమీద ఆధారపడి వుందని, వృత్తి నాటక సమాజాలకు ప్రదర్శన బాగోగులు కంటె ధనార్జన ముఖ్యం కనుక నాటకాలాడించే తరగతికి అవి చెందుతాయనీ, నూతన ప్రయోగాలతో సమాజ చైతన్యంకోసం, జనానురంజకంగా ప్రదర్శన

శిష్టానికి ప్రయత్నించే ఔత్సాహిక నాటక సమాజాలను కాపాడవలసిన అవసరంతో తన నటజీవితానికి ఓ చిన్న విరామం పెట్టుకొని వాటికి ఆదరణ, ప్రోత్సాహం సమకూర్చుతున్న శ్రీ కర్నాటి నాటకాలాడించే వ్యక్తి అన తగరనీ ఔత్సాహిక నాటకరంగానికి జీవనదాత అనీ, నిస్వార్థ నాటకరంగ సేవకుడనీ ప్రస్తుతించారు.

శ్రీ కోగంటి గోపాలకృష్ణయ్యగారు శ్రీ లక్ష్మీనరసయ్యగారిని తమ చిరకాల మిత్రునిగా, నటునిగా అభినందిస్తూ, కళాకారులను ఆదరించి, సన్మానిస్తున్న సత్సంప్రదాయాలుగల ఆంధ్ర నాటక కళాసమితిని కీర్తిస్తూ కళాపారవశ్యంతో భావ కవిత్వాన్ని వినిపించి కళాభిమానుల్ని సమ్మోహింపచేశారు.

శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు సభాంతంలో తమపైన వర్షించిన అభినందన పరంపరకు కళాంజలి ఘటించి, నటజీవితంలో విద్యుక్త ధర్మాన్నను సరించగలమని వాగ్దానంచేసి, అందరికీ కృతజ్ఞత తెలిపారు.

శ్రీ పెరుమాళ్ళ వెంకటేశ్వరరావుగారి వందన సమర్పణతో సభకు ముగింపు—

★★



శ్రీ ఆవుల సాంబశివరావుగారు శ్రీ కర్నాటిని ప్రత్యేకంగా అభినందిస్తున్న దృశ్యం




**శ్రీ కర్నాటివారి అభినందన సభామంటపం**

వేదికపై ఎడమవైపు ప్రసంగిస్తున్నవారు ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావుగారు. వేదిక నలంకరించిన పలువురు ప్రముఖులు: (ఎడమనుంచి కుడికి)– శ్రీ ఘంటసాల మాణిక్యాలరావు, శ్రీమతి ఆవుల జయప్రదాదేవి, శ్రీ సంజీవదేవ్, శ్రీ కనిగిచర్ల శేషయ్య, శ్రీ కోగంటి గోపాలకృష్ణయ్య, శ్రీ రెంటాల, శ్రీ కె. యస్. టి. శాయి, శ్రీ చుక్కపల్లి పిచ్చయ్య, శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ, శ్రీ బయ్యాన భీమయ్య, శ్రీ సి. యస్. రావు, శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, శ్రీ చలువాది సత్యనారాయణ, శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య. (కుడివైపు)—వక్తలను పరిచయం చేస్తున్న శ్రీ పిడికిటి రామకోటేశ్వరరావు.



శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారి "జీవితం - నాటకరంగం" సంచికను ఆవిష్కరిస్తున్న శ్రీ ఆవుల సాంబశివరావుగారు. ఆహ్వానసంఘ కార్యదర్శి శ్రీ ఘంటసాల మాణిక్యాలరావుగారు

## శ్రీ కర్నాటిని అభినందిస్తున్న పలువురు ప్రముఖులు



శ్రీ బయ్యన భీమయ్యగారు



శ్రీ సజ్జా కోటి సూర్యప్రకాశరావు చౌదరిగారు



శ్రీ ఎ. వెంకయ్య నాయుడుగారు



శ్రీ కనిగిచర్ల శేషయ్యగారు



శ్రీ పెరుమాళ్ళ వెంకటేశ్వరరావుగారు

## శ్రీ కర్నాటిని అభినందిస్తున్న పలువురు ప్రముఖులు



శ్రీ మాజేటి ఆంజనేయులుగారు



శ్రీ గుండా వెంకటేశ్వరరావు B. A



శ్రీ బెల్లంకొండ సూర్యనారాయణగారు



శ్రీ శివకోటి యోగానందముగారు



శ్రీ బచ్చు రామచంద్రరావు, B. Sc, LLB, LSGD.



శ్రీ డి. ఆర్. మోహన్‌గారు



శ్రీ పి. భోజరావుగారు



శ్రీ తేతలి శేషగిరిరావుగారు



శ్రీ జవ్వాజి సత్యనారాయణగారు



శ్రీ దొడ్డపనేని గోపాలకృష్ణగారు



శ్రీ జబ్లూరి పుల్లయ్యగారు



ప్రేమమూర్తి
డాక్టర్ పి. రామకృష్ణారావు M. B; B. S.



శ్రీ బోయపాటి మాధవరావుగారు



శ్రీ కర్నాటిని సత్కరిస్తున్న
శ్రీ పొట్టి సత్యనారాయణగారు



శ్రీ పర్చూరి రాధాకృష్ణమూర్తిగారు

శ్రీ కర్నాటి లక్ష్మినరసయ్యగారిని ఈ అభినందన సభాసందర్భముగాను, అన్యత్ర, సర్వత్ర అభిమానించే వారిలో ఎందరో కళాకారులు, ఎన్నో కళాసంస్థలు, ఎందరో కళాభిమానులు, విభిన్న రంగాలకు చెందిన ఎందరో మిత్రులు, సహచరులు, పురప్రముఖులు వున్నారు. ఈ సభలో పాలుపంచుకొని సత్కరించటానికి అనేకమంది ప్రేమతో కార్యక్రమానికి హాజరై వైభవోపేతంగా సత్కరించారు. అట్టివారి నందరినీ పేరుపేరున ఈ సంచికలో ప్రకటించటానికి, చిత్రములు ప్రచురించటానికి అవకాశం లేకపోయినా వారందరి అభిమానానికి కృతజ్ఞతతో హృదయపూర్వక అభివందనములు అర్పించుకొంటున్నాము.

— పిడికిటి రామకోటేశ్వరరావు
B. Sc.; B. A.
(ప్రధాన సంపాదకుడు)